శ్రీ

# రామచంద్రోపాఖ్యానము.

( పద్యకావ్యము. )

వారణాసి వేంకటేశ్వరకవి ప్రణీతము.

ఇది

బ్రహ్మశ్రీ

పురాణపండ మల్లయ్యశాస్త్రిలుగారిచే

పరిశీలింపఁబడి

శ్రీపీఠికాపురసంస్థానాధీశ్వరులయాజ్ఞానుసారమున

పీఠాపురమునందలి

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1911.

శ్రీగురుభ్యోనమః.

## రామచంద్రోపాఖ్యానము.

# పీఠిక.

రామచంద్రోపాఖ్యానము రామాయణము ననుసరించి చేయంబడినగద్యపద్యాత్మక మగుకావ్యము. ఇందు రామాయణములోని మొదటి యాఱుకాండలయందున్నముఖ్యమైనకథ సంగ్రహముగఁ జెప్పఁబడెను. దీనిని రచియించినవాఁ డాపస్తంబ సూత్రుఁడు విశ్వామిత్రగోత్రుఁడు వారణాసి కామయార్యునకు లచ్చమాంబకును బుత్త్రుఁడు నగువేంకటేశ్వరకవి. ఈయన వెల్నాటి వైదికబ్రాహ్మణుఁడును, సంస్కృతాంధ్రభాషలయందుఁ బండితుఁడును. ఈతఁ డీగ్రంథమును రచియించినట్లును, దీనినిర్మాణమునఁ దోడ్పడినలక్ష్మీపతి యనునసుజుఁడును, జోగన యనుమఱియొకయనుజుఁడును నితని కున్నట్లు నీక్రిందిపద్యమువలనం దెలియును.

"శా. ప్రీతిం బుట్టితి మవ్వధూవరులకుఌ ♦ శ్రీవేంకటేశుండ నే
నేతద్గ్రంథనిబంధనంబునకు నా ♦ కెంతేనియుం దోడు-గాఁ
జేతస్స్ఫూర్తి రచించి పొల్పెసఁగుల ♦ క్ష్మీపత్యభిఖ్యుండు వి
ఖ్యాతప్రజ్ఞుఁడు జోగనాహ్వయుఁడు నా♦గ్యశ్లాఘ్యసంశీలతన్."

మఱియు గద్యమునందుసైతము వేంకటేశ్వరకవియే రచించిన ట్లున్నది. ఇ ట్లున్నను నీగ్రామమున నున్నవారొకరు వీరు

తమకు సన్నిహితబంధువులనియు, వీరిమువ్వుర నెఱుఁగుదుమని యు, వేంకటేశ్వరకవి దీనిని రచియింపనారంభించి మిక్కిలి కొలఁదిభాగమును రచియించి యేకారణముచేతనో మాని తరువాతఁ గొలఁదిదినములలో మృతిఁజెందెననియుఁ, బిమ్మట లక్ష్మీపతియే దీనిని సాంతము చేసి యన్నయందలిభక్తిచే నాయన చేసినట్లే ప్రచురించె ననియుఁ జెప్పిరి ; గాని వీ రెప్పుడు జన్మించిరో, యెప్పుడు స్వర్గమున కేగిరో యెఱుఁగమనిరి. వీరు రచియించిన యితర గ్రంథము లేవియు లేమింజేసియు, శైలి యన్నిభాగముల సదృశమగుటంజేసియు నిందేది యెవరురచించిరో తెలియుట దుస్సాధము. ఈకవి వాసస్థానము గోదావరీమండలములోని పీఠికాపుర ప్రాంతమున నున్నకొత్తయినుకపల్లియనియు, నితఁడు రమారమి యఱువదియేండ్లకుం బూర్వ ముండెననియుఁ జరమదశయందే యీగ్రంథమును రచియించెననియుఁ జెప్పుదురు ; కాఁబట్టి యీ పుస్తక మించుమించుగ, క్రీ. శ. 1850 ప్రాంతమందు రచియింపంబడిన ట్లూహింపఁదగును. పీఠికాపురసమీపగ్రామమున వసియించినకూచిమంచితిమ్మకవివలె నీతఁడును శివభక్తుఁడై తనగ్రంథమును బీఠికాపురమున వేంచేసి యున్నకుక్కుటేశ్వరస్వామికి భక్తిపురస్సరముగ సమర్పించెను. ఇతఁడు తనపూర్వులలోఁ బెక్కండ్రు విద్వత్కవులనియు, రాజులచే సత్కరింపఁబడిరనియుఁ జెప్పి వారుచేసినకావ్యములనుగాని, వారినిసత్కరించినరాజులను గాని పేర్కొనమికిఁ గారణము చింత్యము. కూచిమంచితిమ్మకవి

వలెనే యితఁడు నీగ్రంథము మొదటఁ గొందఱు దేవతలను స్తుతిం చుచు సాధారణముగ నితరకవులు గావింపని గ్రహస్తుతియు గరుడస్తుతియుఁ గావించి పిమ్మట వాల్మీకి వ్యాస కాళిదాసాదిసంస్కృతకవులను, నన్నయాది తెలుఁగుకవులను బొగడి, తనవంశములో మొదటివాఁ డగులక్ష్మణు నొకపద్యమున శివభక్తుఁడనియు, నెల్లవిద్యల నేర్చినవాఁడనియు, సంస్కృతాంధ్రములయందుఁ గవిత్వము చెప్పఁగలవాఁడనియుఁ జెప్పి తరువాత నావంశమున జన్మించినవారిని వరుసగాఁ దనమనుమనివఱకుం జెప్పెను. మఱియు నితఁడు తనప్రాచీనులను గ్రమముగాఁ జెప్పుచుఁ బితామహునిఁగూర్చి యిట్లుచెప్పెను.

శా. "ఆనూరన్నమనీషిసోదరుఁ డజ ♦ స్రాంభోరుహాప్తానుకం
పాసంప్రాప్తసమస్తదేశవిలస ♦ ద్భాషాకవిత్వాదివి
ద్యాసంపాదితరత్నహేమవసన ♦ క్ష్మారామభూషాముఖ
శ్రీసత్కారుఁడు వేంకటేశ్వరుఁడు భా ♦ సిల్లుం జగత్పూజ్యుఁడై."

మ. "సుమనశ్లాఘ్యుఁడు సత్కళానిధియునై ♦ శోభిల్లి మిత్రప్రసం
గము గోవృద్ధివిశేషకారణముగాఁ ♦ గాంక్షించుచుం దండ్రిని
త్యము దన్నుం గని యుబ్బుచుండ విపులా ♦ నంతప్రకాశోదయుం
డు మహోదారుఁడు వేంకటేశకవిచం ♦ ద్రుం డొప్పు నెల్లప్పుడున్."

పిమ్మటఁ దనతండ్రియొద్దనే విద్యల నేర్చికొనిన ట్లీక్రిందిపద్యమునం జెప్పి,

సీ. "ఏధీరవరుసాధు ♦ బోధప్రవీణత
సాహితీవిద్యాభ్య ♦ సనుఁడ నగుట,
యేకవిశ్రేష్ఠుభూ ♦ యిష్ఠోపదేశిత

వివిధాంధ్రకావ్యగ్రంథ ♦ విదుఁడు నగుట
యేలాక్షణికునవ్య ♦ హితశిక్షణప్రౌఢి
సర్వలక్షణవిచ ♦ క్షణుఁడు నగుట
యేమహామహుకృపా ♦ సామగ్రినగ్రియ
జ్యౌతిషగ్రంథసు ♦ జ్ఞాని నగుట
యట్టిరాజాధిరాజస ♦ భ్రాంతరార్య
లోకసంశ్లాఘ్యు సకలక ♦ లాకలాప
నిధి సదభిమానధను ధరా ♦ బుధవిధేయు
మజ్జనకుఁ గామకవిరాజు ♦ మదిఁ దలంతు.”

పిమ్మట నొకపద్యమున సకలపురాణముల నెఱింగినవాఁడనియు, నుభయభాషాకవిత్వము నేర్చినవాఁడనియు, రాజానుగ్రహమునఁ బెక్కుసత్కారము లొందినవాఁడనియుఁ దనపితృసోదరుని స్తుతియించి, తరువాతఁ బెక్కుకన్యాదానములు చేసినమాతామహునిని, శ్రీరామభక్తుఁడు నీతిశాస్త్రనిపుణుఁడు నగుమాతులునిం బొగడి షష్ఠ్యంతములు చెప్పి కథారంభముఁ జేసెను. దీనికిం బూర్వమే రామచరితము ననేకకవులిదివఱకుఁ బెక్కుతెఱంగుల రచియించినను దానును దానినే రచియించుట కీకవి హేతువు నీక్రిందిపద్యమునఁ దెల్పెను.

చ. “తలపఁగ రామచంద్రుచరి ♦ తంబు లనేకము లాదిసత్కవుల్
విలసితమొప్పఁ జెప్పఁ గని ♦ వెండిరచింపఁగ నేమనన్ మహీ
తలమున జానకీప్రియుక ♦ థావిధి భుక్తియుముక్తియున్ గృపన్
గలుగఁగఁజేయునందు రటు ♦ కాన రచించెద భక్తిమీఱఁగన్.”

ఈకవి తెలుఁగుకవులు కొందఱుసాధారణముగాఁ దమ

గ్రంథములయందుఁ జెప్పినట్టిష్టదేవతసాక్షాత్కరించి ప్రబంధము సేయఁ బ్రోత్సాహపఱిచినట్లు చెప్పఁబోలేదు. ఇతఁడు దీనియందు మనోహరము లగుశ్లిష్టపదములతోఁ బురమును వర్ణించెను ; గాని యందయోధ్యాపురము భాగీరథ్యుత్తరతీరమున నున్నట్లు చెప్పెను, రామాయణమునందు సరయూతీరమున నున్నట్లు చెప్పటచేతను, నీగ్రంథముననే విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులను వెంటంగొనిపోవునపుడు సరయువు దాఁటి యచట మార్గమున క్షుత్పిపాసలు నాయాసమును లేకుండుటకై వారికి బలాతిబల లనుమంత్రముల నుపదేశించి కొంతదూరము పోయి యారాత్రి యట విశ్రమించి మఱునాఁడు వేకువ లేచి చాలదూరము పోయినతరువాత గంగను జూచె నని చెప్పటచేతను నిది ప్రమాద మనితోఁచును. ఇందు బాలకాండములో నున్నమలదకరూశదేశములవృత్తాంతములు మొదలగుకొన్ని యంశములు విడువఁబడెను. మఱియు మొదటియాశ్వాసములో దేవతలు విష్ణునిస్తుతించుప్రసంగమునఁ గుమారసంభవములోని యీక్రిందిశ్లోకము సరిగఁ దెనిఁగింపఁబడెను.

"ఆత్మానమాత్మనా వేత్సి సృజస్యాత్మానమాత్మనా
ఆత్మనాకృతినాచత్వ మాత్మన్యేవ ప్రలీయసే."

"ఆత్మచే నాత్మ నెఱిఁగియు ♦ నాత్మచేత
నాత్మ సృజియించి యాత్మయం ♦ దాత్మచేత
నాకృతియుచేత లీన మా ♦ పభవు నాద్య
నిన్నుఁ గొనియాడ నేర్తుమే ♦ నీరజాక్ష !"

ఇంకను రెండవయాశ్వాసములో విశ్వామిత్రునియాగప్రస్తావమున భారతములోని యీ క్రిందిశ్లోకము నక్లే చేయంబడియె.

“ చతుర్భిశ్చచతుర్భిశ్చద్వాభ్యాంపంచభిరేవచ
హూయతేచపునర్ద్వాభ్యాంసమేవిష్ణుఃప్రసీదతు.”

“ నాలుగింటను గ్రమ్మఱ ♦ నాలుగింట
రెంట నైదింట వెండియు ♦ రెంట నలరు
వర్ణమంత్రాదు లాగమ ♦ స్వరవిలోమ
మించుకయు లేక క్రతునిష్ఠ ♦ మించికొనఁగ.”

రామాయణములో భగీరథునకు గంగను బ్రహ్మ యిచ్చెననియు, దానిని పాతాళమునకుఁ బోవకుండ శివుఁడు శిరమున ధరియించెననియు నున్నది. ఇందు శివుఁడే గంగ నిచ్చె ననియీ క్రిందిపద్దమున నున్నది.

“ క. గోకర్ణంబునకుం జని
ప్రాకటమతిఁ దపము సేయఁ ♦ బరమప్రీతిన్
లోకారాధ్యుఁడు ధూర్జటి
నాకధునీబిందు వొకటి ♦ నరపతి కిచ్చెన్.”

ఇట్లు బాలకాండములోనికొన్నికథలను సంగ్రహించియుఁ, గొన్నిటిని వదలియు రెండాశ్వాసములలోఁ జెప్పి, మూఁడవయాశ్వాసములో నయోధ్యాకాండమునందలికథను జెప్పనారంభించి దశరథునకు మునియిచ్చినశాపమును మొదటికాండములోనే చెప్పుటచే వదలి, తక్కినవానిని సంగ్రహముగఁ జెప్పి, యారణ్యకాండకథ నారంభించి, మాండకర్ణిదర్శనము మొదలగువానిని విడిచి, తక్కినవానిని సంగ్రహించి యాయాశ్వాసముననే ముగిం

చెను. వెనుకటియాశ్వాసములలోవలెనే యిందును రామలక్ష్మణులు గంగను దాటుచో వాల్మీకి చేసినగంగాష్టకములోనియా క్రిందిశ్లోకము నొకరీతిం దెనిఁగించెను.

“త్వత్తీరే తరుకోటరాంతరగతో గంగే విహంగోవరం
త్వన్నీరే నరకాంతకారిణివరం మత్స్యోథవాకచ్ఛపః
నైవాన్యత్రమదాంధసింధురఘటాసంఘట్టఘంటారణ
త్కారత్రస్తమస్తవైరివనితాలబ్ధస్తుతిర్భూపతిః.”

“క. గురుతరతావకరోధ
స్తరుకోటరతటకుటీర ♦ సంస్థితఖగముఁ గా
వరమా వేరొకచో రా
జ్యరమేశుం డగుటకంటె ♦ స్వర్ద్వీపవతీ!”

నాల్గవయాశ్వాసమును సుగ్రీవుఁడు ఋశ్యమూకమును సమీపించినరామలక్ష్మణులఁ జూచి, వాలి పంపినవారని భ్రమియించు టాదిగా నాంజనేయుఁడు సీతఁ జూచివచ్చువఱకుఁ గల కిష్కింధాసుందరకాండములయందలికథను బూరించి, యైదవ యాశ్వాసమును రాజపుత్త్రులు వానరసైన్యములతో బయలువెడలు టాదిగా యుద్ధముకొంతవఱకుఁ జెప్పి ముగించి, యాఱవ యాశ్వాసమున దానిని రావణవధవఱకుం జెప్పి పిమ్మట రాముఁడు విభీషణునకు లంకారాజ్యము నాచంద్రార్కముగ నిచ్చి యయోధ్యకు వచ్చి పట్టాభిషేకము నొంది సుగ్రీవాదులను బహూకరించి స్వస్థానములకుఁ బుచ్చె నని చెప్పి గ్రంథమును ముగించెను.

ఇం దచ్చటచ్చటఁ గావ్యలక్షణము లగువర్ణనములు గలవు. ఈయనకవిత్వము ధారాశుద్ధి కలదియు, రసవంతము నై

ప్రాచీనులకవిత్వముం బోలి శ్లాఘ్యమై యున్నది. అచ్చటచ్చట ను "ఎత్తుకపోయె" "చేతును" మొదలగువ్యాకరణవిరుద్ధము లైనప్రయోగములును, రేఫఱకారములకు యతిప్రాసములయం దు మైత్రియుఁ గాన్పించుచున్నను వానిసంఖ్య యల్పముగాన నీ కవనము సలక్షణమనియే చెప్పవచ్చును. ఇందు సందర్భానుసా రముగ నోజఃప్రసాదాదిగుణములును వృత్తులు నలంకారములు మొదలగునవి గలవు. ఇందుఁ గొన్ని భాగములు నారికేళపాకము న నున్నవి గాని చాలభాగములు ద్రాక్షాపాకమున నెల్లవారికి సుబోధములై వినువారి కింపుపుట్టించు చున్నవి. ఈగ్రంథములో నాడాడ నచ్చతెలుఁగులు కలవు గాని కవికి సంస్కృతపదప్రయో గమం దధికాదర మున్నట్లు గ్రంథముం జదువువారికిఁ దోఁచును. మొదటఁ గృతిస్వామి యగుకుక్కుటేశ్వరుని స్తుతించునపుడును, దశరథునియాగకాలమున దేవతలు విష్ణునిస్తుతించుచోటను గేవ లసంస్కృతవాక్యములనే కొన్నింటిని బ్రయోగించెను, తక్కిన భాగములయందును దెనుంగులకంటెఁ దత్సమములే యధికముగ గాన్పించుచున్నవి. ఈగ్రంథములోఁ బ్రసిద్ధులగుమహాకవులప్ర బంధములలోనివానిం బోలినపద్యరత్నములు చాలగఁ గలవు, వానిలోఁ గొన్నిటి నుదాహరించెదను.

సీ. భుజగలోకాధీశ ♦ భోగతల్పశయాన
హారిరూపధర మహా ♦ పురుష యనుచు
నతులాబ్జమకుటవ ♦ ర్ణితపాదరాజీవ

రామార్చనీయ శ్రీ ♦ గంగ యనుచు
మారీచమదభంగ ♦ మహితవాయవ్యాస్త్ర
శరదనిద్రితనేత్ర ♦ జలజ యనుచు
సముద్రగవర్షావ ♦ సరయోగనిద్రాణ
కరిరాజవరద శ్రీ ♦ కాంత యనుచుఁ
దలఁగు నలఁగును నులుపు బె ♦ గ్గిలుచుఁబలుకు
సఖులనయనస్వరశిరోజ ♦ చరణకలనఁ
బవనకందర్పసూనహంస ♦ జవనతురగ
భటనటప్రియ (జలజాత) సముదాయ ♦ పటిమ దోఁప.

ఇది తెనాలిరామకృష్ణకవివిరచిత మైనపాండురంగవిజయములోని దని ప్రాచీనులు చెప్పుదురు; గాని పైఁడిమఱ్ఱివేంకటపతిచే రచియింపఁబడినచంద్రాంగదచరిత్ర నాల్గవయాశ్వాసములోఁ జిత్రసేనపుత్త్రీవిరహావర్ణనములో నున్నది.

సీ. ఫాలభాగస్ఫుర ♦ జ్జ్వాలికానిలమిత్ర
సహసాంకవామోద ♦ చండి యనుచు
రాహుగ్రహాన్వయ ♦ రాజవిభూషణ
హరిదశ్వసుతదర్ప ♦ హరణ యనుచుఁ
జంపకసుమగంధ ♦ చంచర్ఝురీజూట
హిమశైలపూజ్య గౌ ♦ రీశ యనుచు
మరుదంబుపర్ణభు ♦ క్సౌమనేంద్రరక్షక
శరదభ్రనిభగాత్ర ♦ గిరిశ యనుచుఁ
గలఁగు మలఁగును దొలఁగు ను ♦ మ్మలికఁ బలుకు
సీతవాఙ్నేత్రముఖకప ♦ శ్రీఁ దలంచి
సూనశరశశ్యాలిపమోద ♦ శుకపికసిత
కుముదరాజీవచంద్రకి ♦ సమితిఁ దలఁచి.

ఇది యీరామచంద్రోపాఖ్యానములోనిమూఁడవయాశ్వాసములో రామునివిరహావర్ణనములో నున్నది.

సీ. కానక కన్నసం ♦ తానంబు గావునఁ
గానక కన్నసం ♦ తాన మయ్యె
నరయ గోత్రనిధాన ♦ మై తోఁచుఁ గావున
నరయ గోత్రనిధాన ♦ మయ్యె నేఁడు
ద్విజకులాదరణవ ♦ ర్థిష్ణుండు గావున
ద్విజకులాదరణవ ♦ ర్థిష్ణుఁ డయ్యె
వివిధాగమాంతసం ♦ వేద్యుండు గావున
వివిధాగమాంతసం ♦ వేద్యుఁ డయ్యె
గటకటా! దాశరథి సము ♦ త్కటకరీంద్ర
కటకలితదానధారార్ద్ర ♦ కటకమార్గ
గామి యెట్లు చరించు ను ♦ త్కటకరీంద్ర
కటకలితదానధారార్ద్ర ♦ కటకతటుల.

ఇది యయ్యలరాజు రామభద్రునిరామాభ్యుదయములో నైదవయాశ్వాసమున రాముఁ డడవికిం బోవునపుడు దశరథుఁడు విచారించుసందర్భమున నున్నది.

సీ. నిరతవర్ణితభవ్య ♦ తరుఁ డంద్రుగావున
నిరతవర్ణితభవ్య ♦ తరుఁడై యయ్యె
సుమనోధిసేవనా ♦ త్సుక్యుండు గావున
సుమనోధిసేవనా ♦ త్సుక్యుఁ డయ్యె
గోత్రావనవిహార ♦ కుశలుండు గావున
గోత్రావనవిహార ♦ కుశలుఁ డయ్యె
ధరణికన్యేశత ♦ దనరాయఁ గావున
ధరణి కన్యేశతఁ ♦ దనరు టయ్యె

నయ్యరయో! యయ్యజాండు మా ♦ యయ్య సేయు
న్యాయ మేమయ్యె నయ్యరయో ♦ ధ్యాత్యతాంత
రాయ మయ్యజఁ డియ్యెడ ♦ వ్రాయు టరయ
దాశరధికి మహానుకం ♦ పాశరధికి.

ఇది యీగ్రంథములోను మూఁడవయాశ్వాసములో నట్టి సందర్భముననే యున్నది.

సీ. నలినసంభవువాహ ♦ నముపారువంబులు
కులముసాములు మాకుఁ ♦ గువలయాక్షి
చదలేటిబంగారు ♦ జలరుహంబులతూండ్లు
భోజనంబులు మాకుఁ ♦ బువ్వుబోఁడి
సత్యలోకముదాఁక ♦ సకలలోకంబులు
నాటపట్టులు మాకు ♦ నబ్జవదన
మనురాక్షరము లైన ♦ మామాటలు వినంగ
నమృతాంధసులు యోగ్య ♦ లనుపమాంగి
భారతీదేవిముంజేతి ♦ పలుకుచిలుక
సమదగజయాన సబ్రహ్మ ♦ చారి మాకు
వేదశాస్త్రపురాణాది ♦ విద్యలెల్లఁ
దరుణి నీయాన ఘంటాప ♦ థంబు మాకు.

ఇది శ్రీనాథకృతమైననైషధములో రెండవయాశ్వాసమున హంస దమయంతితో సంభాషించుసందర్భమున నున్నది.

సీ. అఖిలలోకారాధ్యుఁ ♦ డగునగేష్వాసనుం
డిష్టదైవము మాకు ♦ హీరరదన
సకలజగత్సర్గ ♦ చతురుఁ డౌచతురాస్యుఁ
డన్వయస్వామి మా ♦ కబ్జవదన
కడలేనివిడిముడి ♦ గలయులకేశ్వరుం

డ్రగజన్ముఁడు మాకు ♦ హరిణనయన
స్వారాజ్యపతి యగు ♦ జంభాసురారాతి
పరమభృత్యుఁడు మాకుఁ ♦ బద్మగంధి
తొల్తదెస కేనితోడుకు మా ♦ దొడ్డిగిడ్డి
పెట్టుచెట్టు తలంప మా ♦ పెరటిచెట్టు
కనకసాలాంకలంక మా ♦ కునికిపట్టు
పాలఁతి నీయాన నాయాన ♦ భువనములకు.

ఇది యీగ్రంథమున మూఁడవయాశ్వాసములో రావణు డు సీతతో సంభాషించుచో నున్నది,

సీ. వెలివెట్టిరే బాడ ♦ బులు పరాశరుఁ బట్టి
దాశకన్యాకేళి ♦ తప్పుఁ జేసి
కులములో వన్నె త ♦ క్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక ♦ మట్టుటికము
ననువుకాఁడై వేల్పు ♦ నాగవాసముఁ గూడి
మహిమ గోల్పోయెనే ♦ మాండకర్ణి
స్వారాజ్య మేలంగ ♦ నీరైరె సుర లహ
ల్యాజారుఁ డైవజం ♦ భాసురారి
వారికంటెను నీమహ ♦ త్వంబు ఘనమె
పవనపర్ణాంబుభక్షులై ♦ నవసి యినుప
కచ్చడాలట్టుకొనుముని ♦ ముచ్చులెల్లఁ
దామరసనేత్రిలిండ్ల బం ♦ దాలు గారె.

ఇది యాంధ్రకవితాపితామహునిస్వారోచిషమనుచరిత్ర ములో రెండవయాశ్వాసములో వరూధిని ప్రవరునితోఁ జేయు సంభాషణమున నున్నది.

సీ. క్రీడింపదే శర్వ ♦ రీవల్లభునితోడ

నార్యసన్నుత సురా ♦ చార్యభార్య
భోగింపదే సుధా ♦ భుఙ్నాథుతోడ గౌ
తమతాపసోత్తము ♦ ధర్మపత్ని
రమియింపదే వేడ్క ♦ రత్నాకరునితోడ
హారకపర్దాంతర్వి ♦ హారి గంగ
వరియింపదే తుపా ♦ వరశిరోలంకారు
ఘనదారుకావని ♦ మునివనితలు
వారలెల్ల మహాపతి ♦ వ్రతలు గారె
సరససౌభాగ్యసౌందర్య ♦ పురుషుఁ గనిన
సంచలింపదె భువి నెట్టి ♦ సాధ్వియైనఁ
జాలు నీనిష్ఠ లేల న ♦ న్నేలు మబల.

ఇది యీపొత్తమునాల్గవయాశ్వాసములో రావణుఁడు సీతతోఁ గావించినసంభాషణములోనిది.

ఈయనకవిత్వశైలి దెలియుట కిదివఱ కుదాహరించినపద్యములే చాలిన నింకను నొక్కొకయాశ్వాసమున కొక్కొకపద్యము నుదాహరించి యీయంశమును ముగింతును.

సీ. ఘను లేగుదెంచిన ♦ తనవారిలో నెంచి
జీవనం బిచ్చి ర ♦ క్షించుదాత
భువననిదానమై ♦ కువలయప్రియము గాఁ
గళల కిమ్మగుపుత్త్రిఁ ♦ గనినయనఘు
క్షితిజనుల్ గొనియాడ ♦ సిరికిఁ బుట్టినయిల్లు
పురుషోత్తమస్థితిఁ ♦ బొసఁగుధన్యు
బలవైరిభయమునఁ ♦ బరఁగు భూభృత్తుల
మనుప వాహినుల నే ♦ లినమహాత్ము
శోభితానంతరత్నధా ♦ మాభిరాముఁ

గంకణకలాపలసదూర్మి ♦ కాపరంప
రావిరాజితచిత్రాంబ ♦ రప్రదేశు
భూరిసత్త్వ నపారగం ♦ భీరుఁ గనిరి. ప్ర. ఆ. 99

సీ. సకృపాణు లైనట్టి ♦ జననాథకులజులు
విబుధసంసేవనో ♦ ద్వృత్తు లగుట
ధార్మికోత్తము లైన ♦ ధరణీతలేశ్వరుల్
స్వస్త్రీసమాగమా ♦ సక్తు లగుటఁ
బ్రధనదానప్రౌఢిఁ ♦ బరఁగినవరపతుల్
సతతసత్పదవీప్ర ♦ శస్తు లగుట
సుశ్లోకవైభవ ♦ శుభు లైనరాజులు
విపులాగమాంతప్ర ♦ విష్టు లగుట
చాల విని శస్త్రమును విల్లు ♦ జాతరోష
మును గళాపూర్తి విడువక ♦ ముదము గదుర
నిటులు నాథాటి కెదుట ని ♦ ల్చుటను నీవు
విష్ణుపదవాసి వగుటను ♦ వింతగలదె? ద్వి. ఆ. 156

చ. సితగరుదేణపల్లవని ♦ చిత్రవిలాసము నుర్వికన్యస
ద్గతికచనేత్రమధ్యకర ♦ కంఠరవంబులు గెల్చె వెండియుక్
క్షితిధరచక్రికీరముల ♦ చెల్వ మణంచెఁ దలంచి చూడ న
య్యతివనితంబదంతసమ ♦ దగ్రకుచాననవాక్యగంధముల్. తృ. ఆ. 249

శా. సాహంకారభయంకరభ్రుకుటిధూ ♦ మాంతర్జ్వలద్దృష్టివి
ర్వాహావిర్భవవిస్ఫులింగచయముల్ ♦ రాలంగఁ గ్రవ్యాదసం
దోహం బెల్ల వడంకఁ జూచుచును బు ♦ త్తుగ్రిన్ సారెవాగ్రుచ్చుచుక్
హాహాకారము సేయుచుక్ దనుజవం ♦ శాధీశ్వరుం డత్తటిక్. చ. ఆ. 178

శా. అన్నా! లోకహితాన్వయేశ్వరునిబా ♦ హాశక్తి సామాన్యమే
యన్నా! యెన్ని విధంబులన్ సమిదుపా ♦ యంబే యపాయంబు నీ
కన్నా! కూడ దటన్న నాఫలము ల ♦ భ్యం బయ్యె నీచెల్మి సే

య న్నాకుం బనిలే దటంచును నిజా ♦ ప్తామాత్యసంయుక్తుఁడై. పం. ఆ. 58

మ. కుటిలభ్రూకుటిదుర్నిరీక్షవిలస ♦ త్క్రోధాత్ముఁడై నీవు మ
ర్కటకోటిం బరిమార్చి రమ్మనిమహా ♦ కాయు న్నియోగించినం
ఉటుముప్పం జతురంగసైన్యయుతుఁడై ♦ దిక్కుల్ చలింపన్ విశం
కటఘంటారవముప్పఁ దేరిపయి వే ♦ గం జెక్కె యుగ్రాకృతిన్.

ష. ఆ. 56

శ్రీపీఠికాపురమండలాధీశ్వరులు, మహాబాదారులు, గవిత్వరసజ్ఞులు నాకుం బోషకులు నగు మ. రా. రా. శ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యారావు బహదరు ప్రభువువారు పురాతనగ్రంథములు దొరకిన లోకోపకారార్థ మచ్చువేయింతు రనివిని యీగ్రామవాస్తవ్యుఁడు హనుమానుల రామచంద్రునిపుత్త్రుఁడు నారాయణమూర్తి యనువైశ్యకుమారుఁడు తనయొద్ద నున్నదానిని దాటియాకులపై వ్రాయఁబడిన దాని నక్కడక్కడ శిథిలమైనదాని నీపాత్తమును వారిసమ్ముఖమునకుం బంపికొనఁగా శ్రీమంతు లగునాప్రభువా రాతనికిం దగుపసదనం బొసంగి పుచ్చుకొని మఱియొకప్పు డీగ్రంథమును రచించినకవివంశజుఁ డగుద్విజవరుఁ డొకపుస్తకము నట్టిదానిన శిథిలముకానిదానిని వారిసన్నిధికిం బంపికొనఁగా దానినిసైతముఁ గ్రహించి యారెంటిని వారిపాఠశాలయం దాంధ్రభాషాప్రధానోపాధ్యాయుఁడను, నాస్థానమున నాంధ్రగ్రంథశోధకుఁడను వ్యాఖ్యాతను (Editor & Annotator) నగునాకుం బ్రసాదించి యచ్చొత్తింపఁ దగునట్లు సవరించి వ్రాయింపు మనిసెలవొసంగిరి.

నేను వారియానతి శిరంబున వహించి యథామతి చక్కంబఱిచి యట్లు చేసితి. నే నెంతపాటుపడి పరిష్కరించినను నాప్రమాద మున నేని యజ్ఞానమున నేని దోషంబు లుండనోపుఁ; గాన క్షమి యింపవిద్వచ్ఛిఖామణుల వినీతితోడం బ్రార్థించెదను.

పీఠికాపురము.
4 - 11 - 11

ఇట్లువిన్నవించువిధేయుఁడు,
పు॥ మల్లయ్యశాస్త్రి.

శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీ రామచంద్రోపాఖ్యానము.

## ప్రథమాశ్వాసము.

శ్రీకైలాసవసుంధరాధరముపై ♦ శీతాంశుకాంతస్ఫుర
త్ప్రాకారాంచితహేమరత్నఖచిత ♦ ప్రాసాదరాజంబులో
నాకద్వీపిని గౌరియుం గొలువఁగా ♦ లైవ్వ యుండుశంభుండులో
కైకస్వామిమహేశ్వరుండొసఁగుమా ♦ కశ్రాంతమైశ్వర్యముల్.

సీ. జలధిజాశయకుశే ♦ శయదర్శితాదర్శ
చంచన్ముఖాబ్జ యే ♦ చంచలాక్షి
విధివధూచాతురీ ♦ విరచితకుంకుమాం
కితఫాలభాగ యే ♦ కీరవాణి
గిరిభిద్రమణ్యాలం ♦ కృతపారిజాతదా
మస్ఫురద్వేణి యే ♦ మందగమన
ధనదకాంతాదత్త ♦ తాంబూలచర్వణా
రక్తబింబోష్ఠి యే ♦ రాజవదన
యమ్మహాశైలకన్య లో ♦ కైకమాన్య
పరమకళ్యాణి గిరిధను ♦ ర్ధరుని రాణి

యనుదినము మాకుఁ గరుణాక • టాక్షదృష్టి
నెసఁగి కల్యాణసాకల్య • మొసఁగుఁగాత. 1

చ. తొలకరిమించుపై నెసఁగు • తోరపుజొంపపుమేచకాభ్రమం
డలముగతిన్ నితాంతసుమ • నశ్శరకేళిదృఢాంకపాళి కిం
పలరఁగ లక్ష్మితోడఁ గవ • యం దమకించుదయాంబురాశి స
న్నలినదళాక్షుఁ గొల్చెద న • నారతమున్ మదభీష్టసిద్ధికిన్. 3

సీ. అక్షీణకరుణాక • టాక్షసంవీక్షణ
సతతసంరక్షిత • సకలలోక
రమణీయవిస్ఫుర • ద్రాజీవచిత్రసౌ
ధాంతరవిహరణ • హర్షితాత్మ
భిదురభృన్ముఖహరి • త్ప్రియవధూఫాలభా
సితభవ్యకుంకుమాం • కితపదాబ్జ
శక్రనీలోపలా • స్థానపీఠాయిత
సరసీరుహాక్షవ • క్షఃకవాట
యగుచు రాణించుధన్య దు • గ్ధాబ్ధికన్య
సిరుల నిరవొందునాదుమం • దిరమునందుఁ
బస నెసంగుపదార్వాన్న • పసిఁడితూఁగు
టుయ్యెలలలోన నూఁగుచు • నుండుఁగాత ! 4

మ. శతమన్యుప్రముఖాఖిలత్రిదశశీ • ర్షస్వర్ణకోటీరసం
తతిసమ్యక్స్ఫురితప్రకీర్ణనవర • త్నశ్రేణికాకాంతివే
ష్టితభాస్వత్పదపద్ముఁడై యొసఁగురా • జీవాసనుం డంతయున్

సతతంబీవుతఁగూర్మిమాకుసకలై ♦ శ్వర్యాయురారోగ్యముల్.

సీ. ఏజవరాలు నా ♦ నాజగత్సృష్టికా
ర్యధురంధరునకు శు ♦ ద్ధాంతకాంత
యేచంద్రవదన వా ♦ చాచాతురీపూర్ణ
కవిజనశ్రేణికిఁ ♦ గన్నతల్లి
యేదేవి సమధిక ♦ వేదాదివిద్యామ
యప్రపంచంబున ♦ కాదిమూల
మేకొమ్మ నిఖిలమౌ ♦ నీంద్రదేప్సితోత్కృష్ట
పరమార్థపదవికిఁ ♦ బట్టుఁగొమ్మ
యట్టిలోకాంబ విమలకృ ♦ పావలంబ
శారదాంబ కరంబు ని ♦ చ్చట మదీయ
చిత్తశృంగాటకాంచద్వి ♦ చిత్రవీథి
మొందుకొని కూర్మి విహరించు ♦ చుండుఁగాత! 6

చ. ధనదవయస్యకంఠసము ♦ దంచితధాతృకపాలమాలికల్
గొనకొని కాంచి మోదమున ♦ గుండ్రపుటుండ్రములంచు నెంచి కై
కొనుటకు డాసి రాఁ దివియఁ ♦ గోరి చెలంగెడుబల్లిదుఁడ గదా
నను వినుతింతు సంతతము ♦ నాదుమనోరథసిద్ధి కెంతయున్.

సీ. శ్రీరామపాదరా ♦ జీవయుగ్మవిధేయుఁ
ద్రిదివాధిపాద్యాది ♦ దేయగేయు
సకలభక్తకదంబ ♦ సంరక్షణోపాయు
భూమిజాస్తవనీయ ♦ నామధేయుఁ

త్రిజగత్కరండపూ ♦ రితయశస్సముదాయుఁ
ప్రత్యర్థివర్గమ ♦ ర్దనపటీయు
సాలచరాన్వయ ♦ జలనిధానాత్రేయుఁ
ప్రచురబాహాబల ♦ భాగధేయు
సుగుణధౌరేయు సురగిరి ♦ స్ఫూర్తికాయు
వరగుణనికాయు సుకవీంద్ర ♦ వర్ణనీయు
మథితదైతేయు లోకైక ♦ మాననీయు
నాహవాజేయు నుతిసేతు ♦ నాంజనేయు. 8

క. ఇనశశికుజబుధగురుకవి
శనిరాహుధ్వజుల నెపుడు ♦ స్మరియింతుమదిన్
వినుతింతు గరుత్మంతున్
ఘనభుజబలవంతు దాంతుఁ ♦ గరుణాస్వాంతున్. 9

శా. విద్వద్వందితు వామలూరుతనయున్ ♦ వేదాంతవిజ్ఞానుఁ గృ
ష్ణద్వైపాయను సత్కవిత్వరచనా ♦ చాతుర్యభోజావనీ
భృద్వర్యున్ ఘనుఁ గాళిదాసు సుకవిన్ ♦ శ్రీహర్షుభాషావిశే
షాద్వంద్వున్ జయదేవుఁ బేర్కొనుదుని ♦ త్యంబున్ వచస్సిద్ధికిన్

క. మున్నుగ నాంధ్రకవిత్వం
బెన్నిక సృజియించి జగతి ♦ నింపొందినస్పా
యన్నయు నన్నయు మఱియును
వన్నియ గనుకవులఁ దలఁతు నా ♦ కిస్సిద్ధి కైదన్. 11

గీ. ప్రసవిత్రీశబ్దార్థ ♦ భావరసచ

మత్కృతులు గల్గునెడల స ♦ మ్మదము నొంది
వ్యాజములు గల్గుచోట ని ♦ ర్వ్యాజములుగఁ
జేయునుకవుల సన్నుతి ♦ సేతు మదిని. 12

క. కలనైనఁ గావ్యమర్మము
దెలియక కృతకృతులతోడ ♦ డీకొని దుశ్శం
కలఁ జేయఁదివురునసమా
ఖ్యులఁ గుకవుల వేరె లెక్క ♦ గొన నేమిటికిన్. 13

సీ. గృహమేధి యొకఁడు భ ♦ క్తి దలిర్పఁ బెద్దలఁ
దెచ్చి పూజించి యా ♦ తిథ్య మిచ్చి
వెల తర్గ గలమేలు ♦ కొలుచుఁ గోరికఁ గొని
చేలావరుగ దంచి ♦ చేటఁ బోసి
చెరిగి మల్చియు బాగు ♦ చేసి క్రొమ్మెఱ దంచి
తెలిచాయబియ్యము ♦ తేటనీటఁ
గడిగి వండినవంట ♦ కము పాయసము భక్ష్య
ములు షడ్రుచులు గూర్చి ♦ తళియ నిండ
నొసఁగి యామెత వెట్టిన ♦ మెసవుకొనుచు
నలుసులరసిననెటనైనఁ ♦ గలుగుటరుదె?
కానఁగృపఁజిత్తగింపుఁడి ♦ కావ్యరచన
నృపమహితులారవిద్వత్క ♦ వీంద్రులార! 14

క. అని యిష్టదేవతావం
దనము కవీంద్రాభినంద ♦ నంబును మఱి నా

ధునికకవిబహూకారం
బును గుకవితిరస్కరణముఁ ♦ బొనరిచి వేడ్కన్. 15

శా. శ్రీపీఠాఖ్యపురీమహేశ్వరునకున్ ♦ సేమంబుతో నంకితం
బొపాదించి ప్రబంధమే నొకటి సే♦యంబూనితిన్ రామచం
ద్రోపాఖ్యానమనంగ రామకథ యా♦ర్యుల్మెచ్చ నాచంద్రతా
రాపూషంబుగ నుండుఁగాత ధర ధీ♦రశ్రోత్రసమ్మోదమై. 16

చ. తలఁపఁగ రామచంద్రుచరి♦తంబు లనేకము లాదిసత్కవుల్
విలసిత మొప్పఁ జెప్పఁగని♦ వెండి రచింపఁగ నేమనన్ మహీ
తలమున జానకీప్రియు క♦థావిధి భుక్తియుముక్తియున్ గృపన్
గలుగఁగఁ జేయు నందు రటు♦ కాన రచించెదభక్తి మీఱఁగన్.

వ. అని సితాంతకౌతూహలాయత్తచిత్తుండనై మఱియు మదీ
యేష్టదేవతాప్రార్థనంబుఁ జేసెద. 18

సీ. శ్రీరాజరాజేశ్వ♦రీసమాఖ్యామహార్య
పరివృఢకన్యకా ♦ ప్రాణనాథ!
పంకేరుహాసన ♦ పాకశాసనముఖ్య
సవనాశనార్చిత ♦ చరణయుగళ!
వందారుసనకస ♦ నందనాదిమునీంద్ర
చత్వరస్థితదివి ♦ షన్మహీజ!
నీహారనాకధు♦ నీహారశరశార
దాభ్రాభ్రగజనిభ ♦ శుభ్రగాత్ర!
సితగిరినివాస! బుధనుత ♦ చిద్విలాస!

రవిశశిశిరథాంగ! విశ్వంభ ♦ రాశతాంగ!
భుజగవరహార! పీఠికా ♦ పురవిహార!
మారమదభంగ! కుక్కుటా ♦ కారలింగ! 19

సీ. శ్రీమద్వచోమాని ♦ నీమహాశ్చర్యకాణి
నాకలోకేభవి ♦ భాకులాని
దుగ్ధపాథోధిస ♦ మృద్ధామయూథాని
పుండరీకప్రభా ♦ మండలాని
బృందారకాపగా ♦ మందభాబృందాని
కైలాసశైలరు ♦ గ్జాలకాని
మహనీయసురమహీ ♦ రుహాదీప్తిజాతాని
విపులశుభ్రచ్ఛదో ♦ ద్రసపటలాని
వ్యాళనాయకరుచిచక్ర ♦ వాళకాని
కంబువిస్ఫారశోభాక ♦ దంబకాని
భువివిజత్వావిరేజరె ♦ తవయశాంసి
మారమదభంగ! కుక్కుటా ♦ కారలింగ! 20

వ. అని, ఇష్టదేవతాప్రార్థనంబుఁ జేసి ప్రబంధనిబంధనప్రమోద మానహృదయుండనై మదీయవంశావతారం బభివర్ణించెద.

సీ. ధాత్రి నాపస్తంబ ♦ సూత్రవిశ్వామిత్ర
గోత్రపవిత్రిఁచా ♦ రిత్రికుండు
వసుధాసుధాశినా ♦ న్వయదుగ్ధపాథోధి
పౌర్ణమాస్యుత్పల ♦ బాంధవుండు

బాలేందు శేఖర • పాదపంకేరుహ
ధ్యాననిష్ఠాధీన • మానసుండు
సకలవిద్యావిశే • షసమార్జితాభర
ణార్వభూజాంబూన • దాంబరుండు
పరఁగుఁ బరదారజనతమో • భాస్కరుండు
సంస్కృతాంధ్రకవిత్వవి • శారదుండు
వారణాసిమహావంశ • కారణుండు
లక్ష్మణార్యుండువర్ణిత • లక్షణుండు. 22

క. అతని కుదయించిరి ప్రి
ద్యోతనవరలబ్ధపటుమ్రు • దుత్వకవిత్వ
ఖ్యాతుఁడు మల్లకవీంద్రుం
డాతతసద్గుణుఁడు పేర • నార్యుఁడు నెన్నన్. 23

వ. అందు. 24

క. శ్రీమద్గుణుఁ డగ్రిజుఁ డగు
నామల్లనసుకవి ప్రముద • మలర నసంతాం
బామహిళ వరించెను హరి
ప్రేమరమాదేవిఁ దగ వ • రించినకరణిన్. 25

గీ. అవధూవరులకుఁ బుట్టి • రాత్మజులు ది
వాకరానుగ్రహప్రాప్త • వాఙ్మహత్వ
ఘనులు శ్రీసూరనాఖ్యన • త్కవియు వేంక
టేశ్వరకవీశ్వరుండు వి • ఘ్నేశ్వరుండు. 26

ఉ. భూరమణాభినంద్యులును ♦ భూరిగుణాఢ్యులు నైనవారిలో
నారయ సూరనార్యునకు ♦ నాత్మజు లుద్భవ మొందిరుక్తిగం
భీరు లుదారధీయుతు ల ♦ మేయశమాన్వితు లుర్విపాలస
త్కారులు వేంకటేశ్వరుఁడు ♦ గంగనయుంగవిరాజసంతుఁడున్.

క. అందగ్రజుండు జగదభి
నందితుఁ డగువేంకటేశ ♦ నాముఁడు గనియెన్
బొందుగ జలనిధి చంద్రుగ
తిం దనయున్ సూరనాఖ్యు ♦ దివ్యసమాఖ్యున్. 28

గీ. అవ్విపశ్చిచ్ఛిఖామణి ♦ కాత్మజుండు
హర్ష మొదవంగ నుదయించె ♦ నార్యనుతుఁడు
వేంకటాఖ్యుండు సదసద్వి ♦ వేకఘనుఁడు
సరసహృదయుండు విద్యావి ♦ శారదుండు. 29

క. ఆరీతిని నిజసంతతి
ధారుణి నభివృద్ధిఁ బొంద ♦ ధన్యుం డగుచున్
సూరిజనస్తుతమతి యా
సూరనకవి వెలయుచుండె ♦ శుభగుణనిధియై. 30

శా. ఆసూరన్నమనీషిసోదరుఁ డజ ♦ స్రాంభోరుహాస్త్రానుకం
పాసంప్రాప్తసమస్తదేశవిలస ♦ ద్భాషాకవిత్వాదివి
ద్యాసంపాదితరత్నహేమవసన ♦ క్ష్మారామభూషాముఖ
శ్రీసత్కారుఁడు వేంకటేశ్వరుఁడు భా ♦ సిల్లుం జగత్పూజ్యుఁడై.

మ. సుమనశ్శ్లాఘ్యుఁడు సత్కళానిధియు నై ♦ శోభిల్లి మిత్రప్రసం

గము గోవృద్ధివిశేషకారణముగాఁ ♦ గాంక్షించుచుం దండ్రి ని
త్యముఁ దన్నుం గని యుబ్బుచుండ విపులా ♦ నంతప్రకాశోదయుం
డు మహోదారుఁడు వేంకటేశకవిచం ♦ ద్రుం డొప్పె నెల్లప్పుడున్

క. ఆ వేంకటకవిచంద్రుఁడు
పావనగుణ లచ్చమాంబ ♦ పత్నిగఁ దనరున్
భావజజనకుఁడు లక్ష్మీ
దేవి రమణి గాఁగఁ బరఁగు ♦ తెఱఁగున నెలమిన్. 33

క. ఆ మిథునమునకుఁ బుట్టిరి
రామకవీంద్రుఁడును మల్ల ♦ కవియును బుత్త్రుల్
ధీమహితుఁడు వారలలోఁ
గామయ లచ్చాంబ పత్ని ♦ గా విలసిల్లెన్. 34

శా. ప్రీతిం బుట్టితి మవ్వధూవరులకున్ ♦ శ్రీవేంకటేశుండ నే
నేతద్గ్రంథనిబంధనంబునకు నా ♦ కెంతేనియుం దోడుగాఁ
జేతస్స్ఫూర్తి రచించి పొల్పెసఁగుల ♦ క్ష్మీపత్యభిఖ్యుండు వి
ఖ్యాతప్రజ్ఞుఁడు జోగనాహ్వయుఁడు నా ♦ కత్యశ్లాఘ్యసంశీలతన్.

గీ. అందు నాకుద్భవించి రా ♦ నంద మలర
నందనులు రామనయు సూర ♦ నయు ననంగ
మత్సహోదరుఁ డైన ల ♦ క్ష్మణున కెలమి
సూనుఁ డుదయించె వేంకటే ♦ శుండు ఘనుఁడు. 36

క. ఘను లగు మత్తనయులలో
ననవద్యాత్మునకుఁ గామ ♦ నాఖ్యున కెలమిన్

జనియించెఁ బ్రథమపుత్త్రి౯
దనఘుఁడు శ్రీవేంకటేశ్వ ♦ రాహ్వయుఁ డెలమి౯. 37

గీ. ధరణి నిటు మత్కులంబభ్యు ♦ దయపరంప
రాభివృద్ధియు శ్రీయు వి ♦ ద్యయును బుద్ధి
యును రఘుస్వామికారుణ్య ♦ మునను గలిగి
తనరుఁగావుత మాచంద్ర ♦ తారకముగ. 38

మ. సరసాగ్రేసరుఁ గొల్తు మజ్జనకు వి♦శ్వామిత్రగోత్రోద్భవు౯
ధరణీనాయకపూజితు౯ వివిధవి♦ద్యాకౌశలు౯ భూమిని
ర్జరవంశోత్తము వారణాసికులపా♦రావారరాకాసుధా
కరుశ్రీవేంకటసత్కవీంద్రతనయు౯ ♦ గామయ్యనామార్యుని౯

సీ. ఏధీరవరుసాధు ♦ బోధప్రవీణత
సాహితీవిద్యాభ్య ♦ సనుఁడ నగుట
యేకవిశ్రేష్ఠుభూ ♦ యిష్ఠోపదేశిత
వివిధాంధ్రకావ్యార్థ ♦ విదుఁడ నగుట
యేలాక్షణికునవ్య ♦ హితశిక్షణప్రాప్తి
సర్వలక్షణవిచ ♦ క్షణుఁడ నగుట
యేమహామహుకృపా ♦ సామగ్రినగ్రియ
జ్యోతిషగ్రంథసు ♦ జ్ఞాని నగుట
యట్టిరాజాధిరాజస ♦ భాంతరార్య
లోకసంశ్లాఘ్యసకలక ♦ లాకలాప
నిధి సదభిమానధను ధరా ♦ బుధవిధేయు

మజ్జనకుఁ గామకవిరాజు • మదిఁ దలంతు. 40

క. ఘనతరగుణగణ కనవర
తనుతచరిత్రకుఁ బతివ్రి • తాజనతిలకం
బునకున్ లచ్చాంబకు మ
జ్జననికి వందన మొనర్తు • సమధికభక్తిన్. 41

సీ. బహుపురాణగ్రంథ • పౌరాణికత్వాప్త
కుండలాదిసమస్త • మండనుండు
నరపాలసంసజ్జ•నశ్లాఘనోభయ
భాషాకవిత్వవి • శేషఘనుఁడు
నృపకృపోపార్జిత • పృథులమాన్యక్షేత్ర
హయరత్నజాంబూన • దాంబరుండు
సతతవిశ్రుతతప • స్సత్యవాక్కులశీల
శమదమవిజ్ఞాన • సంయుతుండు
వారణాసిమహావంశ • వార్ధిచంద్రుఁ
డగుజగత్పూజ్య ధిషణాసు • ధాశనేజ్య
మహితగుణభవ్యుఁ గృతకావ్యు • మత్పితృవ్యు
మల్లనార్యు నజస్రంబు • మదిని దలఁతు. 42

మ. అనయంబుం బ్రణుతింతుభక్తినవసం•ఖ్యాతీయకన్యాప్రదా
ననితాంతప్రథితుం దనూజగుణసం•తానాభ్యుదంచత్సమా
ఖ్యునిశ్రీరామపదారవిందభజన•ప్రోత్కంఠుజోగన్నా[హ్వయున్.
మునిఁగొల్లూరికులాంబురాశిహిమధా•మున్నాదమామాత్తామ

సీ. శ్రీరామచంద్రపా • దారవిందద్వంద్వ
సతతసంసేవనా • సక్తచిత్తు
బాంధవాతిథిజన • ప్రీణితానవరతాన్న
దానసమార్జితో • త్కటసమాఖ్యు
భూతలఖ్యాతపు • ణ్యేతిహాసపురాణ
సద్గ్రంథపఠనసం • శ్రవణనిరతు
బార్థివస్తవనీయ • పంచాంగసుస్థిర
మంత్రరక్షణకళా • మహిమవేద్యుఁ
గులశిఖరిస్థైర్యుఁ గొల్లూరి • కులపయోధి
సోము జోగన్ననామార్య • సూను మత్పి
సూసహోదరు సద్గుణ • శోభివేంక
టాచలసమాఖ్యు ననుదిన • మభినుతింతు. 44

క. ఏతాదృశాస్మదన్వయ
జాతజనపరంపరేష్ట • సత్ఫలదాన
ఖ్యాతలమందారమహీ
జాత మగుమహేశ్వరునకు • షష్ఠ్యంతంబుల్. 45

ఉ. శూలికి ధైర్యశాలికిని • సూనృతశీలికిఁ బార్వతీమనో
జ్ఞాళికి భక్తదుష్కృతమ • హాటవికీలికి విద్విషత్తమో
హేళికి సంతతార్యజన • భృంగకదంబలసన్మృణాళికిన్
బాలితవాసవాదిసుర • పాళికి హేమసుధాంశుమౌళికిన్. 46

ఉ. హారికిఁ బన్నగప్రకర • హారికి భవ్యతపఃపారరుక్కశా

ధారికి భక్తలోకభవ ◆ దారికి దుగ్ధపయోధిపాండురా
కారికి దేవసంఘశుభ ◆ కారికి వారణదైత్యగర్వసం
హారికిఁ బీతికాపురవి ◆ హారికిఁ బంచశిలీముఖారికిన్. 47

ఉ. పాటితవైరికోటికి సు ◆ పర్వగణస్తుతజన్యవిస్ఫుర
ద్ధాటికి భాసమానహిమ ◆ ధామకిరీటికి శుభ్రభద్రరా
ఘోటికి దుష్టగోత్రిశత ◆ కోటికి నాకధునీలసజ్జటా
జూటికి భక్తలోకధన ◆ శోభితపేటికి దిక్పశాటికిన్. 48

ఉ. రామకథాసుధారసవి ◆ రాజితమామకకావ్యకన్యకా
స్వామికిఁ బార్వతీస్ఫురిత ◆ వామికిఁ బాండురపుంగవాసకృ
ద్ధామికి దత్తభక్తజన ◆ కామికిఁ గుక్కుటరాజవిగ్రహ
స్వామికిఁ బద్మజప్రముఖ ◆ సన్నుతసద్గుణజన్మభూమికిన్. 49

వ. భక్తిపురస్సరంబుగా నాయొనర్పం బూనినరామచంద్రోపా
ఖ్యానం బనుమహాప్రబంధంబునకుం గథాప్రారంభంబు. 50

మ. పరగుం బేర్మిఁ బురీలలామ మవనిన్ ◆ భాగీరథీనిమ్నగో
త్తరతీరంబున భర్మనిర్మితకన ◆ త్ప్రాసాదకూటాగ్రసం
చరకాంతాస్యసుధాంశుదర్శనలస ◆ త్స్వస్సింధుఖేలన్మరు
త్తరుణీలోచనకైరవంబయి యయో ◆ ధ్యానామధేయంబునన్.

సీ. సతతాఖిలాగమో ◆ చ్చారణసుస్వరా
భ్యంచితవిప్రవ ◆ రాశ్రితంబు
మానితద్విరదము ◆ ఖానంతవాహినీ
సహితరాజవతంస ◆ విహరణంబు

సుమనోధిపార్థద • ప్రమదాన్వితాధిక
    శ్రీమదార్యాసక్త • జృంభితంబు
కమనీయగోరాజ • గణవైభవసమగ్ర
    పాదజాతనితాంత • భాసితంబు
మహితగురులోకపితృపితా • మహసమేత
విబుధసంతానసంతత • విలసితంబు
నగుచుఁ గైలాసశైలంబు • పగిది జగతిఁ
బరఁగు ననిశంబు సాకేత • పట్టణంబు. 52

చ. హరిణగభస్తి రేయి చర • మాద్రికి సేగుచు నప్పురిం గరం
బరుదగుతుంగవప్రశిఖ • రాగ్రము దాఁకి కడిందిఁ గంద దు
ర్భర మగుమచ్చ వచ్చె నిది • బద్ధనిపల్కఁగశాంచితక్షపా
వరుసకు లోనఁ గందు గన • వచ్చుటకుం గత మేమి నిచ్చలున్.

చ. అతులమహాగభీరపరి • ఖాంబువిహారభుజంగమాంగనా
ప్రతతిమహాఘణద్యుతులు • పల్మరు నారసి పుష్పలావికల్
మతి నరుణోత్పలాబ్జకుసు • మభ్రమ డాసి తదీయభీకరా
కృతి పరికించి తత్తరిలి • త్రిమ్మరు చుండుదు రప్పురంబునన్. 54

సీ. నిఖిలలోకాకర్ణ • నీయషడ్జస్వర
    కూజద్భుజంగభు • గ్రాజరాజి
ప్రకటమనోహర • పంచమనిస్వన
    మహితవసప్రియ • మండలంబు
ప్రథితమంజులసుధా • రసమధురోదార

గీరమావిస్ఫుర♦త్కీరవితతి
ప్రసవనిష్యందమ♦రందపానానూన
తుందిలేందిందిర♦బృందములును
బొసఁగి పరిపక్వఫలకోశ♦కుసుమముకుళ
దళకిసలయుక్త వివిధపా♦దపవిరాజ
మానశృంగారకేళికో♦ద్యానవనవి
తానములు వొల్చు నారాజ♦ధానిలోన. 55

చ. నలుతొలుపల్కులం జదువ♦నల్గొగముల్ గలయట్టిపద్మజుం
డెలమిఁ బదక్రమంబులు గ్ర♦హించి కడుం దడఁబాటు గాక నే
ర్పలరఁగఁబల్కెనేనిదొర♦యాఁదమకంచుఁ బురిన్ ద్విజుల్ మహిన్
గలఘునవిద్యలొక్కొకము♦ఖంబునఁ బల్కుచునుందు రెప్పుడున్.

సీ. అనిహతకువలయా♦హ్లాదు లౌవసునాథు
లనిశారిభీకరు♦లైనరాజు
లక్రూరదృష్టిచే♦నలరారుమంగళు
లయుగకన్యాధీశు♦లైనసౌమ్యు
లపరితగోత్రభి♦ద్వ్యాపారు లగుగురు
లనభినిందితబుధు♦లైనసుకవు
లప్రాప్తవక్రాధ్వు♦లగుమిత్రసంతతు
లభయదులగునహీ♦నాంకనాము
లరయ జిష్ణులు శుచులు ధ♦ర్మాధిపతులు
పుణ్యజనులు ప్రచేతులు♦భూరిబలులు

శ్రీదు లార్యైశ్వరులు మహా ♦ సేను లనఁగ
నప్పురంబున నొప్పుదు ♦ రవనిభుజులు. 57

చ. అనయము భైత్ష్యవృత్తి నజి ♦ నాంబరకృచ్ఛ్రిత సర్థదేహిహృమై
తనయనుఁ గుగ్గుఁడై విసము ♦ ద్రావిన నోర్చి యదక్షిణాశ నం
దినధననాథు నెంచి తమ ♦ నెచ్చెలికోటికి నిచ్చు దీరఁ గొ
ల్చును ధన మిచ్చి దక్షిణత ♦ శోభిలఁ బ్రోతురు వీటికోమటుల్.

మ. మొలకుం దెల్లనిబట్టయుం బశుచయం ♦ బుం గల్గి తానుర్విలాం
గలముల్ మోపినసాటియానవిహాలిం ♦ గర్హించుచుల్ హాలికుల్
తెలిబట్టల్ పశువర్గముం గలిగిధా ♦ త్రిం దున్ని ధాన్యంపుఁగు
ప్పలు పెన్గొండలతీవి నొప్పఁగఁ బురిం ♦ బండింతు రేవేళలన్.

సీ. కలకంఠి నెఱిసోయ ♦ గమున సుకేశియై
వెలయంగ నమరత ♦ విభున కరుదె
గజయాన మృదులాస్య ♦ గతి శశిరేఖయై
వఱల నస్వప్నత ♦ వరున కరుదె
నతి మహితోరుల ♦ క్షుణత రంభాస్ఫూర్తిఁ
బరఁగ ననిమిషత ♦ భర్త కరుదె
యువతిలీలాతను ♦ ద్యుతుల హేమాగూఢఁ
దగ సౌమనస్యంబు ♦ మగని కరుదె
యనుచు స్వస్త్రీపరాఙ్ముఖా ♦ యత్తబుద్ధి
నలరుబోఁటుల నలరించు ♦ చెలువుఁ గలిగి
చిత్రితరరూపరాజీవ ♦ పత్త్రినేత్రి

లప్పురంబున నొప్పదు • రనుదినంబు. 60

సీ. కటిసీమ నటియించు • కబరీభరముసంచు
సజలనీలాంబుద • చ్ఛాయ నెఱపఁ
దళతళ లీనుని • ద్దంపుమేనులజాను
క్రొమ్మించుఁదీవల • కొమరు గఱప
హురుమంజిముత్తెంపు • సరులచొక్కపుసొంపు
పలుమరు వడగండ్ల • చెలువువఱప
గడితంపురతనంపుఁ • గంకణధ్వనిసొంపు
గరువంపుటురుముల • యొఱపు మెఱప
నరస మగువర్షకాలల • క్షణము గలిగి
తెరువరుల నెల్లఁ దల్లడ • పఱచునట్టి
శాలిపాలివధూజన • జాల మెలమి
రాణఁ దనరారు నప్పుర • రాజమునను. 61

మ. పురిహస్త్యున్నతి కల్గి దిక్కరివరం•బు ల్గెల్వఁగాఁ బోయి మో
హారముల్ దీరిచి హానితోఁదడవుపో•రాడెంతయుందూలుటన్
హరిదంతంబులు వట్టె నీపలు కస•త్యం బన్న నుర్విం గరు
డ్విరదంబుల్ గడలంటి యుండుట నిజం•బే కాదె చర్చించినన్.

చ. పురిహరి వేగ మేణగణ•ముల్ గని మోర్వక గెల్వ వచ్చి త
త్త్వర కొగి నోడి పాఱి వన•వాసతృణాశ చలేక్షు లొంద నం
దిరుశివచంద్రులన్ శరణు • సీఁగి భజింపఁగఁబోలుఁ గానిచో
హరిణము లిట్టు లుండుట ని•రర్థక మే భువి నాఁడునాఁటికిన్.

సీ. ప్రత్యగ్రకేతన ♦ ప్రకరాగ్రవిఘటితాం
బరకాంతిధవళితాం ♦ బరతలములు
చిత్రరత్నస్ఫుర ♦ చ్ఛిఖరసంఘర్షణ
శీకరీకృతనాక ♦ లోకసదులు
కమనీయఘంటికా ♦ గణఘణంఘణరావ
బధిరీభవత్కకు ♦ ప్పంచయములు
ఘనచక్రచక్రచం ♦ క్రమణసంరంభవై
భవనిరాకృతసుప్ర ♦ భంజనములు
కనకమణిమయవలభికా ♦ కాంతినిచయ
సతతదూరీకృతధ్వాంత ♦ సముదయములు
నగుచుఁ దనరారుసర్వంస ♦ హాజనాభి
నందనము లైనతత్పుర ♦ స్యందనములు. 64

సీ. కడు మగంటిమి మీఱఁ ♦ గాలవిజ్ఞానుఁడై
ధర్మయుద్ధము సేయఁ ♦ దలఁచెనేని
విద్యుద్విభాస్ఫుర ♦ ద్వివిధాయుధము లూని
కలహంబు గావింపఁ ♦ గడఁగెనేని
బలసముద్దాముఁడై ♦ బారుఁ దీరిచి సారె
రిపులతో దుర మొన ♦ రించెనేని
గురుసంప్రదిష్టత ♦ గురుధనుర్విద్యావి
శారదుం డయి యాజి ♦ సలిపెనేని
వీరుఁ డై నట్టినరసింహ ♦ విభుఁడు తమకు

దోర యగు నటంచునవ్వర ♦ వరమునందు
వఱలుదు రురుప్రధనశూర ♦ వైరినలిన
విదళనమదోత్కటు లైన ♦ వీరభటులు. 65

గీ. ఆపురంబున నెంతయు ♦ ననుదినంబు
నాపురందరుభోగభా ♦ గ్యములపగిది
నేపు రంజిల్ల సర్వోర్వి ♦ నేలుచుండి
కాపురం బుండు దశరథ ♦ క్ష్మావిభుండు. 66

సీ. ప్రత్యర్థిభూధవ ♦ ప్రకరపర్వతవ్రజ
మిత్రసముద్రన ♦ క్షత్రభర్త
ప్రఖ్యాతగుణలతా ♦ ప్రచురాలవాలంబు
మహితకీర్తిమరాళ ♦ మానసంబు
శిష్టసారసవనీ ♦ విష్టపబంధుండు
దుష్టదంతావళా ♦ ధోరణుండు
బంధుషట్పదగణ ♦ ప్రసవవద్భూజంబు
శ్రితనీలకంఠవా ♦ ర్షికపయోద
మంచు జను లెంచ ధరణిఁ బా ♦ లించుచుండె
దనుజవిజయసహాయసం ♦ జనితవితత
హర్షపూర్ణమనస్సుమ ♦ నోధినాథ
దత్తసుమనోరథుం డగు ♦ దశరథుండు. 67

సీ. శారదాశరదర ♦ శారదశరధర
పంచాస్యపంచాస్య ♦ పటలములను

కులిశాబ్జనారద ♦ కలశాబ్ధిపారద
　　ఫేనభేనోపల ♦ బృందములను
హారనీహారప ♦ టీరకర్పూరమం
　　దారకాదంబక ♦ దంబములను
తారాభ్రవాహినీ ♦ తారాభ్రనాహానే
　　భాహిరాడ్డీరస ♦ మూహములను
దినదినంబున నిరసించి ♦ తనయశంబు
పెంపు రాణింప ధరణిఁ బా ♦ లింపుచుండె
సత్త్రిముఖ్యమహాదాన ♦ సతతపోషి
తక్షమాతలవిబుధుండు ♦ దశరథుండు. 68

సీ. తనయశశ్శుభసుధా ♦ ధామబింబంబున
　　కంబరం బంచితాం ♦ కంబు గాఁగఁ
దనప్రతాపసువర్ణ ♦ తరుశాఖకర్కశమం
　　డలము శోభితపక్వ ♦ ఫలము గాఁగఁ
దనధైర్యగిరివరం ♦ బునకుఁ జామీకరా
　　చలముఖాద్రులు గండ ♦ శైలములుగఁ
దనమహాగాంభీర్య ♦ వనరాశి కరయ ర
　　సాతలం బూర్ధ్వవి ♦ ష్టపము గాఁగఁ
దనజగన్మానితానూన ♦ దానకల్ప
సాలమునకు సమస్తయా ♦ చనకజనవి
తానము లభంగభృంగసం ♦ తతులు గాఁగ

దనరు నందితవిబుధుండు ♦ దశరథుండు. 69

సీ. అశ్రాంతసత్యలో ♦ కావనచతురత,
మహనీయపురుషో త్త ♦ మప్రసిద్ధి,
నిరుపమరాజశే ♦ ఖరలక్షణంబునఁ,
బరబలోచ్ఛేదన ♦ పౌఢిమమునఁ,
బ్రతిదినపద్మినీ ♦ హితకరోదారత'
విబుధపోషణకళా ♦ విభ్రమమున,
గోత్రపరిత్రాణ ♦ గుణవిశేషంబున,
వాహినీసంసక్త ♦ వైభవమున,
వాగ్వరుఁడో, శ్రీవిభుండో, స ♦ ర్వజ్ఞుఁడో, సు
రేంద్రుఁడో, రశ్మిమంతుఁడో, ♦ చంద్రుఁడో, మ
హామహీభృద్వరుండో, ర ♦ త్నాకరుండో
యనుచు జను లెన్నఁ దనరె న ♦ య్యవనిభుజుఁడు. 70

గీ. శ్రీసతియు భూమిసతియు నీ ♦ లాసతియును
వెలఁదులుగ నొప్పుశ్రీమహా ♦ విష్ణుపగిదిఁ
దనరుఁ గౌసల్యయును గైక ♦ యును సుమిత్రి
యును సతులు గాఁగ దశరథ ♦ జనవిభుండు. 71

ఉ. అంతట నొక్కనాఁడు మృగ ♦ యాభిరతిం దురగంబు నెక్కి భూ
కాంతుఁడు శౌర్యభవ్యులమృ ♦ గవ్యులఁ దోడ్కొని యొక్క కాననా
భ్యంతరసీమకుం జని మృ ♦ గాళి హళాహళి నొందఁ జేసి యా
వంతయుఁ గొంకు లేక వివి ♦ ధాయుధముల్ ధరియించి క్రుమ్మరెన్.

వ. మఱియును. 73

గీ. మృగయు లోకకోంద అందంద ♦ మేయసార
సారమేయశిరోధిసం ♦ సక్తభర్మ
పాశభృత్ప్రాణులై వెంటఁ ♦ బరువువెట్ట
మెందుకొను కోర్కి వేఁటాడు ♦ చుండి యచట. 74

క. అమలినయశుఁ డవ్వసుధా
రమణుఁడు గనుఁగొనియె నబ్బు ♦ రంబుగ ననకృ
త్సుమనస్స్నుతగుణవల్లిం
దమసాకల్లోలినీమ ♦ తల్లిన్ బ్రోలన్. 75

చ. కనుఁగొని యన్నదీనికట ♦ కాననసీమ నధిజ్యధన్వుఁడై
తొనరి కడింది ప్రోడతన ♦ మొప్పఁ జరాచరలక్ష్యవృత్తి నె
మ్మనమున నూల్కొనంగఁ బలు ♦ మారును ద్రిమ్మరియంతనత్తటం
బున నొకక్రేవ నిమ్మెఱఁగి ♦ పొల్పుగ రేతఱిఁ బొంచియుండఁగన్.

మ. పితృతృష్ణాహరణైకవృత్తి మది దీ ♦ పింపం గతాఘుండు మా
నితనూజుం డొకరుండు కుండిక సరి ♦ న్నీరంబులో ముంప భూ
పతి యాధ్వాన మనేకపధ్వనియ కా ♦ భావించి యేయన్ శరా
హతుఁ డత్తాపసి వ్రాలెఁ బేరెలుఁగుతో ♦ హా! తాత! యం
[చున్ మహిన్.

క. అమ్మునిరవ మాలించి స
యమ్ము నిరవశేషముగ ల ♦ య మ్మయ్యెనె? నా
యమ్మున నని చింతిలుచు భ

యమ్మున నటఁ దరలి యతిర ♦ యమ్మున నరిగెన్. 78

క. అరిగి మునితనయుచందం
బరసి యయ్యో! యింత యయ్యె ♦ నా! యనుచుఁ గడుం
బరితాపింపఁగ నీరై
దరదమ్ములదొరను గూర్చి ♦ యతఁ డిట్లనియెన్. 79

గీ. ఇచట నీవిట్లు చింతిల ♦ నేమి గలదు!
చంద్రులై నిన్ను శపియింప ♦ కుండఁ గుండ
వారి వారి కొసంగి వి ♦ దారితారి!
తల్లిదండ్రుల ననుఁ జేర్పు ♦ ముల్లమలర. 80

చ. అని మునిసూతి వల్క నపు ♦ డట్లుగఁ దత్పితృవాసభూమికిం
జనిన నిజాత్మజుం డని ని ♦ శాసమయంబునఁ జేకులన్ మున
ళ్లను మము నీడ నుంచి మన ♦ లందగునయ్య! యటన్న భీతి స
జ్జనపతి సాంత్వనోక్తుల ని ♦ జస్థితిఁ దెల్పుట కుద్యతాత్ముఁడై.

క. నీతనయుండనుగా నప
నీతనయుండను ఖలుండ ♦ నింద్యగుణుఁడ పు
ణ్యేతరమతి ననుచు సమా
ఖ్యాతాత్మకథావిధానుఁ డగు ♦ నాతనితోన్. 82

గీ. పగతురమె రేపగలు దలం ♦ పఁగ నపగత
నయనయతులఁ దనయనయ ♦ నయనుల శుభ
మతుల నిటుల యతివ్యథా ♦ యుతులఁ జేయ
నాయమేనా యమేయధ ♦ స్వధరమణికి. 83

శా. దూషించేపకుఁ జిక్కి చీకుల మముం • దుఃఖాబ్ధిపా ల్చేసి త
ద్యూ! పాపాత్మ! కిరాతరీతి మృగయే • హంగాన కేతెంచియే
లా పోకార్చితి పీగుణాఢ్యు? నరపా • లా! నీకునుం బుత్త్రక
ష్టావస్థావసరంబె యంత మగు నం • చవ్వాని శాపించినన్.

క. ఆశాపము దనకుం దన
యాశాకారణము గాఁగ • నాత్మ నరసి యా
శ్రీశానుగ్రహమున నీ
యాశాస్యము దొరకె ననుచు • నతికుతుకమునన్. 85

గీ. వేఁట చాలించి క్రిమ్మఱ • వీటి కరిగి
సురల హరిరీతి జనముల • నరసి సౌఖ్య
మలర భూచక్ర మేలి మే • లనెడువిభవ
మొప్పఁ బేరోలగం బుండి • యొక్కనాఁడు. 86

క. నిగమాంతచర్చ సేయుచు
నిగమార్థంబులును స్మృతులు • నెమ్మది వినుచున్
జగతీనాథుఁ 'డపుత్త్ర
స్య గతి ర్నాస్తి' యనుస్మృతివ • చోర్థజ్ఞుండై. 87

సీ. ప్రచురతనూజనా • మాజ్య మబ్బినఁగాని
యతులితప్రమదాభి • యుతత యేల?
ప్రథితసంతానమై • భవము గల్గినఁగాని
విశ్రుతకులగోత్ర • విభుత యేల?
నందనవిహారణా • నంద మందినఁగాని

యధిగతసౌమన ♦ స్యం బదేల?
సకుమార భవ్యల ♦ క్షణత గల్గినఁగాని
సమధికరాజభూ ♦ షణత యేల?
యనుచుఁ దనుఁ దాన నిరసించు ♦ కొని కరంబు
ధరణిజను లెన్నసుగుణసం ♦ తతిని భువన
మాన్యపురుషోత్తమగురుత్వ ♦ మహిమఁ జెంది
జన్మసాఫల్య మొనరించు ♦ సరణిఁ దలఁచి. 88

ఉ. శిష్టజనాగ్రగణ్యుని వ ♦ సిష్ఠునిఁ గన్గొని పుత్త్రిలాభసం
తుష్టి ఘటిల్లురీతి సుజ ♦ నుల్ గొనియాడ వచింపు మన్న ను
త్కృష్టఫలప్రదంబు జగ ♦ తిన్ హయమేధమె కాన తావకా
భీష్టముదానఁ జేకుఱు న ♦ రేశ్వర! యన్న సుమంత్రుఁ డయ్యెడన్.

ఉ. స్రష్టృకుమారుఁడై జగతి ♦ సన్నుతి కెక్కు సనత్కుమారుచే
స్పష్టముగా నెఱింగితి వి ♦ భాండకనందను ఋశ్యశృంగు ను
త్కృష్టతపోధనుం గరము ♦ ప్రీతిగఁ దోడ్కొని వచ్చి పుత్త్రికా
మేష్టి యొనర్చినం భవద ♦ భీష్టము చేకుఱునయ్య భూవరా! 90

గీ. అనుసుమంత్రోక్తి యిష్టకా ♦ మ్యార్థసిద్ధి
గలుగఁ జేయు సుమంత్రోక్తి ♦ గాఁ దలంచి
యపుడ తగువారి నశ్వమే ♦ ధాధ్వరప్ర
యత్న మొనరింప నియమించి ♦ యతిరయమున. 91

క. నానావిధోపదానవి
తానాంజలిసచివుఁ డగుచు ♦ ధరణీశుఁడు వా

జ్ఞానిం గన నరిగెడుసను
రానీకబలారిపగిది ♦ నరిగి వినయతన్. 92

క. శాంతాకాంతాసహితుని
శాంతాత్ముని ఋశ్యశృంగు ♦ సంయమివరు నా
శాంతానంతాపతిస్వని
శాంతాగతుఁ జేసికొని వె ♦ సం గుర్వాజ్ఞన్. 93

మ. సరయూద్వీపవతీతటంబున సమ♦స్తర్షుల్ ద్విజుల్ యాజకుల్
పరివేష్టింపఁ గృతాశ్వమేధుఁ డయి భూ♦పాలుండు శాంతాసతీ
వరునాజ్ఞం దనయేష్టి సేయుచు హవి♦ర్భాగార్థమింద్రాదులం
గరమాహూయము సేయరావణవధో♦త్కంఠామరాన్వీతులై.

చ. హరిశుచివహ్నిశక్రులు కృ♦తాంతయమాగ్నివృషుల్ సురారిక
ర్బురహరికీలిజిష్ణు లుద♦పూరపయాత్వినజానలాద్యరుల్
హరిమరుదప్పదైత్యమహి♦పాశ్వశిఖింద్రులు శ్రీదయక్షకాం
బురమణదానవార్కహుతభు♦జ్మఘవుల్ హరుఁగూడియయ్యెడన్.

ఉ. మున్ను దశాననుం డధిక ♦ మూర్ఖతఁ జేయువిపత్పరంపరల్
ఖిన్నత నవ్విరించి కెఱిఁ ♦ గించిన నే నసమర్థుఁడన్ మహా
పన్నశరణ్యుతో దనుజ ♦ భంజనుతో నిది విన్నవింప నా
పన్నగశాయి దీర్చు మన ♦ బాధ లటన్నఁ ద దీక్షణేచ్ఛలై.

క. సత్యజగదీశ్వరాద్యా
దిత్యులు గనుఁగొనిరి జలజ ♦ దృగ్విభుసేవా
నిత్యతఁ జని చని తటినీ

పత్యంగీకరము కలశ ♦ సలిలాకరముఁ. 97

వ. మఱియును. 98

సీ. ఘను లేగు పెంచిన ♦ తనవారిలో నెంచి
జీవనం బిచ్చి ర ♦ క్షించుదాత
భువననిదానమై ♦ కువలయప్రియముగాఁ
గళలకి మ్మగుపుత్త్రిఁ ♦ గనినయలఘు
క్షితిజనుల్ గొనియాడ ♦ సిరికిఁ బుట్టినయిల్లు
పురుషోత్తమస్థితిఁ ♦ బొసఁగుధన్య
బలవైరిభయమునఁ ♦ బరఁగుభూభృత్తుల
మనుప వాహినుల నే ♦ లినమహాత్ము
శోభితానంతరత్నధా ♦ మాభిరాముఁ
గంకణకలాపలసదూర్మి ♦ కాపరంప
రావిరాజితచిత్రాంబ ♦ రప్రదేశు
భూరిసత్త్వ నపారగం ♦ భీరుఁ గనిరి. 99

గీ. కని తదీయనభోవీథి ♦ కాలసత్స
మగ్రరంగత్తరంగసం ♦ పద్విలోక
మాత్రహర్షాంతరంగులై ♦ మహితభక్తి
నతనిఁ గొనియాడఁ గడఁగి ర ♦ య్యమృతభుజులు. 100

చ. అరయ సమస్తలోకమున ♦ కబ్బురపుంగథకంటెచూవుచే
సిరులిడుకన్నియం గనియు ♦ శిష్టజనాగ్రణివై తనర్చుతా
మరకనుదోయిదేవరకు ♦ మచ్చిక నిచ్చినమేటి వీవకా

తిరముగ సర్వశైవలవ ♦ తీగృహమేధి ! సుధాపయోనిధీ ! 101

గీ. మున్నె మాకెన్నఁటికి నెన్న ♦ ముసలితనము
నాఁకలియు వేఁకి చావును ♦ లేకయుండ
నమృత మిడి మమ్ము మనిచిన ♦ యధికధన్యుఁ
దరమె కొనియాడ నిన్ను ను ♦ ధాపయోధి. 102

సీ. అని దుగ్ధపాథోధి ♦ ననవధిగా యథా
విధి నుతు లొనరించి ♦ యధికభక్తి
నంధకారాతిశై ♦ లాంతరసంచర
త్కమనీయఘనఘనా ♦ ఘనముకరణిఁ
బాలమున్నీటియు ♦ ప్పరిగెలో బోధిత
యోగనిద్రాణుఁడై ♦ యున్నయట్టి
కమలాసమన్వితుఁ ♦ గౌస్తుభోద్భాసితుఁ
గాంచనాంబరధరుఁ ♦ గమలనయను
విశ్వమయు విశ్వకారణు ♦ విశ్వగర్భు
విశ్వవిభు విశ్వపోషకు ♦ విశ్వవిలయు
విశ్వవందితు విశ్వాద్యు ♦ విశ్వవేద్యు
విశ్వనామకు శ్రీమహా ♦ విష్ణు మఱియు. 103

గీ. భోగిభోగాసనాసీను ♦ భువనరక్షుఁ
దత్ఫణీంద్రఫణాగణో ♦ దంచదమల
రత్నభాసితదివ్యవి ♦ గ్రహము నమేయు
నాదినారాయణునిఁ గాంచి ♦ రమరు లపుడు. 104

క. కనుఁగొని వినయము పెనఁగొనఁ
బనివడి తృష్ణాతురుండు ♦ ప్రప చేరుక్రియన్
వనజాక్షుని డాయంజని
యనిమిషతతి వొగడఁదొడఁగె ♦ నామోదమునన్. 105

మ. జలజాక్షాయ నమోస్తు తే భగవతే ♦ శ్యామాంగశోభాయకుం
డలితల్పాయ ప్రసూనచాపగురవే ♦ నానాజగద్వ్యాపినే
కలశాంభోనిధికన్యకాధిపతయే ♦ గాంగేయచేలాయ ని
ర్మలకారుణ్యకటాక్షరక్షితముని ♦ వ్రాతాయ దైత్యారయే.

క. హరయే శాత్రవమస్త
కిరయే చరమాంగభరిత ♦ గిరయే ఖలమ
ధ్వరయే కైటభవారణ
హరయే వైకుంఠపురవి ♦ హారాయ నమః. 107

క. గురవే మదనస్య మరు
త్తరవే శశ్వత్సమాశ్రి ♦ తానాం జగతాం
గురవే తపస్వినాం ఘన
తరవేదాంతార్థవిదిత ♦ తత్వాయ నమో. 108

క. శరధిశయనాన్యథాన
శ్శరణ న్నాస్తి త్వ మేవ ♦ శరణం తస్మా
త్కరుణాకటాక్షదృష్ట్యా
కురు ఫలితార్థాన్ సదా సు ♦ కుశలా నస్మాన్. 109

చ. అని కొనియాడి వెండియు న♦యమ్మున నోజగదీశ్వరా దశా

ననుఁ డాసరించుబాధఁ గని • నన్ విశదం బగుఁ గాని విన్నవిం
చిన నదియే మగుం గరుణ • చే మము మన్పఁ దలంచితేని య
ద్దనుజు వధింప మత్స్యనవ • తారముఁ దాల్పుము వేయునేటికిన్.

క. అసురవలన దొసఁగులఁ బడి
మిసిమిఁ దొలఁగి విసిగి విసిగి • మే మీదెసకున్
వెస నరుదెంచితి మిఁక మా
యసురత్వావిధి దలంపు • మార్తశరణ్యా. 111

చ. ఘనుఁడు ఘనుండు నీఁగి నుద • కప్రదుకన్న సుధాకరుండుశ్లా
ఘనగుణుఁ డభ్రచంద్రముల • కంటె నురాగము మేలువారిదేం
ద్వనిమిషధారిణీజములకన్నిటికంటెఁ బయోధి హెచ్చుఁ ద
ద్ఘనశశికల్పవార్ధులకుఁ • గర్తవు గావునఁ బ్రోవు మచ్యుతా!

మ. అనవద్యున్ ఝషకూర్మఘోణినరహ • ర్యత్వావనీదేవనం
దనసమ్యగ్భృగురామముఖ్యవిలస • న్నానావతారంబు లొం
దినచిన్మూర్తి ననంతు నాద్యునభవున్ • దేజోనిధిం ధార్మికున్
నిను వర్ణింపఁ దరంబె మాదృశులకు • న్నీరేజపత్రేక్షణా. 113

గీ. ఆత్మచే నాత్మ నెఱిఁగియు • నాత్మచేత
నాత్మ సృజియించి యాత్మయం • దాత్మచేత
నాకృతియుచేత లీనమా • నభవునాద్యు
నిన్నుఁ గొనియాడ నేర్తుమే • నీరజాక్ష! 114

సీ. గగనగాయత్ర్యగ్ని • ఖరసుధాధామది
క్స్వర్గవాణీశ్రుతి • క్రతుభుగబ్ధి

కీనాశపవమాన ♦ మానీంద్రసర్వంస
హాతలమ్ములు నీకు ♦ నరయ శీర్ష
కచముఖదృక్కర్ణ ♦ కంఠజిహ్వోక్త్రిబా
హాకుక్షిమానస ♦ ప్రాణరోమ
చరణంబులును గాఁగ ♦ జగదేకవ్యాపివై
దీపించునిరవద్య ♦ దివ్యచరిత
నిన్ను వర్ణింప నలవియె ♦ నిక్కువముగ
వేయునేటికి మానుష ♦ వేష మూని
పఙ్క్తికంధరుఁ జెండాడి ♦ పరమకరుణ
మమ్ము రక్షింపవయ్య! ర ♦ మాకళత్ర! 115

చ. అనుడు రమామనోహరుఁడు ♦ హర్షమెలర్పఁగ వారిఁ జూచి యో
యనిమిషులార! మీరలు భ ♦ యంపడ నేటికి? నేఁటికద్దశా
స్యుని హతుఁగాఁ దలంపుఁడు త్రి ♦ శుద్ధిగ నే నిదె ధాత్రిలోనన
ద్దనుజు వధించెదన్ దశర ♦ థక్షితినాథునకున్ సుతుండనై. 116

క. నాశపథము దశముఖునకు
నాశపథముగాఁ దలంచి ♦ నమ్మి చనుఁడు; భూ
తేశాదు లడ్డుపడిన ని
దే శాసించెదను నాని ♦ దేశము వెలయన్. 117

ఉ. నావుడు సంతసిల్లి సుమ ♦ నస్తతి నిస్తరితాబ్ధియై చనన్
ద్రోవ నజుండు శ్రీహరికిఁ ♦ దోడుగ వీరులఁ గామరూపులన్
లావరులన్ గపీంద్రుల సు ♦ లక్షణులన్ సృజియింపఁ దప్పక

స్త్రీవివరంబులందున సృ♦జించిరి నిర్జరు లబ్జజోక్తిగన్. 118

గీ. హరియు నపుడు నదృశ్యుఁడై ♦ యమరకార్య
తత్పరత నుండె; నిచట న ♦ ద్దశరథుండు
సేయుతనయేష్టి సంపూర్ణ ♦ మై యొనంగ
హవ్యవాహనులో నుండి ♦ భవ్యముగను. 119

ఉ. పాయక దివ్యమూర్తి సదు♦పాయన మిచ్చుగతిం గరంబులం
బాయసపాత్రిఁ బూని యన♦పాయఫలప్రద మీప్సితార్థగో
పాయన మన్వయస్థితికు♦పాయము దీని గ్రహింపు మద్రిచా
పాయతభవ్యవిక్రమనృ♦పా యని పిల్చియొసంగ నిమ్మగన్.

క. ఆపాయస మిరుదెఱఁగులు
గా పాల్పఱిచియు నొసంగెఁ ♦ గౌసల్యకు నిం
పేపారఁగఁ గైకేయికి
భూపాలాగ్రణి ప్రమోద ♦ పూర్ణాత్ముఁడై. 121

క. ఆలోలాక్షులు పతిమతి
యాలోచనచేసి యిచ్చి ♦ రర్ధం బర్ధం
బాలో సుమిత్రకును ని
ర్వ్యాలోలమనస్కలై ని ♦ జాంశంబులలోన్. 122

వ. ఇట్లతిస్నేహంబున నప్పాయసంబు పరిగ్రహించి రంత దశరథుండు పరిపూర్ణమనోరథుండై ఋత్విక్ప్రముఖధరణీవిబుధోత్తములకు గోహిరణ్యదుకూలాభరణాదు లొసంగి తక్కినజనంబులకు నిష్టధనంబు లిచ్చి తరుణులుం దానును సపరివా

రంబుగాఁ గ్రమ్మఱి పురంబున కరుదెంచి యపరిమితానందం
బున రాజ్యంబు సేయుచు నెమ్మనంబున. 123

క. శ్రీహృదయేశ్వరుకరుణ మ
నోహృద్యం బెపుడు దీరు ♦ నో యనుచుండన్
వ్యాహతపుణ్యేతరలై
దౌహృదలక్షణము లోలిఁ ♦ దాల్చిరి యువతుల్. 124

గీ. వింతచవులు వేఁడమె ♦ వెల్వెలనై చెక్కు
లలరె నాభివెడద యయ్యె ♦ సలఁతి
కౌను గానరయ్యె ♦ నూనూగునూగారు
గారుకొనియె గర్భ ♦ గౌరవమున. 125

గీ. రుచిరకాంచనకలశాగ్ర ♦ ఖచితచారు
నీలహరినీలరుచిలీలఁ ♦ బోలి యాస్య
పాలుబాలేందునిటలల ♦ మేలిగబ్బి
గుబ్బపాలిండ్లతుదకప్పు ♦ గొనబు మెఱసె. 126

క. తొడవులు సడలెను నెన్నడ
లడుగామడ గాఁగడంగె ♦ నొ సవుసవు డ
ప్పడమి దొరపడఁతులకుఁ జొ
ప్పడరెను బడలికలు కడిఁది ♦ యై యెడలేకన్. 127

క. అంతర్వత్నులు ధరణీ
కాంతప్రియపత్ను లిటుల ♦ గర్భోదయలై
సంతసిలుచు నవమాసా

నంతరమున నఖిలజనము ♦ సంప్రమదముగన్. 128

మ. రవి మేషంబున జన్మలగ్నముకుళీ♦రంబందునన్ జీవరా
హువిధుల్ తౌళిని సౌరి నక్రమునఁ గే♦తూర్వీజు లుండంగ భా
ర్గవసౌమ్యుల్ ఝషరాశియం దదితితా♦రన్ దేవి కౌసల్యశ్రీ
నవమిం జైత్రికశుక్లపక్షమున నె♦న్నన్ రాముఁ గాంచెన్ దమిన్

గీ. కైకయీదేవి పదపడి ♦ కనియెఁ బుణ్య
నిరతు భరతు సుమిత్ర భా ♦ సురచరిత్ర
ఘనుల లక్ష్మణశత్రుఘ్ను ♦ లను నితాంత
సమరజయనిఘ్నులను గాంచెఁ ♦ బ్రమద మెసఁగ. 130

చ. కురిసె వసుంధరం గరము♦కుప్పలుగా సుమవృష్టి వేమరున్
మొరసెనిలింపదుందుభులు♦మోదమెలర్పఁగ మోముదామరల్
విరిసె సుపర్వకోటికి ర♦విప్రముఖగ్రహతారకావళుల్
మెఱసె నగారి కౌతుకము♦మీఱఁ ద్రివిష్టపమెల్ల మేలనన్.

క. పాడిరి గంధర్వులు దివి
నాడిరి తెఱగంటితెఱవ ♦ లాత్మవ్యథ చే
వాడిరి దనుజులు మునిజను
లాడిరి కల్యాణసూచ ♦ కాభాషణముల్. 132

క. నలుతొలుఁబలుకులో నలినజు
నలుమొగములో నలువయయ్యె ♦ నలుబాహువులో
నలుజలధులో నా వెలసిరి
నలువురు దశరథునిసుతులు ♦ నలు వలరారన్. 133

గీ. రామలక్ష్మణు లిరువురు ♦ ప్రేమ మీఱ
భరతశత్రుఘ్ను లిరువురు ♦ ప్రమద మెసఁగఁ
గవలుగూడి నితాంతశ్రం ♦ గారగరిమ
నిందుకొనువేడ్క విహరించు ♦ చుండి రంత. 134

చ. తనతనయుల్ సమున్నయులు ♦ దారగుణోదయులిద్ధసత్క్రియుల్
దినదినదండితారు లగ ♦ ధీరు లుఁదారు లుదగ్రధీయుతుల్
తనుతనుపాత్తవిద్యలు సు♦ధన్వకళాఢ్యులు నైకరంబు మ
న్ననసలొత్తఁగొల్వనర♦నాథుఁడుపఙ్క్తిరథుండుభాసిలున్.

క. ఆనందనవిహరణజని
తానందనవార్ధిఁ దేలు ♦ నమరేంద్రుండో
నా నందనవిహరణజని
తానందనవార్ధిఁ దేలి ♦ యమరెం దృప్తిన్. 136

సగర్భకందగీతచంపకమాల.

వరగిరిజాప్రియానగని♦వాస రవీందుధనంజయాక్షశం
కరజటిలా శివా శమన♦గర్వవిభంజన చర్మవస్త్ర భా
స్వరపురనాశకా కలశ♦సాగరతూణ జగన్నిదాన క
ర్బురహరణా భవా ఫణివి ♦ భూషణ దిక్పటభద్రవాహనా!

గర్భితకందము.

గిరిజాప్రియా నగనివా
స రవీందుధనంజయాక్ష ♦ శంకర జటిలా
పురనాశకా కలశసా

గరతూణ జగన్నిదాన ♦ కర్బురహారణా. 138

గర్భితగీతము.

నగనివాస రవీందుధ ♦ నంజయాత్మ
శమనగర్వవిభంజన ♦ చర్మవస్త్ర
కలశసాగరతూణ జ ♦ గన్నిదాన
ఫణివిభూషణ దిక్పట ♦ భద్రవాహ. 139

మాలినీవృత్తము.

కనకకుధరచాపా ♦ ఖండితారాతికోపా
సనయగుణకలాపా ♦ చారుభస్మావలేపా
వనధిఘనకలాపా ♦ వ్యాళసమ్యక్కలాపా
వినిహతమునిపాపా ♦ విశ్వలోకైకరూపా. 140

గద్య:—ఇది శ్రీమత్కుక్కుటేశ్వరానుగ్రహాప్రభూతకవిత్వ
వైభవ విశ్వామిత్రగోత్రపవిత్ర వారణాసివంశపారా
వారకైరవమిత్ర విద్వన్నుతచరిత్ర కామయార్య
పుత్ర సుకవిజనవిధేయ వేంకటేశ్వరనామ
ధేయ ప్రణీతంబైన రామచంద్రో
పాఖ్యానం బనుమహాప్ర
బంధంబునందుఁ బ్రథ
మాశ్వాసము

శ్రీ.

శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీ రామచంద్రోపాఖ్యానము.

## ద్వితీయాశ్వాసము.

శ్రీరజతాద్రివిహారా
చారుతరాహీనహార • స్మరసంహారా
వారాన్నిధితూణీరా
సూరిజనాధార తామ్రచూడాకారా. 1

వ. అవధరింపు మనంతరకథావిధానం బెట్లు నితాంతసంతుష్టాంత
రంగుండై దశరథధరామండలాఖండలుం డఖండవైభవసామ్రా
జ్యం బగురాజ్యంబు సేయుచుండ నొక్కనాఁడు. 2

మ. పరమోత్కృష్టతపఃపవిత్రుఁడు జగ • త్ప్రఖ్యాతచారిత్రుఁడా
దరసంరక్షితవాణిపుత్త్రుఁడు మరు • త్వన్ముఖ్యసంస్తోత్రుఁ డ
ధ్వరసంతర్పితవీతిహోత్రుఁ డపర • స్వర్లోకసర్గక్రియా
చరణోక్తిప్రమదాకళత్రుఁ డగువి • శ్వామిత్రుఁ డేతెంచెనా.

చ. ఎమరుగ నెగుదెంచి ధర • ణీశుఁడు వందన మాచరించి పెం
పొదవెడుపీఠినుంచి సమ • యోచితపూజలు నించి తచ్ఛుభా
భ్యుదయము లెంచియాత్మశుభ • ముత్సుకతన్ వినిపించిహస్తముల్

గుదురుగ దోయిలించి ముని♦కుంజరుఁడీవసఁ గాంచియిట్లనున్.

ఉ. ఎయ్యెడనుండి యెయ్యెడకు♦నేగుచు నియ్యెడ కేగుదెంచినా
రయ్య? సురేంద్రసద్మమున♦కయ్యరవిందభవుండు వచ్చి న
ట్లయ్యెడు; లోకవంద్య! కృతి♦నైతి; భవద్దయనియ్యెకొంటిమీ
నెయ్యముతియ్యమేర్పడియె♦నేఁడుగదా ఫలియించెఁగోరికల్.

క. మీరాక శుభాస్పదము సు
మీ రాకశశాంకురాక ♦ మెచ్చుగ నెపుడున్
నీరాకరుసకుబలె ముని
తారాకమనామ ఖౌఘ ♦ తర్పితసుమనా. 6

క. బాస మరల్పక మది ను
ల్లాసం బెసఁగంగ నీత ♦ లం పెయ్యదియో
వాసవముఖసుర లెన్నఁగ
వాసిగ నోసఁగెదను బాస ♦ వాల్గొరరాయా. 7

మ. అన నవమ్నానివతంసుఁ డప్పుడు కడున్♦హర్షించి నీసందనున్
వనజాక్షున్ ధృతకాకపక్షు రణ♦దుర్వారున్ మదీయాధ్వరా
వనధీరున్ గుణధాము రాముసడుగన్♦వాంఛించియే తెంచితిన్
దనుజుల్ పజ్క్తిముఖాజ్ఞవచ్చి క్రతువి♦ధ్వంసంబుగావించుటన్.

క. వా రెవ్వరంటివేనియు
మారీచసుబాహు లమిత ♦ మాయోపాయుల్
క్రూరులు ఘోరాకారులు
శూరులు సుందోపసుంద ♦ సుతు లతులబలుల్. 9

శా. మాయావృత్తి నిశాటులట్లనిశముం♦మాయాగముఖ్యక్రియల్
మాయింపం భయమంది రాఘవుభజిం♦పం వచ్చి హర్షించితిం
స్థాయద్భూరినిదాఘకృచ్ఛ్రవిచల♦త్స్వాంతాధ్వగుండోక్కెడన్
ఛాయావృక్షమునాశ్రయించికడుహ♦ర్షస్వాంతుఁడౌచాడ్పునం

శా. భావింపం రఘువంశజుల్ దనుజస♦ర్పగ్రస్తలోకావళీ
జీవాతుల్ పదవాక్ప్రమాణనిపుణుల్♦శ్రీమంతులార్యుల్ సుహృ
జ్జీవంజీవసుధానిధుల్ విబుధసం♦సేవాపరుల్ వైరిలో
కావార్యుల్ గుణధుర్యులుత్తమదయా♦యత్తైకచిత్తుల్ ఘనుల్.

క. కావున రాఘవు నాసవ
నావనమున కిమ్ము సంది♦యము వల దాత్మం
దీవనఁ గైకొనె దీ వసఁ
బావనగుణవితతి నృపతి♦ భావములోనం. 12

ఉ. నో రెఱుఁగుగాని బాపురె ము♦నుల్ పరికింపఁగ నిర్దయుల్ నిరా
బారులు గాన నిట్టిపసి♦పాపలఁ గానక కన్నపుత్త్రులం
దారుణవృత్తి నిమ్మనియొఁ♦దాపసి కే నెటు లిత్తు? స్వకార్యకూటా!
గౌరవ మింగితజ్ఞత స్వ♦కార్యధురీణుల కెందుఁ గల్గునే? 13

తరళ.

అని తలంచుమహీతలేశ్వరు♦నంత వారసి భావవి
జ్జనఘనుండు వసిష్ఠుఁ డిట్లనె♦సంశయింపక యిమ్ము నీ
తనయు దీనశుభం బటన్న ము♦దంబు నొంది గురూక్తి నా
య్యన గురూక్తి బలారి గైకొని♦హర్ష మొందెడు కైవడిం.

క. కలశాబ్ధి వజ్రికి సుధా
కలశార్పణ సేయుగతి జ ♦ గత్పతి మునికిం
గులగోత్రధరు సానుజుఁ
గులగోత్రప్రవరు రాముఁ ♦ గొంకక యిచ్చెన్. 15

గీ. రాజమౌళి కుమారుఁ డా ♦ రకనిశాట
హరణమునకు సురేంద్రుతో ♦ ననుపుపగిది
రాజమౌళి కుమారుఁ డా ♦ రకనిశాట
హరణమునకు మునీంద్రుతో ♦ ననిపె ధృతిని. 16

ఉత్సాహవృత్తము.

విపులకీర్తిపరు లమోఘ ♦ విశిఖచాపధరులు దే
వపరిపంథిభీకరులు ది ♦ వాకరాన్వయేశ్వరుల్
సపదినగరవీథి వెడల ♦ సకలపౌరజనులు గాం
చి పరిమోద మంది రేమి ♦ చిత్ర మనుచుఁ బల్కుచున్. 17

క. ఉరుపుణ్యవతులు మంగళ
కరలాజలు రాముఁగూర్చి ♦ కడుఁ జల్లిరి మం
ధరశైలోత్థపయశ్శ్రీ
కరములఁ గలశాబ్ధివీచి ♦ కలు శౌరిబలెన్. 18

సీ. జగదవనాటవీ ♦ శ్వరపురోవిస్ఫుర
త్తోయధీశశ్రీదు ♦ లో యనంగ
పవనభుగ్నాథపా ♦ ర్శ్వస్థితోత్సాహసం
ధాయకనాసత్యు ♦ లో యనంగ

గార్హపత్యోపకం ♦ ఠార్హమహాహవ
నీయదక్షిణశుచు ♦ లో యనంగ
మిహికామహీభృత్స ♦ మీపాభిరామగాం
గేయమంథరగిరు ♦ లో యనంగ
హాటకాహార్యలంబమా ♦ నార్కవిధులో
మిత్రగతివశవర్తిత ♦ చైత్రమాధ
వములో చంద్రయుతాదితి ♦ భములో యనఁగఁ
గాశికునితోడ నడచిరి ♦ దాశరథులు. 19

క. రాకొమరు లిటులు తోరా
పీకం జని సరయుఁ గాంచి ♦ విశ్వామిత్రుం
డాఁకలియు నీరువట్టును
కాకుండఁగ విద్య లిత్తుఁ ♦ గైకొం డనినన్. 20

చ. అలఘుతపస్విబోధితబ ♦ లాతిబలాహ్వయవిద్యలై కుతూ
హల మొలయన్ బ్రసూపచితు ♦ లట్ల యనధ్వపరిశ్రమంబు వ
ర్తిల సరయూతరంగిణి త ♦ రించి పురాణపురాణగాథ ల
ర్మిలి ముని పెంపు నింపు నల ♦ రింప వచింపఁగ నాలకించుచున్.

చ. అటు చని రాముఁ డయ్యెదుట ♦ నాశ్రమమారసి యియ్యరణ్యమే
జటివరునాశ్రమం బనిన ♦ సంయమి దెల్పెను; తొల్లి శూలి యి
చ్చటఁ దపమాచరింప సుమ ♦ చాపుఁడు గాంచి గిరీంద్రకన్యధూ
ర్జటి కిటఁ బెండ్లిసేతు నని ♦ సమ్మదసంభరితాంతరంగుఁడై. 22

క. హరుఁ జేర నరిగి తనసుమ

శరముల మదిఁ గలఁప నలిగి ♦ శర్వుఁడు వైశ్వా
నరలోచనమునఁ గనుఁగొన
స్మరుఁ డప్పు డనంగుఁ డయ్యె ♦ జనుల కరిదిగాన్. 23

సీ. అటుగాన నీదేశ ♦ మంగసంజ్ఞను జెందె
నీయాశ్రమమున మ ♦ దీయశిష్యు
లున్నవా రీరాత్రి ♦ యుండుద మిట నన్న
నంత నంతేవాసు ♦ లధికభక్తి
నను రేగుదెంచి త ♦ త్పదముల కెరఁగి తో
డ్కొనిపోయి రాఘవు ♦ కుశల మరసి
యాతిథ్య మిచ్చి యి ♦ ష్టాన్నతుష్టులఁ జేయ
నా రేయి యచట సౌ ♦ ఖ్యమున నిలిచి
ప్రత్యుషాగంధవాహాంకు ♦ రమ్ము లొలయు
వేళ లేచి యొకింత ద ♦ ఏయ మరిగి
జాహ్నవీద్వీపవతి గాంచి ♦ సంస్తుతించి
కాల్యకరణీయములు దీర్చి ♦ గంగ దాఁటి. 24

క. మునుకొని గహనమ్మున నొ
య్యనఁ జనిచని తాటకాని ♦ శాటవధూటిన్
వినిభృతచీవరశాటిన్
ఘనమునిజనభయదధాటిఁ ♦ గల్మషపేటిన్. 25

మ. కని గాధేయుఁడు ముక్తకంచుకభుజం♦గంబున్ బలెంగోపియై
వినుమో రాఘవ! తావకాస్త్రమహిమన్ ♦ వేవేగనిశ్కాంతన

ద్దనుజేశాయనమార్జనప్రముఖక్రియత్యవ్యక్తమై యేగివే
డ్కను వైవస్వతువీటిచేటి యగుచుం దండంజేయు మల్లెనియర్.

క. రఘువర తావకవిశిఖా
లఘుశిఖికిం దాటకపల లభుగంగన యి
య్యఘుచారిణి పరిభమాహుతి
గ ఘటిల్లును మఘవముఖమ ఘభుజులు మెచ్చన్. 27

వ. అనుడు రఘువరుండు. 28

క. పరికింప ధరనహింసా
పరమోధర్మ యనిస్మృతులు వలుకఁగ వినుచున్
దరళాక్షి నకారణముగఁ
బరిమార్చుటకంటె వేరె పాపము గలదే. 29

గీ. అరయ నిమ్మౌనియానతి యులఁతిగాదు;
స్మృతుల మును గురుబుద్ధిర్వి శేషత యని
యన్న దోకటున్న దేకదా యనితలంచి
మౌనివరునకు భక్తిన మస్కరించి. 30

ఉత్సాహము.

చాప మెక్కువెట్టి నారి పారి మ్రోయఁజేయఁగాఁ
బాపచిత్త యగునిశాట భామ రోఁజుచున్ వెసన్
బాప లగున్నృపాలసుతుల పైకి రాఁగ నంతటన్
గోపమున శరంబొకండు గొని భయంకరంబుగన్. 31

ఉ. నారి సమర్చి యయ్యసుర నారి సమాంకృతితోడ భక్తమం

దారుఁడు రాముఁ జేయ నతి◆దారుణభంగి బొసంగ నార్చి బృం
దారకరాట్పురస్సరదు◆దారశతారవిదారితాచలా
కారము దోఁప నెంతయు వి◆కారముతోఁ బడియెన్వనస్థలిన్.

ఉత్సాహము.

కుసుమవృష్టి గురిసె నపుడు ◆ కుతుకమునను సవనభు
గ్విసరుహాస్యలెల్ల నృత్య ◆ గీతవాద్యములు విహా
యసమునందుఁ జూపి నిలిచి ◆ రమరదుందుభిధ్వనుల్
దెసలు చెముడుపడఁగ మ్రోసె ◆ దితిజకోటు లదరువఁగన్.

సీ. అంత రాముఁ డనంత ◆ సంతోషమునఁ గొంత
ద వ్వేగి యొక్కటఁ ◆ దాపసాశ్ర
మము మ్రోలఁ బొడగాంచి ◆ తమిఁ దెల్పు మనుడు న
గ్గాథగాధేయుఁ డ ◆ క్కజము గాఁగ
మును బలి జన్న మొ ◆ ప్పొదంబుతోఁ జేయు
తఱి సురల్ ప్రార్థింప ◆ దనుజవైరి
వామనుఁడై వచ్చి ◆ వసుధ మూఁడంజలు
గోరి త్రివిక్రముఁ ◆ డై రసాత
లమున కాతనిఁ ద్రొక్కి బ ◆ లద్విడాది
సవనభుక్తతి నానంద ◆ జలధిఁ దేల్చి
విదపఁ దప మాచరించె సం ◆ ప్రీతిఁ గాన
వామనాశ్రమ మిది మద ◆ ధ్వరధరిత్రి. 34

ఉ. ఇచ్చటఁ జు మ్మటంచునుద◆దీయపరాక్రమమాత్మ నెంచుచున్

దెచ్చె నిజాశ్రమంబునకుఁ ద్విట్ప్రతివంశ్యుల రాకుమారులన్
మెచ్చుకొనంగ నచ్చటిమునిప్రవరుల్ ముదమంది కౌశికుం
డొచ్చెము గానిప్రేముడి మహోన్నతయాగచికీర్ష నంతటన్.

క. రాఘవు రిపుభీకరశర
లాఘవుఁ జేరంగఁ జీరి శ్లాఘనపూర్వా
నాఘాటేష్వాసనవి
ద్యాఘనుఁడవు నీకు నరయ ధర దొర గలఁడే? 36

ఉ. అంచు నుతించి రాఘవ! మహాహవదీక్ష వహింతు నింక నీ
వంచితవిక్రమంబున మహాహవదీక్ష వహించి యెట్లు ర
క్షించెదొ యిమ్మఖంబు పరికింపఁగ నించుక యేమఱించినన్
బొంచి నిశాచరుల్ ఖలులు ఘోరునవిఘ్నము సేతురెయ్యెడన్.

క. కావునఁ గనుకలిగి జయ
శ్రీ వెలయఁగఁ గపటదనుజ శిక్షామతివై
వావిరి సవనసమాప్తిన్
గావించెడునంత కిచటఁ గాపు నిలువుమా. 38

గీ. అని యెఱింగించి గాధేయుఁ డపుడు దీక్షఁ
దాల్చె; రఘువీరులు సధిజ్య ధన్వు లగుచు
నుండి; రధ్వర్యు లంత వే దోక్తరీతి
సవనకర్మంబు సలుపుచు దివిజు లలర. 39

గీ. నాలుగింటను గ్రిమ్మఱ నాలుగింట
రెంట నైదింట వెంచియు రెంట సలుప

వర్ణమంత్రాదు లాగమ ♦ స్వరవిలోమ
మించుకయు లేక క్రతునిష్ఠ ♦ మించికొనఁగ. 40

శా. పంచాస్యప్రతిమానులై జగతిపై ♦ భాసిల్లుఋత్విగ్వరుల్
ప్రాంచత్స్రుక్స్రువముల్ ధరించియుఁ బ్రవ♦ర్గ్యాదుల్ వపా [హోమముం
గించిల్లోపము గాకయుండఁగ జగత్క్షే♦మంబుగాఁ జేయఁ గా
న్పించెన్ షష్ఠదినంబునం గరము వి♦స్ఫూర్తిన్ వితర్కింపఁగన్.

క. మారీచాసురమాయా
కారితవారిదము లమిత ♦ గర్జితము లసృ
గ్ధారలు నంజుడు చిదురులు
భూరినిశాచరవిరావ ♦ ములు నగ్గలమై. 42

వ. అప్పుడు. 43

క. శ్రీరఘువీరుఁడు ధీరత
మారుతమార్గణము వైచి ♦ మాయాశీలున్
మారీచునిఁ బడఁగెడపెను
వారాన్నిధిమధ్యసీమ ♦ వారక మఱియున్. 44

క. బాహావిక్రమ మేర్పడ
నోహో యనిమునులు వొగడ ♦ నుగ్రప్రదర
స్వాహాభర్తృజ్వాలల
నాహుతిఁ జేసెన్ సుబాహు ♦ నాహవశూరున్. 45

ఉ. నింగి సెలంగఁ దక్కురజ ♦ నీచరులెల్ల నుదగ్రరాఘవా

భంగశిలీముఖాహతిని • బాఱిరి భూరిభయార్తి భోరునన్
సింగముకందుఁ గన్గొనిన • జింకదళంబులమాడ్కి నప్పుడు
ప్పొంగిరి మౌను లధ్వరము • పూర్ణముగాజరిగెన్ యథావిధిన్.

వ. అనంతరంబ గాధినందనుండు పరమానందంబున. 47

క. రఘువర తావకమహిమన్
మఘపూర్తిఁ గృతార్థినైతి • మాట లికేలా
యఘటనఘటనానిపుణుఁడ
వఘహరణుఁడ వీద్యగుణుఁడ • వలవియె పొగడన్. 48

క. అనునెడ మిథిలాధీశుఁడు
ఘనతరమఘమొకటి సేయఁ • గాఁ దలఁచి తపో
ధనవరు గాధేయుని ర
మ్మని చీరంబంచినం బ్ర • యాణోన్ముఖుఁడై. 49

చ. వరుణకుబేరయుక్తుఁ డగు • వారిచరాంకవిరోధిపోల్కెఁ బ
ఙ్క్తిరథకుమారులిర్వురు న • ధిజ్యశరాసనులై ముదంబుతో
నిరుగడ లంటిరాఁగ మిథి • లేశ్వరుజన్నముఁ జూడఁ గౌశికుం
డరిగె మహర్షులెల్లఁ గొని • యాడఁగృతాధ్వరకర్తుఁడై తమిన్.

ఉ. అంతట ముంగలన్ రఘుకు • లాఢ్యుఁడు తుంగతరంగగంగ న
త్యంతముదంబునం గని బు • ధార్చిత యీనదిజన్మవృత్త మా
ద్యంతము దెల్పుమన్ననుద • యామతిపూర్వమయోధ్యనేలుభూ
కాంతుఁడు ధర్మవత్సలుఁడ • ఖర్వపరాక్రమలబ్ధభాగ్యుఁడై. 51

క. సగరుఁ డనురాజు మహిషీ

యుగసంగతుఁ డగుచు నంద ♦ నోత్పత్త్యభిలా
షగుఁడై యొకతతిఁ దపమున
భృగుముని వేఁడంగ నతఁడుఁ ♦ బ్రీతి దలిర్పన్. 52

క. ఒకసుతుఁ డొకతెకు మఱియొక
తెకు నఱువదివేలసుతులు ♦ ధృతియుతులు గుణా
ధికు లతులబలులు గలిగెద
రకలుషమతు లధిప! తత్త ♦ దభిమత మలరన్. 53

గీ. అని ముని యదృశ్యుఁ డయ్యె న ♦ య్యధిపుసతులు
దమి సుకేశిని గనె సూను ♦ సుమతి కంత
మొదల నొకతుంబి వ్రుట్టను; ♦ బిదప నదియె
విచ్చి గనవచ్చి రఱువది ♦ వేలసుతులు. 54

వ. అనంతరంబు సగరచక్రవర్తి దినదినప్రవర్ధమాను లగుతన యులం గనుంగొనుచు నపరిమితానందంబు నొందుచుండి యొక్కనాఁడు. 55

చ. నెఱవగుజక్కిజన్న మతి ♦ నీమ మెలర్పఁగఁ జేయ వేల్పుఱేఁ
డఱిమరచే హయంబుఁ గొన ♦ నాతఁ డెఱింగి కడిందికిన్కచే
నఱువదివేలబిడ్డలఁ బ్రి ♦ యంబునఁ జేరఁగఁజీరి వారి నే
ర్తెఱఁగని తేజిఁ గాంచి కొని ♦ తెండనిసం ధర నెల్లఁ జూచియున్.

గీ. తద్దయును భూతలంబెల్ల ♦ గుద్దలించి
కకుబిభంబులఁ గని వానిఁ ♦ గడచి చనఁగఁ
గపిలచరమస్థ మగువాజిఁ ♦ గాంచి జనతి

సతనికోపాగ్ని దగ్ధులై ♦ రంత నిచట. 57

చ. సగరుఁడు నందనాగమముఁ ♦ జాలఁ గనం దడ వయ్యె నంచులో
దిగులున నంశుమంతు నతి ♦ ధీరునిఁ బౌత్త్రునిఁ బంప నాతఁడా
సుగుణులు చన్న మార్గమున ♦ శోధకుఁడై చనుచోఁ గ్రమంబునం
దిగిభములం గనుంగొనిపి ♦ తృవ్యులప్రశ్నయొనర్చి వెండియున్.

వ. కొంతదూరంబు చని చని ముందట. 59

క. పితృభస్మరాశి గని దుః
ఖితుఁడై మఱి కపిలుఁ గాంచి ♦ కృప వడసి పితృ
వ్యతతికృతదౌష్ట్య మంతయు
నతనివలనఁ దెలిసి భక్తి ♦ నశ్వముఁ గొనియున్. 60

మ. చనఁగా నంత సుపర్ణుఁ డిట్లనియె వ ♦ త్సా! నీపితృవ్యావళిన్
ఘననాకాపగఁ దెచ్చి తృప్తినలరం ♦ గాఁ జేయుమన్న న్వెసన్
జని తద్యాగసమాప్తిఁ జేసి సగరా ♦ జ్ఞాభాజనుండై వియ
ద్ధునికై నిష్ఠఁ దపం బొనర్చి సురనా ♦ థుం గొల్వ వేంచేసినన్.

ఉ. ఆనరనాయకోత్తమున ♦ కాత్మజుఁడై నదలీపుఁ డట్లుగా
మానుగ గంగకై తపము ♦ మాటికిఁ జేసి చనన్ మరుత్ప్రభు
స్థానఁగ నాన్నృపాలునకు ♦ నందనుఁడై నభగీరథుండు న
న్మానితుఁ డాదటం దపము ♦ దారతఁ జేయఁదలంచి గ్రక్కునన్.

క. గోకర్ణంబునకుం జని
ప్రాకటమతిఁ దపము సేయఁ ♦ బరమప్రీతిన్
లోకారాధ్యుఁడు ధూర్జటి

నాకధునీబిందు వొకటి ♦ నరపతి కిచ్చెఁ. 63

క. ఇచ్చిన నది నది యైనఁ
మెచ్చుకొని భగీరథుం డ ♦ మితహర్షభరం
బచ్చుపడఁ దోడ వచ్చుచుఁ
గ్రచ్చుఱఁ బితృవితతిభస్మ ♦ రాశికిఁ దెచ్చెఁ. 64

గీ. తెచ్చి పితరులఁ దృప్తి నొం ♦ దించి పిదప
రాజ్యమేలుచు నుండెను ♦ రామచంద్ర
యనియు నేతత్కథాశ్రవ ♦ ణానురక్తి
సకలజనముల కిహపర ♦ సాధనంబు. 65

సీ. అని చెప్పి వారిఁ దో ♦ డ్కొని వేడ్కఁ బావన
వనభూము లనవద్య ♦ జనపదములు
పుణ్యనదీనదం ♦ బులు మహాశైలంబు
లందందుఁ జూచుచు ♦ నరిగి యరిగి
యక్షపాదాశ్రమా ♦ భ్యర్ణప్రదేశంబు
గనుఁగొని యచ్చోట ♦ గాధిసుతుఁడు
విటపిమూలంబున ♦ విశ్రమించినతఱి
రఘువీరచరణనీ ♦ రజరజోరు
రేణుపర్యాప్తిఁ బ్రత్నపా ♦ షాణ మిగురుఁ
బోణి యయ్యెను గౌతము ♦ రాణి యరయ
జగదధీశు కృపాకటా ♦ క్షంబువలన
సుకృతిజనులకు శుభములు ♦ చోద్యమగునె. 66

క. ఉపలాకృతి విడనడఁచియుఁ
జపలాక్షి నొనర్చె నార ♦ సంహృతమారీ
చపలాశుఁడు గుణటంకా
రపలాయితవిమతవితతి ♦ రఘుపతికరుణన్. 67

క. అని తెలిసి పత్నిఁ గనుతమి
ననఘుం డక్షపదుఁ డాశ్ర ♦ మావని కేతెం
చె నగేంద్రముకడకుఁ బున
ర్జనితోమేషేచ్ఛ వచ్చు ♦ శంకరుకరణిన్. 68

సీ. అట్లేగుదెంచి యా ♦ య్యక్షపాదుఁడు ప్రీతిఁ
బత్నిసమేతుఁడై ♦ భక్తి గాధి
పుత్త్రుని దశరథ ♦ పుత్త్రులఁ బూజించి
ముదమందె; వారలు ♦ గదలి మిథిల
కరుగుచు జనకుని ♦ చరితంబు జనకుఁడు
తనయింటనున్నకా ♦ త్యాయనీశు
విల్లెక్కువెట్టిన ♦ బల్లిదునకు సీతఁ
దనకూఁతు నిచ్చెద ♦ ననుచుఁ బ్రతిన
సేయుటయు నాదిగాఁ గల ♦ చిత్రకథలు
తాటకాంతకునకుఁ బ్రమో ♦ దంబుతోడఁ
గుశికతనయుండు వినిపించు ♦ చును మఱియుఁ
బుడమికన్నియచెలువంబు ♦ నుడువఁ దొడఁగె. 69

ఉ. పున్నమచల్వవెల్గుదొరఁ ♦ బోలుచొకారపునెమ్మొగంబు మేల్

వన్నెకడానిమేనిజిగి • వాలికమీాల నెదిర్చుచూపుకో
పన్నువకౌనుతీవ తళు • కారుకపోలవిలాస మబ్బ మ
మ్మన్నఁ బొలంతికన్నియకు • మాదిరియైనవెలంది గల్గునే. 70

చ. నునుపుమెఱుంగుకప్పుజిగి • నూల్కొనుజొంపపుసోగపెన్నెరు
ల్పనివడి దువ్వి విప్పఁగ వ • లంతితనం బెలయంగఁ జక్కఁ దీ
ర్చినగొనబారి యప్పడమి • చేడియకన్నియకొప్పఁగొప్పుతో
నెనయనుచున్ వచింపఁ దగు • నేఘనముఖ్యములైనవస్తువుల్.

క. సింధురగామినివేణికిఁ
గంధర మెన కంబు సవతు • కంధర కరయన్
మంథరగిరి చన్నుంగవ
బంధురరుచి కరపు మోవి • పవడముసుమ్మీ. 72

క. నలికంబుగొనబులేఁగా
నలికంబు సుధాంశురేఖ • యువనీసుతవే
నలి కంబుదరము సవతౌ
నలికంబులసారు మీఱు • నారును గళమున్. 73

సీ. గంధమించుక కానఁ • గానిబంధూక
మన్యభృద్బాధిత • మగుకిసలయ
మరయఁ బ్రాసగుణంబు • దొఱఁగనికురువింద
మంద మెంతయు లేని • యమృతకలశ
మెడలేనికరిసత • నడరుచుందుప్రవాళ
మణుమాత్ర మంటిన • నవియుబింబ

మభిరుచి శూన్యమై ♦ యలరులాతొరస
మాన రారూపగు ♦ నబ్జరాగ
మెలమిఁ దుల యని పలుకంగ ♦ వలపు గలిగి
చలన మొందక తొలలేక ♦ చెలువు మెఱసి
మృదులమై విచ్చి పోవక ♦ యింపునించు
సరసమైనట్టిసీత వా ♦ తెరకు నగునె. 74

చ. రదములతీరు మేలిమగ ♦ రాలనిగారముఁ గేరు నీలనీ
రదములకాంతి మీఱు నలి ♦ రంగుపొసంగుకచంబు చారుష
ట్పదములబారు గేరు నునుఁ ♦ బ్రాయపుటారు విశాలపంకజ
చ్ఛదముల మీఱుఁ గన్నుఁగవ ♦ సౌరు వినంగ ధరాకుమారికిన్

గీ. చాలఁ బరికింప దంటము ♦ క్కాలికంటు
విరిమొగడసోయగ మొకింత ♦ పురు డటంచుఁ
బలుకఁ దగునేమొ యప్పంట ♦ తలిరుటాకు
బోణిగారాపుఁగన్నియ ♦ ఘ్రాణమునకు. 76

క. చిందమ్ములచందమ్ముల
మందమ్ములు సేయుఁ గంఠ ♦ మహిమకరంబుల్
గెందమ్ములు పాదమ్ముల
కుందమ్ములునుమ్ము తపన ♦ కులవర వింటే.

క. పద్మము లంఘ్రులు పొక్కిలి
పద్మాకర మక్షియుగము ♦ పద్మము కరముల్
పద్మము లాస్యము పద్మము

పద్మాకృతిసుమ్ము వుడమి ♦ పట్టి తలంపన్. 78

ఉ. ఊరులచందమా వళుల ♦ యొప్పిదమా కటిచెల్వమా నఖాం
కూరవిలాసమా వలుద ♦ గుబ్బలనిబ్బరమా వలగ్నకార్శ్యం
గారవిశేషమా యొకటి ♦ గల్గు ననం బనియేమి? యా మెఱుం
య్యారము కన్నులం గనిన ♦ నబ్బురమయ్యెడుఁ గాదె యేరికిన్.

మ. రమణీయావయవప్రకర్ష యగుచున్ ♦ రాణించు నాయింతి యా
భ్రమరాళీకచ యా చకోరదృశ యా ♦ బంధూకపుష్పోష్ఠి యా
కమలాంశానన యా యహార్యకుచ యా ♦ గప్రింపురంభోరు వా
కమలాంఘ్రిద్వయ యా వెలందికొలముం ♦ గన్నాకు నీకుం దగున్.

క. అని వాచంయమవర్యుఁడు
జనకజచెల్వంబు రామ ♦ చంద్రునకు ముదం
బెనయఁగ వినిపించుచుఁ జన
జనకుఁడు గాధేయురాక ♦ చారులవలనన్. 81

సీ. విని యెదుర్కొని తోడ్కొని ♦ చని మఘంబు
పూర్తిఁ గావించి పిదపఁ ద ♦ పోధనావ
తంసుఁ డగుకౌశికునితోఁ బ్ర ♦ శంస సేయు
చును రఘూద్వహులను జూచి ♦ చోద్య మంది. 82

శా. ఈరాజన్యకుమారు లీయనఘు లీ ♦ యిష్వాసధౌరేయు లీ
వీరాగ్రేసరు లీదయాహృదయు లీ ♦ విధ్వంసితారాతు లీ
మేరుక్ష్మాధరధీరు లీసుగుణు లీ ♦ మేధానిధుల్ వీర లె
వ్వారో వృత్తమశేషమున్ విని యెదన్ ♦ వాచంయమా తెల్పవే.

సీ. అనుడు గాధేయుఁ డి ♦ ట్లనుఁ బ్రీతి దశరథ
రాజేంద్రతనయులు ♦ రామలక్ష్మ
ణాహ్వయుల్ వీరస్మ ♦ దాహూతులై వచ్చి
మనుజఖాదిని దాట ♦ కను వధించి
మారీచుఁ బ్రహరించి ♦ క్రూరుఁడై నసుబాహుఁ
జెండి దుష్టాసుర ♦ శ్రేణిఁ దునిమి
మత్క్రత్వనము స ♦ న్మహిమఁ గావించి రా
రూపమైనయహల్య ♦ శాప ముడిపి
వన్నె కెక్కుచు నీయింట ♦ నున్న చంద్ర
శేఖరునివింటిఁ జూడ వ ♦ చ్చిరి నృపాల!
యనిన జనకశతానందు ♦ లతిముదంబు
నొంది వారలఁ గొనియాడి ♦ రుచితగతిని. 84

వ. అంత శతానందుఁడు సభాజనంబులు వినంగఁ ద్రిభువనాద్భు
తంబు లగువిశ్వామిత్రునిప్రభావంబులు రామచంద్రున కె
ఱింగింప నుత్సహించి గాధి యనుభూవల్లభునకు విశ్వామిత్రుం
డు పుత్త్రుం డగుటయు రాజత్వంబునఁ గతిపయవత్సరంబులు
సర్వంసహాచక్రంబు ప్రజారంజనంబుగాఁ బరిపాలనంబు సే
యుటయు నొకానొక కాలంబున మృగయావిహారలంపటుండై
సబలంబుగా వనంబున కరిగి యచటనచట సంచరించుచు
నొక్కచో నధికతపోనిష్ఠాగరిష్ఠుండై నవసిష్ఠమహామునిం గనుం
గొనుటయుఁ దత్తపోధనాధీశ్వరారాధితుండై యావేళ నచట

విశ్రమించి తత్కామధేనుకృతాతిథ్యుండై సంతసించి కొంత తడవునకుఁ బ్రయాణోన్ముఖుండై యమ్మహర్షిసత్తము నాశబల నిమ్మనుచు ననేకవిధంబులఁ బ్రార్థించుటయు నతం డనంగీకారుం డగుటకుం గోపించి నిజభుజాబలవిక్రమం బేర్పడం బెద్దయుం బ్రొద్దు పోరాడి యజ్జడదారిదాడి కోడి పాఱి యన్నిరాబారి సాధింపమి నేమిమగఁటిమి యనుచు ననవధికక్రోధమానసుండై చని తుంటవిల్లామిడిసూఁడుదేవరం గుఱించి బిట్టు తపంబువట్టి పెక్కేఁడులు వేఁడుటయు నమ్మహాదేవుండు కరుణాయత్తచిత్తుండై సాక్షాత్కరించి యసంఖ్యబహువిధదివ్యాస్త్రమంత్రంబు లుపదేశించుటయుఁ బదంపడి క్రమ్మఱవచ్చి యమ్మహావిశిఖంబు లమ్మునిశిఖామణిమీఁదం బ్రయోగించిన నతండు బ్రహ్మదండంబున వారించుటయు నంతటఁ గౌశికుండు క్షత్రియత్వంబునకు రోసి బ్రహ్మర్షిత్వంబునకుఁ దపంబు సేయుటకు నుద్యోగించుటయుఁ దత్కాలంబునం దపోవిఘ్నంబునకు శంకింపక తెంపుచేసి చేసిన క్రియాకలాపంబులు త్రిశంకుస్వర్గసర్గంబును భాగినేయుం డగుశునశ్శేపునకు నంబరీషయజ్ఞసమాప్తియు నాత్మప్రాణసంరక్షణయుం జేయంగల మహామంత్రం బుపదేశించుటయుఁ బిదప మేనకతోఁ గొన్ని వత్సరంబులు క్రీడించుటయు రంభను శపించుటయు మఱియు నిరాహారుండై ప్రాగాశ నుగ్రతపంబు సేయుటయుఁ దత్తపఃప్రభవోపప్లవంబులకు భయమంది తపస్సామర్థ్యంబున

8

కు సంతసించి బ్రహ్మేంద్రాదిగీర్వాణులు వసిష్ఠు నారాధించి యతనిం గూడుకొని విశ్వామిత్రుచెంగటకుం జని బ్రహ్మర్షిత్వం బొసంగి యరుంధతీరమణసమారాధితుం గావించినం గృతకృత్యుండై వారల ననుపుటయు మొదలగునప్రమేయ విచిత్రప్రభావంబులు వినిపించిన నత్యంతసంతోషతరంగితాంతరంగంబులతో జనకరామచంద్రసౌమిత్రులు నచ్చటిసభాసదులును బహుప్రకారంబులఁ బ్రవిమలచరిత్రుఁ డగువిశ్వామిత్రుఁ బ్రస్తుతించి రంత. 85

క. మునివరుఁ డగుగాధేయుఁడు
జనకప్రభుఁ జూచి రామ • చంద్రుఁడు మదిలో
గనుఁగొన నువ్విళ్లూరెడు
జనవర తెప్పింపు మిపుడు • చాపం బనుడున్. 86

గీ. గట్టుదొరపట్టిఱేఁడును • జుట్టువాలుఁ
బట్టుదిట్టయుఁదక్క ని • ట్టిట్టి బొట్టె
లెక్కువెట్టంగ విల్లంత • యెల్లిదంబె
యనఁగ ముని నగి యైనను • గనఁగఁదగదె? 87

క. అనుపుఁ బదివేలభటులను
బనిచిన విలుదెచ్చి యాస • భాస్థలిఁ బెట్టన్
గని రాముఁ డింత గొనియా
డిన దీపాఁజిప్పకువిల్లఁ • టే యని నగుచున్. 88

ఉ. గ్రక్కునఁ గార్ముకం బెషమ • కైఁ గొనియుం గుడిక్కెనినారిపే

రక్కఁజ మొప్పఁ బైకెఁ దివి♦యర్ వెస విల్లొద లుర్విపాఁతుగా
నొక్కెడనిల్పినొక్కకొన♦యుంగొనియుంగొనయంబునెక్కెడన్
డక్కున భగ్నమయ్యె గుణ♦టంకృతి దిక్కులఁ బిక్కటిల్లఁగన్.

మ. అటులాచాపము భగ్నమైన జనకుం♦డాశ్చర్యముంబొందియుం
తటరామున్నుతియించియిచ్చెదను సీ♦తన్ మత్సుతన్ వేడ్కని
చ్చటివృత్తాంత మశేష మద్దశరథ♦క్ష్మాపాలుతోఁ దెల్పి యా
పటుదోర్విక్రముఁదోడితేఁగలవచః♦ప్రాగల్భ్యులన్ మంత్రులన్

సీ. పరికించి పనుపుము ♦ మఱియు విశ్వామిత్రి
మునిజనోత్తమ జగ ♦ ద్వినుతచరిత
చిత్తగింపుము కృపా ♦ యత్తచిత్తత మత్త
నూజ నూర్మిళ లక్ష్మ ♦ ణునకు నిత్తు
మదనుజతనుజల ♦, మాళవీ శ్రుతకీర్తు
లను కన్నియలఁ గోర్కె ♦ లొసర భరత
శత్రుఘ్నులకు నిత్తు ♦ సంతసంబున నాఁడు
బొట్టెల కిట్టులు ♦ చుట్టఱికము
పెరటిపట్టునఁ బుట్టిన ♦ పెట్టుచెట్టు
కట్టడగఁ దెట్టతెన్నక ♦ స్పట్టె భవద
నుగ్రహమునఁగదా వేఱె ♦ నుడువనేల ?
నిరతి హితకార్యకర్తవు ♦ నీవకావె ? 91

వ. అని విన్నవించిన సంతసించి యట్టుల తగువారిం గట్టడ కా
వించిన వార లతిత్వరితగతిం జని యయోధ్యాపురంబుఁ బ్ర

జేయుతఱిఁ బఙ్క్తిరథురాక ♦ చిత్తగించి. 100

సీ. పటహభేరీశంఖ ♦ పణవకాహళికాది
కల్యాణవాద్యని ♦ క్వణము లొలయ
హితపురోహితబంధు ♦ వృద్ధభూసురమంత్రి
వరు లిరుగెలఁకుల ♦ వరుస నడువ
శృంగారరూపజి ♦ వాంగనారూఢన
ర్తనకళావైభవ ♦ ప్రతిభ మెఱయ
వంశానుచరితజ్ఞ ♦ వందిమాగధలోక
జల్పితస్తుతికథా ♦ స్వనము లలర
వేణువీణారవంబులు ♦ వెలయుచుండ
నగణితప్రాభవంబున ♦ నగరు వెడలి
వచ్చి క్రచ్చ నెదుర్కొనె ♦ మెచ్చి పఙ్క్తి-
రథనృపతివీరు నావగా ♦ రాడ్గభీరు. 101

ఉ. అప్పుడు గాధిసూనుఁడు మహర్షివతంసుఁడు హర్షవారిధిం
దెప్పలఁదేలుచున్నపది ♦ తేరులఱేనితలం వెఱింగి మే
లొప్పఁగ రామలక్ష్మణుల ♦ నొయ్యనఁ గ్రమ్మఱ నప్పగింప లో
ముప్పిరిగొన్న మోహమున ♦ ముద్దుఁగుమారుల నెత్తెఁ గౌఁగిటన్

మ. సుముహూర్తావసరంబు వచ్చె నిఁకని ♦ చ్చోఁజాగుసేయంగఁగా
ర్యము కాదంచు వసిష్ఠకౌశికముఖా ♦ ర్యశ్రేణి వల్కన్ విదే
హమహీనాథుఁడు పెండ్లివారికులుపా ♦ లర్పించితోడ్కొంచు వే
డ్కన్ మహావైభవ మొప్పవీటికరిగెన్ ♦ ష్టాదేవతాయుక్తుఁడై.

చ. తనకులకర్తయౌ దశర♦థప్రభుసూతికిఁ బెండ్లియంచు నిం
పెనయఁగ వేడ్కతో దివిష♦దీశ్వరముఖ్యదిగీశులం గ్రమం
బునఁ బిలువంగ నేగుగతిఁ♦బూర్వనగేంద్రమునుండి వేగ మ
ద్దినకరమండలం బపర ♦ దిగ్గిరి డగ్గఱఁ జేరె నయ్యెడన్. 104

మ. తమి నిక్ష్వాకునృపాన్వయోద్వహు మహో♦ద్వాహంబు వీ[క్షింపఁ బ
శ్చిమదిక్కుంభ్యపరిస్థితుం డగుచు ని♦స్సీమప్రమోదప్రపూ
ర్ణమతిన్ వార్ధివిభుండు వచ్చుతఱి చెం♦తం బట్టుభర్తాతప
త్రమనన్ గాజరతార్కబింబమలరెన్♦బ్రాజ్యాస్తశైలోపరిన్

ఉ. క్రేవులపైఁ దలంపు లెదఁ♦గ్రిక్కిఱియన్ వెసమోము లెత్తి మే
పోపక సంజవేళ గన♦నొప్పె నటంచు ఘటోధ్ని ధేనువుల్
కాపరులం దగం బిలుచు♦గ్రైపడి నార్పులు గొల్లనాలలం
దేపకు నీరువట్టి దగఁ♦దీర్చి మరల్చిరి వారు పుంజలన్. 106

సీ. క్రతుభుక్పురాగత ♦ బ్రహ్మర్షికాషాయ
శాటికాపేటికా ♦ ఛాయ యనఁగఁ
బశ్చిమాశావధూ ♦ ప్రమదవనస్థిత
కంకేలిసుమగుచ్ఛ ♦ కాంతి యనఁగ
సంజనాహ్వయదిశా ♦ కుంజరకటభిత్తి
రచితకుంకుమపత్ర ♦ రుచి యనంగ
నికటార్కకరతప్త ♦ నిష్యందచరమభూ
ధరనభోమణికాంత ♦ ధామ మనఁగ

ధరణి శ్రీమద్రఘూద్వహా ♦ ద్వాహసమయ
విశ్రుధాంఘోవియద్వీధి ♦ విఘటితాభ్ర
తామ్రికిసలయసందోహా ♦ క్రమతోర
ణచ్ఛవి యనంగ సంధ్యారు♦ణంబు పర్వె. 107

చ. జలరుహముల్ ముడింగెవలి♦జక్కవలంగభహార్తి నెంతయుం
గలఁగఁదొడంగె నింగినుడు♦కాంతిపొసంగెఁజెలంగెఁజీఁకటుల్
గలువల కిం పెసంగె నుప♦కాంతసమాగమవాంఛ నెమ్మదిం
గులటలకుం బొసంగె రవి♦గ్రుంకె నడంగె మరీచికాంబుధుల్.

సీ. వినువీథి వెస సంజఁ ♦ జని నీడజంబులు
క్రీడించుఁ గూడుల ♦ జోడు గూడి
కమలముల్ ముకుళింపఁ ♦ దమి మధువ్రతబృంద
మానునన్యప్రసూ ♦ నాసవంబు
కడలందుఁ జీఁకటుల్ ♦ పొడఁజూపఁ గులటలు
విహరింతు రాత్మేచ్ఛ ♦ విటులతోడ
క్షుత్పిపాసలు దీరఁ ♦ గోరి చకోరముల్
భుజియించు రేయెండఁ ♦ బొట్ట నిండ
నహహా! దైవంబు తమిఁ దము ♦ నగ్గలంపు
వగలఁ బొగులంగఁజేసెఁగా ♦ తగవు విడిచి
యనుచు మగువలు మగలు న ♦ న్యోన్యగతులఁ
గవలఁ బెడఁబాసి తిరుగు జ ♦ క్కవలగములు. 109

గీ. అఖిలకకుబబ్జలోచనో ♦ ద్యానవాటి

కాలలితబంధురతమాల • సాలజాల
చారునిస్తంద్రమేచక • చ్ఛాయ యనఁగఁ
గటికిచీఁకటి పర్వెడి • కట్టములందు. 110

సీ. స్మరజైత్రయాత్రావ • సరహరిద్యోషిత్క
రక్షిప్తలాజోత్క • రమ్ము లనఁగ
నానటద్ధ్వజపటాం • తస్సంచలద్వియ
ద్గంగాతరంగాంబు • కణము లనఁగ
సంబుదాయనమహో • ద్యానచంచత్ఫుల్ల
నవమల్లికాప్రసూ • నంబు లనఁగ
క్షణదాంబుజేక్షణా • కచభారధృతవిభూ
షణక్లృప్తమౌక్తిక • గణము లనఁగ
నఖిలమఘభుగ్వధూటీవి • హారహరిహ
యాశ్మనిర్మితగగనసౌ • ధాంతరాంత
రస్థగితశుభ్రశుచివిచి • త్రితరవజ్ర
ఫలకము లనంగఁ దారకా • వళు లెసంగె. 111

క. సురరాజవధూసౌధో
పరికీలితకనకకలశ • భాతిమనోజ్ఞ
స్ఫురదరుణద్యుతి మెఱయఁగ
హరిణాంకుఁడు వొడమెఁ బ్రాగ • హార్యముమీఁదన్. 112

సీ. మఘవదిక్స్త్రీహర్మ్య • విఘటితశారికా
సముపేతవజ్రపం • జర మనంగఁ

బూర్వభూభృద్వన ♦ స్ఫురితబంభరసమం
చద్భ్రహాస్మల్లికా ♦ స్తబక మనఁగఁ
దారాపథగభీర ♦ తపనజానిర్ఝరో
ద్భవసమిద్ద్యుతఫేన ♦ పటల మనఁగ
తుణదావధూదూతి ♦ కాసమానీతాంజ
నలసద్రజతకరం ♦ డం బనంగ
నలరి యుభయాభిరుచివర్ణ ♦ మై యనంత
పుంబదవి నొంది కళలపెం ♦ పుఁ గని విబుధ
రంజన మొనర్చి యరిభీక ♦ రప్రయుక్తి
నిండుకొని యుండె ద్విజరాజ ♦ మండలంబు. 113

ఉ. కన్నులపండువై యలరెఁ ♦ గాటపుసంజ పొసంగ నిర్ల రే
యన్నువవిందు దోఁచె నిఁక ♦ నాఁకలి దూపయుఁ దీఱఁ గోరికన్
వెన్నెల మెక్కఁ గల్గె నని ♦ నిక్కుచు నంత మిథోనులాపముల్
వెన్నెలపుల్గు లెల్ల విను ♦ వీథిఁ జరింపఁ దొడంగెఁ బల్కుచున్.

సీ. వజ్రకుట్టిమనట ♦ ద్వ్యాళమంజీరాంఘ్రి
ఘట్టనోద్ధతరజః ♦ కాంతి యనఁగ
యామినీకాంతావి ♦ హారార్థకల్పిత
క్షౌమాపకారికా ♦ చ్ఛాయ యనఁగ
ఖేలదాశాంబుజా ♦ క్షీలోకకరకిర
ద్ఘనసారధూళీప్ర ♦ కాశ మనఁగ
ధ్వాంతభృంగోదుప్రిజా ♦ వ్యాప్తరత్న్యుద్యాన

వృతికేతకిపరాగ ♦ ఘృణి యనంగ
నోజ జీవనరాశి పె ♦ ల్లుబ్బఁగను గ
శావిశేషతఁ గువలయా ♦ హ్లాద మగుచు
రోదసీగహ్వరంబున ♦ మేదురముగఁ
బాండురం బగుచంద్రాత ♦ పంబు మెఱసె. 115

క. ధరణి హిమలవము లెసఁగెను
సురతటినీనిర్గతాతి ♦ శుంభద్వియదం
తరసంచరహంసచల
ద్గరుదాగతశీతలాంబు ♦ కణము లనంగన్. 116

సీ. అపుడు వసిష్ఠకా ♦ శ్యపగాధినందన
గౌతమపర్వత ♦ కణ్వగర్గ
నలినజతనయశౌ ♦ నకవామదేవాత్రి
జాబాలిముఖ్యవా ♦ చంయమేంద్రు
లెల్లఁ జంచత్కృపా ♦ హృదయులై దీపింప
వృద్ధధాత్రీసుర ♦ ప్రీడవతులు
హారతు లర్పింప ♦ నార్యు లాగమశబ్ద
మలరింప వారాంగ ♦ నలు నటింప
వందిజనములు గీర్తింప ♦ వరుస సుతచ
తుష్టయముతోడ దశరథుఁ ♦ డిష్ట మెసఁగఁ
జతురుదన్వత్పరియుక్త ♦ శధరుకరణి
వచ్చె బలుతేవ జనకని ♦ వాసమునకు. 117

వ. అట్లు మహావైభవంబుగా సమస్తజనపరివృతుండై వచ్చినదశ
రథధరాధినాథమూర్ధన్యుని గనుంగొని నితాంతసంతోషం
బున జనకరాజచంద్రుండు చతుశ్శాలాప్రాంగణప్రాంచద
భంగశృంగారరంగవల్లికావిచిత్ర నవరంగమందిరాంతరసము
న్నతమంగళాయతనసులలితసముదీర్ణనవరత్నఖచితచామీకర
పరిభావిశేషశోభితపీఠంబులం బెండ్లికుమారులం గూర్చుండం
జేసి వసిష్ఠాదిమహర్షిసత్తముల నర్హాసనంబుల నాసీనులం గా
వించి రఘువంశరత్నాకరసుధాకరుం డగుపఙ్క్తిస్యందనోర్వీ
శ్వరసక్రందనునకు ననర్ఘ్యసింహాసనం బొసంగి తక్కినజనం
బుల నక్కజంపుటక్కటికంబున నక్కజంపుటాస్తరణంబుల
సుఖోపవిష్టుల నొనర్చి యమ్మహోత్సవంబు విలోకించుచున్న
సమయంబున. 118

క. తలయంటె నొక్కయలికుం
తల సంపఁగెనూనె రఘువ । తంసున కింద్రో
పలఖచితకనకమయశయ
వలయఝణంఝణర । వంబువలనుగఁ జెలఁగన్. 119

క. నిటలతటవిస్ఫుటనట
త్కుటిలాలక యగుచు నొకచ । కోరదృశ సము
త్కటహర్ష మెసఁగ గందపు
టటకలి వెట్టెం బ్రభాక । రాన్వయమణికిన్. 120

చ. జలక మమర్చె నొక్కజల । జాతవిలోచన యొక్కనీలకుం

తల తడియొత్తె ధౌతవస ♦ నం బిడె నొక్కసుధాకరాస్య వి
చ్చలవిడి పైఁడిగద్దియ యొ♦సంగె వెలందుక యోర్తు పిన్నెఱుల్
మెలఁత యొకర్తు దువ్వె నెల♦మింగొనగోరుల రామమూర్తికిన్.

సీ. కమనీయనవరత్న ♦ ఖచితకోటీరంబు
శిరమున ఘటియించెఁ ♦ జెలువ యొకతె
వికసితమణిబద్ధ ♦ మకరకుండలములు
వీనులఁ గీలించె ♦ వెలఁది యొకతె
గొనబువన్నియ మీఱు ♦ కనకకేయూరముల్
భుజముల నెలకొల్పెఁ ♦ బొలఁతి యొకతె
రాణించు తెలితళ్కు ♦ టాణిముత్తెపుఁబేరు
లురమున నొనగూర్చె ♦ నువిద యొకతె
వీరవిజయాంకమన్నెకు ♦ మారబిరుద
మైనఘనగండపెండేర ♦ మంద మలరఁ
బాదములఁ బాదుకొల్పెను ♦ బడఁతి యొకతె
నిండువేడుక రఘువంశ ♦ మండనునకు. 122

క. మినుకగుకుంకుమ నెన్నొస
లను గళ్యాణంపుబొట్టు♦లాలితముగఁ దీ
ర్చెను సుందరాంగి యొక్కతె
కనుపండువు గాఁగ నుష్ణ ♦ కరకులమణికిన్. 123

గీ. నలుఁగెలంకులమేలిసా ♦ న్నంపుజవల
మెఱుఁగు లొరయంగఁ దళతళ ♦ మెఱయునట్టి

నిలువుటద్దంబుఁ గొనివచ్చి ♦ నిలిపె నెదుట
దర్పణకపోల యొక్కతె ♦ దాశరథికి. 124

క. ఘుమఘుమపరిమళ మొలయుచుఁ
గొమరారెడుపువ్వుబెత్తు ♦ కూటువ లామో
దము గ్రిమ్మంగ సికఁ జుట్టెను
బ్రమదామణి యోర్తు రామ ♦ భద్రున కొనరన్. 125

గీ. పచ్చికస్తురితావిక ♦ ప్రమును వలపు
గులుకుతుహినజలమ్మును ♦ గూర్చినట్టి
చందన మలందె నొకయుర ♦ విందగంధి
యంద మందంగ దశరథ ♦ నందనునకు. 126

గీ. అటులు రఘువీరుఁ గై చేసి ♦ యతిరయమున
కడమమువ్వర దివ్యమాం ♦ గళికలక్ష
ణములు వెలయంగఁ గైసేయ ♦ సమితహర్ష
మునఁ బురోధోవతంసుఁడు ♦ వినయగతిని. 127

సీ. శ్రీవినాయకపూజ ♦ చేయించిపుణ్యాహ
వాచన మొనరించి ♦ వలకరమునఁ
గంకణంబొప్పుగఁ ♦ గట్టించి యజ్ఞోప
వీతధారణముగా ♦ వించి యచట
జలరాశిమేఖలా ♦ సవనాశనుల కెల్లఁ
గర్పూరమృగమద ♦ గంధపుష్ప
తాంబూలముఖ్యస ♦ త్కారంబు లర్పించి

కన్యావరణ యిచ్చి ♦ కౌసలేయు
ప్రవర వచియించి యున్నంతఁ ♦ బ్రిమద మొప్ప
జనకుఁడు కుశధ్వజుండును ♦ సతులతోడ
నప్పు డభ్యంగసస్నాన ♦ మాచరించి
రవణములు వల్వలు ధరించు ♦ నవసరమున. 128

చ. తరుణి యొకర్తు వేడ్కవసు♦ధాసుతకుందలయందునొక్కసుం
దరి జలకం బమర్చె నొక♦తన్వి తమిం దడియొత్తె నొక్కమం
జరికుచ వల్వ లిచ్చె నొక♦చాన వెసన్ నొసలందుఁగుంకుమం
బరుదుగఁ దీర్చె నొక్కనలి♦ నానన కాటుక వెట్టెఁ గన్గవన్.

శా. శృంగారాంబురుహాకరంబొ వచస♦శ్రీప్రౌఢిమన్ మించుమేల్
బంగారంవు వెలందియో సతనుశం♦పావల్లియో కాక యీ
మాంగళ్యాంకము లేరికిన్ మునువచిం♦పన్ వింటిమే కంటిమే
గాంగేయోదరుసృష్టిచాతురి ధరా♦కన్యావిలాసంబునన్. 130

సీ. అబ్దచంద్రశరాస ♦ నాబ్జాబ్దశష్కులీ
కచముఖభ్రూనేత్ర ♦ గండకర్ణ
హీరకందుకబింబ ♦ కీరచంపకచంద్ర
రదచుబుకోష్ఠవా ♦ గ్ఘ్రాణహాస
దరబిసపల్లవ ♦ ధరతరంగమృగేంద్ర
గళభుజకరకుచ ♦ వళివలగ్న
మహికరతూణక ♦ మఠదంతితారకా
కటిసక్థిజంఘాంఘ్రి ♦ గమనసఖర

కాంచనశిరీషకుసుమస ♦ త్కాంతిదేహ
మాంగళికదివ్యలక్షణ ♦ మహిత యగుచు
రఘుకులోద్భవుసామ్రాజ్య ♦ రమ యనంగ
జనకసుత యొప్పెఁ బరిణయ ♦ సమయమందు. 131

గీ. అనుచుఁ జూపఱు లద్భుత ♦ మంద ధరణి
కన్యక కలంకృతి యొనర్చి ♦ కడక నూర్మి
ళకును మాండవిశ్రుతకీర్తు ♦ లకును మాంగ
ళికవిధు లొనర్చి శుభవిత ♦ ర్దికకు నెలమి. 132

శా. శ్రీరంజిల్లఁగఁ బెండ్లికూఁతుల నిటుల్ ♦ చెన్నొందఁ గైచేసి తో
తేరన్ గన్నులఁ గాంచి తజ్జనకు లెం ♦ తే భక్తి హేరంబునిం
గౌరిం గొల్చి ధరాసుపర్వులకుస ♦ త్కారంబు లర్పింపఁ బెం
పారన్ మైథిలగోత్రవర్గకథన ♦ వ్యాపారులై యుండఁగన్. 133

గీ. వరుల కపు డత్తమామలు ♦ వరుసఁ గాళ్లు
గడిగి మధుపర్కముఖ్యస ♦ త్కార మిచ్చి
పుత్త్రికల దానధారాంబు ♦ పూర్వకముగ
నొసఁగి ప్రతిసీర వట్టి సం ♦ తస మెసంగ. 134

శా. గానం బొప్పఁగ స్వస్తిశబ్దములయన్ ♦ గాఁశిక్యమాడంగబ్రి
హ్మానందంబు చెలంగ నాకసమునం ♦ దాదిత్యు లీక్షింపఁగా
నానాభూసురసంచయంబు శుభమం ♦ త్రస్ఫూర్తి శోభిల్ల ల
క్ష్మీనారాయణ సావధానయనుచున్ ♦ జిత్రంబుగాఁ బల్కఁగన్.

గీ. జ్యోతిషజ్ఞాను లుడువీథి ♦ రీతి గని ము

హూర్త సమయం బనుచుఁ దెల్పు ♦ నోజ దంప
తులశిరోధృతగుడజీర ♦ కులుగఁ జేసి
రఖిలజనములు ముదమంది ♦ యరయుచుండ. 136

క. కళ్యాణహారతులతోఁ
గళ్యాణపుఁబల్లెరములు ♦ గ్రన్నన రమణుల్
గళ్యాణంబులు పాడుచుఁ
గళ్యాణవితర్దిమీఁదఁ ♦ గదియించి రొగిన్. 137

శా. శ్రీరామక్షితిమండలేంద్రుఁడు ధరి♦త్రీపుత్రికంఠంబునం
దారూఢస్థితిఁ గట్టె నైదువలున♦త్యాసక్తి నూర్చంగ నిం
పారన్ మంగళసూత్రమయ్యెడనుగో♦త్రాదిత్యులెంతే ధ్రువం
తేరాజా వరుణో ధ్రువ మ్మనుచుఁబ్రీ♦తింబల్కనామోదియై.

గీ. ఘనుఁడు భరతుఁడు మాళవి ♦ కెనయువేడ్క
లక్ష్మణుండూర్మిళకు శుభ ♦ లక్షణప్రి
పూర్తి శత్రుఘ్నుఁడును శ్రుత♦కీర్తి కొఱపు
గదుర మంగళసూత్రముల్ ♦ గట్టి రంత. 139

క. తరుణులశిరములఁబతులున్
దరుణులుపతిశిరములందుఁ ♦ దమిమీఱఁగనిం
చిరిముత్తెపుఁదలఁబ్రాలను
సిరిమెఱయఁగనఖిలజనుల ♦ చిత్తములలరన్. 140

గీ. అంత సగ్నిప్రతిష్ఠాప ♦ నాదివిధులు
శ్రుతిహితంబుగఁ గావించి ♦ శుచికి మ్రొక్క

ప్రీతిసప్తర్షులకు గురు ♦ వృద్ధబంధు
జనులకు నమస్కృతి యొనర్చి ♦ సరభసమున. 141

క. దంపతులు పరస్పరముగ
మంపెసఁగఁగఁ జూచుకొనుచు ♦ మక్కువ మీఱన్
బెంపొదవఁగఁ గూర్చుండిరి
సంపఁగివిరిముల్కి వలఁతి ♦ శరములు నింపన్. 142

వ. అయ్యవసరంబున. 143

క. తరుణులు కొందఱు బంగరు
హరివాణములందు రసర ♦ సాన్నము లిడి ముం
దర నినిచినఁ గొని భుజియిం
చిరి కసిగాటులుగ మదిని ♦ సిబ్బితు లెసఁగన్. 144

సీ. శ్రీమీఱ నిటులు లో ♦ కామోద మలర మ
హోత్సాహమున వివా ♦ హోత్సవంబు
గావించి జనకక్షు ♦ మావిభుండు మహర్షి
వరుల కుర్వీసుర ♦ వరుల కెల్ల
సంతుష్టి యొనరించి ♦ సమదమదావళో
త్తుంగతురంగశ ♦ తాంగములను
మణిశిబికానేక ♦ మౌక్తికచ్ఛత్రచా
మరముఖాసంఖ్యస ♦ మస్తవస్తు
దాసదాసీజనంబు ర ♦ త్నములు కాంచ
నాంబరాభరణంబులు ♦ నరణ మిచ్చి

దంపతుల నంపకము చేసి ♦ దశరథునకు
నతనిసతులకు వివిధస ♦ త్కృతు లొనర్చి. 145

వ. మఱియుం దక్కినజనంబులకు సక్కజంబుగాఁ బెక్కువిధంబు లసత్కారంబు లొసంగి పంపకంబు గావించి తోన గొంతదవ్వు చని తత్తదనుజ్ఞాతుండై జనకభూవల్లభుండు క్రమ్మఱ నిజనివాసంబునకు వచ్చిన గాధినందనుండు నమందానందంబుసం బఙ్క్తిస్యందనుని సపుత్త్రబాంధవంబుగా నభివృద్ధిఁ బొందుచుండు మనుచు నాశీర్వదించి యుత్తరపర్వతంబునకుం జనియె నంత నద్దశరథుండు నత్యామోదంబునం గొడుకులం గోడండ్రనుం దోడ్కొని వసిష్ఠవామదేవప్రముఖబ్రహ్మర్షిసత్తములును, సుమంత్రాదిమంత్రులును, విద్వత్కవీంద్రవందిమాగధమిత్రబంధుసామంతభృత్యజనంబులును, నర్తనకళాప్రవీణగణికాలోకంబును, మత్తమాతంగముఖ్యచతురంగబలంబును బలసి కొలువ బలుఠేవం జనుచుండ ముందట. 146

క. పతగకులఘోరరవములు
ప్రతికూలసమీరణములు ♦ బహుళరజంబుల్
వితతంబుగ నశుభంబులుఁ
గుతుకమలరఁ గానఁబడియెఁ ♦ గొన్ని శుభంబుల్. 147

వ. కాంచి భయాకులుండై పఙ్క్తిరథుండు వసిష్ఠమహామునికెఱింగింప నతండు తచ్ఛుభాశుభంబులు పరీక్షించుచు నరుగుచుండ నొక్కచోట. 148

చ. గురుతరకార్తవీర్యభుజ♦గోత్రపురందరు ధైర్యదేవతా
ధరు నయమార్గతత్పరు మ♦దద్విషదుగ్రభుజంగనీలకం
ధరు గుణబంధురుం బ్రచుర♦ధన్వకళాపరిభూతనీలకం
ధరు నృపపద్మసింధురుఁ గు♦ఠారధరున్ ధరణీమరుద్వరున్.

క. కని సాధ్వసంబు మనమునఁ
బెనఁగొన నందఱును మ్రొక్క ♦ భృగురామునకున్
వినయమున నర్ఘ్యపాద్యము
లినకులనాథుఁ డగుదశర ♦ థేశ్వరుఁ డిచ్చెన్. 150

క. ఇచ్చిన విముఖత భార్గవుఁ
డచ్చోటును గడలి రాఘ ♦ వాంతికమునకున్
విచ్చలవిడి చనుదేరఁగఁ
జెచ్చెర రఘువరుఁడు పూజ ♦ సేయఁగ ననియెన్. 151

గీ. శివునివిల్లు విఱిచి ♦ సీతను బెండ్లాడె
రాముఁ డనుచుఁ బ్రజలు ♦ ప్రస్తుతింప
నమ్మహేంద్రపర్వ ♦ తమ్మున విని నీభు
జాబలంబు చూడ ♦ సరభసమున. 152

ఉ. వచ్చితి నింక నెందుఁ జను ♦ వాఁడవు చాపశరంబు లిచ్చటం
జెచ్చెరఁబెట్టి ప్రోవు మని ♦ చేతులు మోడ్చినఁ గాక తక్కినన్
వ్రచ్చెద మత్కుఠారమున ♦ వారిచరాంకవిరోధి తద్దయున్
మెచ్చిన విక్రమాంచితు న ♦ మేయభుజాబలు నన్నెఱుంగవే.

ఉ. రాముఁడ నేన కాక మఱి ♦ రామసమాఖ్య మదన్యు లైనవా

కేమని తాల్తు? రెట్టులు స॰హింపనగునె? మదతీతవిక్రమో
ద్దామమహోమహామహిమ॰ధన్వకళాఢ్యత గల్గకుండినన్
రామ యటంచుఁబల్కఁగను॰రాముఁడనందగునేజగంబునన్.

సీ. త్రిపురాస్త్రిపారాతి ॰ కృప శరాసనకళా
భ్యసనంబు గావించి ॰ నట్టివాఁడఁ
గృతవీర్యనందనో ॰ ద్ధతబాహుసాహస్ర
మాహవంబునఁ ద్రుంచి ॰ నట్టివాఁడఁ
గయ్యంబు మొనకట్టి ॰ ముయ్యేడుమాఱులు
పట్టి రాజులఁ గొట్టి ॰ నట్టివాఁడఁ
బునుక లన్నిట నిలిం ॰ పులమన్కిపట్టుకు
మెట్లు లొప్పఁగఁ గట్టి ॰ నట్టివాఁడ
నగుటఁ బ్రౌఢులు పొగడఁగ ॰ జగమునందు
వినియునీ విట్లు లించుక ॰ వెఱపులేక
రాచపట్టి నటంచు బీ ॰ రమున బ్రోల
నిలిచి పలికెద విఁక నైనఁ ॰ దొలఁగవలదె? 155

సీ. సత్కృపాణు లైనట్టి ॰ జననాథకులజులు
విబుధసంసేవనో ॰ ద్వృత్తు లగుట
ధార్మికోత్తము లైన ॰ ధరణీతలేశ్వరుల్
స్వస్తిస్త్రిసమాగమా ॰ సక్తు లగుటఁ
బ్రధనదానప్రౌఢిఁ ॰ బరగిననరపతుల్
సతతసత్పదవీప్ర ॰ శస్తులగుట

నుశ్లోకవైభవ ◆ శుభు లైనరాజులు
విపులాగమాంతప్రి ◆ విష్టు లగుట
చాల విని శత్రుమును విల్లు ◆ జాతరోష
మును గళాపూర్తి విడువక ◆ ముదము గదుర
నిటులు నాధాటి కెదుట ని ◆ ల్చుటను నీవు
విష్ణుపదవాసి వగుటకు ◆ వింతగలదె? 156

గీ. సురహితుండవు గాని యసు ◆ రహితుఁడవు
గావు కావున నన్నిటఁ ◆ గావు కావు
మనుచు వేఁడినఁ గాక ని ◆ న్నసురహితునిఁ
జేయుదును గాదె మాటలు ◆ వేయునేల? 157

గీ. అనిన రఘురాముఁ డల్క ని ◆ ట్లనుచుఁ బలికె
మంచి దిఁక నీవు గర్వించి ◆ మమ్ము నెంత
యెల్లిదంబుగఁ జూచినఁ ◆ బ్రల్లదములు
బల్లిదులు పల్కుమరఁటయ్య! ◆ బాపనయ్య! 158

క. క్షితి సురవరుఁడవు నయగుణ
హితుఁడవు సర్వజ్ఞబోధి ◆ తేష్వాసకళా
చతురుఁడ వగునీవాత్మ
స్తుతియును బరనిందసేయ ◆ దోషముగాదే? 159

మ. అదిగా కున్నను యోగిపుంగవుఁడ వే◆వయో వయోవృద్ధవు
న్మదవాచాకలితుండ వార్యజననిం◆దానిశ్చయాత్ముండ వే
ను దినేశాన్వయజుండ ధార్మికుఁడనే◆నోధీరుఁడన్ రాముఁడన్

గదనం బెట్లు ఘటిల్లు నిర్వ్రరకు వా♦క్కాంతేశవంశోత్తమా.

గీ. అనిన భార్గవుఁ డాగ్రహం♦బున వచించె
నెదిరిసత్వంబుఁ దనసత్వ♦మెఱుఁగనట్టి
బాలిశునిఁ బోలి పలికెద♦వేల రాచ
బుడుత వినుమయ్య మచ్ఛక్తి♦జడత విడిచి. 161

శా. సాస్త్రాసారుగభూపతుల్ రణములో♦నస్మత్కుఠారస్ఫుర
చ్ఛస్త్రచ్ఛిన్నశరీరులై చని దివిన్♦స్వచ్ఛందసంచారులై
ఖస్త్రీసంగతులైరి తద్రుధిరమేఁ♦గావించితిం గా యథా
శాస్త్రంబొప్పఁగఁ దర్పణాంజలులు ని♦శ్శంకం బితృప్రీతిగన్.

గీ. తివిరి యయ్యాదిభిక్షుఁ బ్రాఁ♦చీవుకువిల్లు
విఱిచితి నటంచుఁ గడువిఱ్ఱ♦వీఁగవలదు
చేవ గలదేని యిపుడు నా♦చేతిచాప
మెక్కువెట్టినఁ దలఁతు ని♦న్నెక్కుడుగను. 163

క. నావుడు దశరథరాముఁడు
వైవస్వతుకరణి దుర్ని♦వార్యుఁ డగుచు భూ
దేవునిధనువు వెసం దే
జోవీర్యము లందుకొనెదు♦చొప్పునఁ గొనియెన్. 164

క. కొని సాహంకృతిఁ దద్దయు
గొనయం బెక్కించి తోన♦గుణటంకారం
బొనరిచి సునిశితవిశిఖము
దొనఁ దీసి శరాసనమునఁ♦దొడిగి కడంకన్. 165

క. భార్గవ యవితథ మస్త్ర
న్మార్గణ మిసుమంత దీని ♦ మరలింపఁగ నా
భర్గున కలవియె యిఁక నీ
స్వర్గతినిర్గతిగఁ ద్రుంతుఁ ♦ జరణయుగంబుల్. 166

క. అని రఘురాముఁడు పలికిన
విని భార్గవరాముఁ డతని ♦ విక్రమమునకున్
మనమున వడవడ వణఁకుచు
వినయంబున ననియె విగత ♦ వీర్యుం డగుచున్. 167

క. నాపదములు దెగనేయక
కోపం బుడుగుము మహేంద్ర ♦ కుధరంబునకున్
భూపోత్తమ పోవలయును
శాపంబు ఘటిల్లెఁ దొల్లి ♦ జగతీసురుచేన్. 168

క. కావున నీదగువిక్రమ
మావిష్ణుపరాక్రమంబు ♦ నారయ తుల్యం
బై వెలయుఁగాన మును నేఁ
గావించిననాకపథము ♦ ఖండింపు మిటన్. 169

చ. అనవుడు రామచంద్రుఁడు ద♦యాళుఁడు గానఁ దదుక్తరీతిన
య్యనిమిషలోకమార్గముర♦యంబునఁ ద్రుంచినఁగాంచిభార్గవుం
డినకులవీరుఁ జాల నుతి♦యించి ప్రదక్షిణమాచరించి చ
య్యనఁజనియెన్ మహేంద్రగిరి♦ కయ్యెడమెచ్చిరినిర్జరుల్ దివిన్.

చ. దశరథుఁ డంత నెంతయు ము♦దం బలరారఁగుమారకున్నిరం

కుశఘనబాహువిక్రము ర♦ఘుప్రవరున్ సుగుణున్ ధనుఃకళా
కుశలునిఁ జూచి సంతసిలి♦క్రూరుని భార్గవుఁ గెల్చి యిప్డు ప
ద్దశఁ దొలఁగించెనోర! యిఁక♦ధన్యుఁడనై తిఫలించెఁగోరికల్.

క. అని మది మెచ్చుచుఁ గడు నం
దను నుపలాలించి జామ♦దగ్న్యాంబుధిలం
ఘన మొనరె నింక సబలము
గ నయోధ్యాపురికి నరుగఁ♦గావలె నంచున్. 172

మ. విలసత్కేతనఘంటికానినదముల్♦వేదండతుండస్వనం
బులు వాజిప్రకరారవంబు పృతనా♦భూరిధ్వనుల్ శంఖమ
ర్దళభేరీముఖవాద్యనాదములువా♦రస్త్రీమహానర్తనం
బొలయం బఙ్క్తిరథుండు వచ్చెఁ బురికిన్♦బ్రోత్సాహియై
[యయ్యెడన్.

ఉ. లాజలు నక్షతంబులు వి♦లాసము మీఱ ధరామరుత్పురం
ధ్రీజను లెల్లఁ జల్లుచు న♦తిప్రమదం బొలయంగ భవ్యనీ
రాజన మిచ్చుచుండఁగఁ బు♦రంబునఁబెండ్లికుమారులర్మిలిన్
రాజపథంబు మించి మది♦రంజిల వచ్చిరి మన్కిపట్లకున్.

క. అంతట నొకశుభదినమున
సంతోష మెలర్ప వృద్ధ♦జనతానుమతిన్
గాంతాజనములు సీతా
కాంతం గై చేసి రపుడు♦కాకుత్స్థుండున్. 175

క. అభ్యంగనాదివిధులు ము

నీభాజ్య నొనర్చి మఱియు ♦ హేమాలంకా
రాభ్యంచితుఁడై ఘనమృగ
నాభ్యాదిసువస్తువాస ♦ నాకలితుండై. 176

వ. నితాంతసంతోషంబునం జెలంగుచున్న రఘుపుంగవునకుఁ గట మెలంగుకురంగనయనలు బుధలోకానుమతంబున పవారిధా రాధరశ్యామాభిరాముని రామునిఁ గైదండ లిడి తోడ్కొని చని కేళికామందిరంబున శయ్యాతలంబునం గూర్చుండం జేసి సీతాతటిల్లతాంగి నచ్చటికిఁ దోడితెచ్చుటకు మఱలి వచ్చుచుం దద్గృహశృంగారంబున కచ్చెరువందుచుం దమలోన.

సీ. శారికోక్తమనోజ ♦ జయకథాప్రచురంబు
పటువాక్కలితకీర ♦ పంజరంబు
కస్తూరికాగంధ ♦ ఘనసారవిసరంబు
మహనీయగంధసం ♦ పత్కరంబు
మాణిక్యదీపికా ♦ శ్రేణికారుచిరంబు
బహువిధాగరుధూప ♦ బంధురంబు
శ్లాఘ్యవర్ణాంబరో ♦ ల్లాభచిత్రతరంబు
ప్రసవకల్పితతల్ప ♦ భాసురంబు
కుసుమదామసదామోద ♦ గురుతరంబు
బహుళపరిమళసద్వస్తు ♦ పరికరంబు
సుందరంబుల కెల్లను ♦ సుందరంబు
మనుకులస్వామి కేళికా ♦ మందిరంబు. 178

గీ. అనుచుఁ బల్మాఱు వర్ణించు • కొనుచు నేగి
సదరహాసితాస్యయై సీత • సరస నిలిచి
వేళ యయ్యెను విభునకు • విడె మిడంగఁ
దడవు వల దింక లెమ్ము క్రొం • దలిరుఁబోఁడి. 179

గీ. అని కరంబు వయోవృద్ధ • యౌవతంబు
వినిచి కైదండ లిడుకొని • వేడ్క వాడమ
మఱియుఁ గొన్ని మిథఃకథల్ • మంతనముగ
నుడువుచును దావుఁ గదలించి • నడుపునపుడు. 180

గీ. చెలువలజ్జాభరం బను • శృంఖలంబు
దవులుకొని యుంటఁ బదము గ • దల్ప దయ్యె
మేటివల పనుముప్పిరి • త్రాటఁ బట్టి
ముంగలికి లాగఁదొడఁగె న • నంగుఁ డంత. 181

గీ. పట్టి బలుశేవఁ గట్టను • న్నట్టిపెద్ద
యోడఁ గదలించుకొని వచ్చు • నోజ దోఁపఁ
దోడి తెచ్చిరి పుడమిపూఁ • బోఁడిపట్టి
పడకయింటికి సంగడి • పడఁతులెలమి. 182

సీ. అఱచందురునిదండ • నలరారుస్వాతినా
నొసటఁ గుంకుమబొట్టు • పస నెసంగఁ
గుంభిమస్తకచల • ద్బంభరావళిమాడ్కిఁ
బిఱుఁదునఁ గీల్జడ • మెఱయుచుండ
జలజచంచత్సార • సధ్వానములరీతిఁ

బదముల నందెల ♦ రొదలు గదురఁ
జపలపైఁ గ్రమ్మిన ♦ శరదంబుదము రేవఁ
దనువున ధవళవ ♦ స్త్రము దలిర్ప
లలితవికసితపద్మినీ ♦ కలితమైన
సరసిపోల్కె లసన్ముఖా ♦ బ్జముల నలరి
చెలిమికత్తెలు చుట్టును ♦ బలసికొలువ
జనకసుత వచ్చెఁ గేళికా ♦ సదనమునకు. 183

క. ఆళీజను లొకకొందఱు
మేలంబులు సలుపుకొనుచు ♦ మెల్లన నచ్చెఁ
గేళీవినోద మలరఁగ
బాలామణిసరస నిలిచి ♦ పలికిరి నగుచున్. 184

చ. పదపద చాలునమ్మ! వెనఁ ♦ బొనుపుమీఁదికి సిగ్గఁటమ్మ! సొం
పొదవఁగ నాథుఁ గూడుము ము ♦ హూర్తము మించెఁగదమ్మ! [బాగుచే
సెదవవునమ్మ! రేపు మఱి ♦ చెల్వునితోఁ బిగికౌఁగిటన్ సదా
వదలకయుండువారలిటు ♦ వంటిగయాళులుగారె? యారయన్

మ. విలసద్రూపము విద్యయు న్ధనముదో ♦ ర్వీర్యంబు తారుణ్యముం
గల ప్రాణేశుఁడు గల్గినట్టిసతి భా ♦ గ్యంబే యమేయం బిఁకన్
దలమే నీసుకృతంబు దెల్పుటకు సీ ♦ తా! షడ్గుణైశ్వర్యసం
కలితున్ శ్రీరఘునాథుసంతతము వే ♦ డ్కం గూడి క్రీడింపఁగన్.

క. అని బోధించి తటాలున

వనితం గనుమొఱఁగి చెలులు ♦ వరుసకుఁ దఱిగాఁ
గనుగిఱిపి యొక్కరొక్కరె
చనినం దలవంచి నాన ♦ సతి యుండంగన్. 187

ఉ. కొంకక రాఘవుం డపుడు♦కూర్మి ధరాసుత కేలువట్టి ప
ర్యంకముపై వసించి సతి♦యాత్మకరం బభిరంజిలంగఁ దా
నంకమునందుఁ జేర్చుకొని♦హార్ద్రగ వేనలి దిద్ది తద్దయున్
గుంకుమబొట్టు దీర్చి కొన♦గోళ్ల చనుంగవ నొక్కియిట్లనున్.

క. నానయిటులేల విధుబిం
బానన! నాపైని బ్రేమ ♦ నాని సుధాధా
రానవమధురోక్తుల మది
నానంద మెలర్పఁ బలుకు ♦ మరమర తొఱఁగన్. 189

సీ. చంచరీకాలక ♦ చంద్రబింబానన
చాపసుభ్రూయుగ ♦ చంచలాక్షి
చంపకనాసిక ♦ చక్రవాకస్తని
చక్రిరోమావళి ♦ చక్రనాభి
చండికాశ్వవలగ్న ♦ చక్రోపమనితంబ
చటులరంభోరువ ♦ చంద్రగాత్రి
చారుపయోజాంఘ్రి ♦ చక్రాంగగామిని
చందనసౌరభ ♦ చంద్రహాస
చక్రధరనరదనవిషంగ ♦ జంఘయుగళ
చమరవాలసమానవి ♦ శాలవేణి

చతురవాచావినిర్జిత ♦ శారికాళి
చాటుగాథాకథావృత ♦ సరసహృదయ. 190

సీ. వెడవింటిదంట బ ♦ ల్విడి దారి చూపఁ గ
న్నడ సేయఁదగునఁటె? ♦ పుడమిపట్టి!
విడెము గైకొను మని ♦ బడిబడి ప్రార్థింపఁ
దడవు సేసెదవేమె? ♦ పడఁతిమిన్న!
నుడువు వినంగఁగో ♦ రెడుచిత్త మింపొందఁ
గదుఁ గూర్మిఁ బలుకుటె ♦ న్నఁడు? వెలంది!
నడురేయి పొడసూపఁ ♦ దొడఁగె నీయరమర
విడిచి భోగింపు మి ♦ య్యెడ లతాంగి!
విడిముడియు నాడెమగునట్టి ♦ తొడవు లిడుదుఁ;
బెడమొగము ద్రిప్పి వలపు పెం ♦ పడరఁ బోఁక
ముడి వదల్చి తటాలున ♦ నెడరుసడలఁ
గడఁకతో నింకఁ గ్రీడింపు ♦ ముదువరాస్య. 191

గీ. అనుచు నతిమోహమున నాడి ♦ యనఁగి పెనఁగి
పెదవి చెక్కులు కనుఁగవ ♦ నుదురు ముదము
గదుర బహువిధచుంబన ♦ గతు లొనర్చి
యతనుకేళికి నొనగూర్చె ♦ నతివ నపుడు. 192

క. కప్పురపువిడెము పడఁతికి
గుప్పన నిడి తాను మఱలఁ ♦ గొనునా నేర్పుల్
తెప్పలు ప్రాల్పక మదనుఁడు

తప్పక కనుఁగొనుచు నుండి ♦ తఱి యెఱిఁగి వెసన్. 193

సీ. గడితంపుహొయలు గు ♦ ల్కెడుతుంట సింగాణి
వెరవు బీరములావు ♦ మెఱయఁగేలఁ
బట్టి ప్రత్యాలీఢ ♦ పాదుఁడై నిలిచి తి
య్యనితేనె పొట్టనిం ♦ డారఁ గ్రోలి
మదమునఁ బొదలెడు ♦ కోదమతుమ్మెదనారి
గదియించి టంకృతి ♦ మొదలఁజేసి
హరువుమీఱెడుపువ్వు ♦ టమ్ములు సంధించి
కడఁకఁ బుంఖానుపుం ♦ ఖముగ నపుడు
పుడమిపట్టికి నెమ్మదిఁ ♦ బొడమినట్టి
సిబ్బితిదొలంగ వలపుపె ♦ ల్లుబ్బికొనఁగ
దశరథాపత్యవరునకుఁ ♦ దమిఫలింపఁ
బూని విసువక ♦ నిరువుర ♦ పైనివైచె. 194

చ. కొఱకొఱమంచు నాన విడఁ♦గొట్టి వివేకపుసుద్దు లన్నియున్
మఱవ నొనర్చి మోహమున♦మ్రగముగా నెలకొల్పుమున్నుగా
తెఱఁగనివారికైన మది♦నెంతయు నిష్టము గల్గఁజేయు నే
ర్పెఱి మరుఁ డట్టిధన్వుఁడొ స♦తీపతులం గవగూర్చుపట్టునన్.

వ. అప్పుడు రఘువరుండు. 196

సీ. కలికిగొజ్జఁగి పరం ♦ బుల నించునెపమున
విప్పగునెఱికప్పు ♦ కొప్పు దువ్వి
కమ్మని తమలంబుఁ ♦ గఱపించువడువునఁ

బవడంపుఁగెమ్మోవి ♦ పంటనొక్కి
ఘనసారమిళితచం ♦ దన మలంచెడులీల
వలుదచన్గవహస్త ♦ ములను నిమిరి
జాలువాఁ మొలనూలు ♦ సవరించుచందానఁ
దమిమీఱ నీవిబం ♦ ధము వదల్చి
యంతలోఁ గొని యిక్కు ♦ వ లంటి మిగుల
వలపుగొలుపఁ బ్రియోక్తులు ♦ వలికికొనుచు
వితతచతురత హితమతి ♦ సతులగతుల
రతులఁ దేలించె సీత నా ♦ రామవిభుఁడు. 197

క. డాసిన నెఱుఁగక చతురతఁ
జేసిన చెయువులకు మఱలఁ ♦ జేయక రతిచే
గాసిలియున్నట్టి నవ్రో
ఢాసంగమసుఖము మది దృ ♦ ఢం బయి యొసఁగన్. 198

గీ. పిదప రఘువీరుఁ డవనిజఁ ♦ బ్రీతిఁ గురువు
నం దునిచి కొప్పు గొనబుగఁ ♦ బొందుపఱిచి
చాలపేరులు సవరించి ♦ చాటువచన
రచన నెఱపుచు సుఖలీల ♦ రాత్రిఁ గడపి. 199

శా. ప్రాతఃకాలవిధాయకక్రియలు ని ♦ ర్వర్తించి ధాత్రీమరు
జ్జాతాశీర్వచనంబు గైకొని జగ ♦ త్సంశ్లాఘ్యసమ్యగ్యశ
శ్శ్రీతేజోబలభాసమానుఁడగుచున్ ♦ శ్రీరాఘవుం డంతయున్
జేతఃప్రీతిగ నుండె సంశ్రితజన ♦ శ్రేణీమరుద్భూజమై. 200

క. తక్కినమువ్వురు నటువలె
నక్కజ మగులీలనుండి ♦ రతివలతోడన్
జక్కఁగఁ గ్రీడించుచు మది
నెక్కొనుమోహమున నిచ్చ ♦ నిచ్చలు సుఖులై. 201

గీ. సుతచతుష్టయ మటుల య ♦ ప్రతిమలీలఁ
దేజరిల్లుచు నుండంగ ♦ దినదినము గ
నుంగొనుచుఁ జాల నాత్మ ను ♦ ప్పొంగుచుండ
ఫలితసుమనోరథుం డగు ♦ పఙ్క్తిరథుఁడు. 202

మ. చతురంభోధిసమేతపాశధరునో♦జన్ లోకసంభావ్యుఁ డౌ
చతురంసాంచితశార్ఙ్గపోల్కఁ జతురా♦స్యబ్రహ్మచందంబునన్
జతురాత్మోద్భవసంయుతుం డగుచు హా♦ర్దస్వాంతుఁడై శశ్వదీ
డితభాగ్యోదయవృత్తిఁ బఙ్క్తిరథుఁడుం♦డెన్ ధారణీనాథుఁడై.

శా. ధైర్యౌదార్యసమగ్రశౌర్యశుభసౌం♦దర్యా పయోరాశిగాం
భీర్యా సంతతపాలితార్య దివిజా♦మేయాధికోద్యద్భుజా
వీర్యా సద్గుణధుర్య విశ్రుతజగ♦ద్విభ్రాజితైశ్వర్య శ్రీ
గీర్యోషేశ్వరముఖ్యకీర్తితరథాం♦గీభూతసోమార్యమా!

క. భవ భావజహర భిదురధ
రవినుత భీమ భుజగాభ ♦ రణ భూరథ భే
నవతంస భైరవా భో
గివరశయప్రదర వాణి ♦ కీర్తితనామా. 205

అనంగశాస్త్రమనువృత్తము.

దండితమారా ♦ ధన్యవిచారా
భండనభీమా ♦ పర్వతధామా
పండితరక్షా ♦ పాలితయక్షా
కుండలిభూషా ♦ కుక్కుటవేషా. 206

గద్య:—ఇది శ్రీమత్కుక్కుటేశ్వరానుగ్రహప్రభూతకవిత్వ
వైభవ విశ్వామిత్రగోత్రపవిత్ర వారణాసివంశపారా
వారకైరవమిత్ర విద్వన్నుతచరిత్ర కామయార్య
పుత్ర సుకవిజనవిధేయ వేంకటేశ్వరనామ
ధేయ ప్రణీతంబైన రామచంద్రో
పాఖ్యానం బనుమహాప్ర
బంధంబునందుఁ ద్వితీ
యాశ్వాసము

శ్రీ.

శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీ రామచంద్రోపాఖ్యానము.

## తృతీయాశ్వాసము.

శ్రీసామాగమగీతను
ధాసారజ్ఞాంతరంగ ◆ ధవళాంగ ద్విదం
తాసురమదభంగా చూ
డాసంభృతగంగ కుక్కు ◆ టప్రిభులింగా. 1

వ. అవధరింపు మనంతరకథావిధానంబు. 2

ఉ. కూరిమి మీఱ రాము నిదె ◆ క్షోణికి రాజును జేసెదన్ ముదం
బారఁగ నెల్లి తెల్లముగ ◆ నంచును బఙ్క్తిళతాంగరాజకం
ఠీరవుఁ డొక్కనాఁడు బలు ◆ ఠేవ మాజారమునన్ సుధర్మ బృం
దారకనాథుఁడట్లు సుమ ◆ నస్స్మితుఁడై కొలువుండి పల్కినన్.

క. ఆవార్త జగత్ప్రథితము
గావింపం బౌరు లెల్లఁ ◆ గళ్యాణనిమి
త్తావహావృత్తి మెలంగఁగ
నావేళం గైక చేటి ◆ యగుమంథరయున్. 4

క. తత్కాలకల మరసి వివ

స్వత్కులనాథుఁ డగురామ ♦ చంద్రునకు సమ
గ్రోత్కలికుఁడు దశరథుఁడు స
ముత్కటపట్టాభిషేక ♦ మొనరించునొకో. 5

శా. కాకున్నం బురమెల్ల నీకరణి మాం♦గళ్యాంకముల్ గూర్పనిం
కేకార్యం బిసుమంత యైనఁ గనరా♦దేదంచుఁదర్కించుచుం
గై కేయీసతిఁ జేరి తద్విధ మెఱుం♦గం జేయ నద్దేవి క్షో
ణీకాంతాగమనాభిలాష యగుచుం♦డెం దద్విఘాతాత్మయై. 6

చ. దశరథుఁడట్లుపల్కియును♦తత్ప్రవరుం రఘురాముఁదత్క్రియా
కుశలత నుండు మంచుఁ గడుఁ♦గూరిమిఁ జెప్పి యరుంధతీసతీ
శు శుభవిధుల్ యథావిధిఁ ద్రి♦శుద్ధిగఁ జేయుమటంచుఁ దెల్పి పు
ష్పశరశరార్తి వచ్చెఁ బరి♦షత్స్థలి వెల్వడి కైకయింటికిం. 7

ఉ. వచ్చిననాథుఁ జూచి యని♦వారితకోపముతోడఁ బల్కె సీ
విచ్చటి కేగుదేరఁ బని♦యెయ్యది మచ్చిక నిచ్చకంపు మేల్
ముచ్చట లిచ్చగించికదు♦మోసమునొందితిఁ, జాలునిచ్చలుం
మెచ్చగ వచ్చుఁ జెచ్చెరను♦మేల్గలముద్దియయొద్ద కేగుమీ. 8

క. కుటిలులు పురుషులు వారల
మటుమాయలఁ జెందినట్టి ♦ మగువల బ్రదుకుల్
తటినీనిర్ఝరమధ్య
స్ఫుటనావికముక్తతరణి ♦ పోలికగాదే. 9

క. అనుడు వెఱఁగంది నే నె
గ్గొనరించిన దేది యరయు ♦ మొంటమివారల్

వినఁదగనిముండ్లమాటలు
పెనఁకువ పెనుచుటకుఁజెప్పి • పెట్టిరి నీకుఁ. 10

క. కల్లరులు మెల్లమెల్లనె
పెల్లలికఁ గల్ల లల్లి • పెల్లుగఁ బ్రమదం
బుల్లమునఁ బల్లవింపఁగ
నెల్లప్పుడు చెప్పుచుందు • రేలిక చెలికిఁ. 11

క. అన్యశ్రేయోసహ్యాలు
మన్యుసమేతలు వచించు • మాటలు విని నీ
వన్యాయ మనక యాక్రియ
దైన్యము నొందుట క దెద్ది • తలఁపు తెలుపవే. 12

గీ. అనుడుఁ గేకయరాజన్య • తనయతనయ
భీష్టములు రెండు నతిజగ • త్కష్టములుగఁ
బూర్వదత్తవరద్వయ • పూర్వకముగ
వినిచె నిట్లని యొక్కింత • వెఱపు లేక. 13

క. మునుకొని పదునాలుగు హా
యనములు వనమునకుఁ బనుపు • మగ్రజు; భరతుఁ
వనరాశిమేఖలాధీ
శుని జేయుము సత్యమునఁ ద్రి • శుద్ధిగ నధిపా! 14

సీ. అనుడుఁ బఙ్క్తిశతాంగుఁ • డపుడు వ్యాఘ్రిని గన్న
హరిణమాణవకంబు • కరణి విగత
చేష్టుఁడై ధరణి మూ • ర్ఛిలి యున్ననంత సు

మంత్రుఁ డేతేర న ♦ మ్మగువ యతని
ననిచి రఘుస్వామి ♦ నచటికి రావించి
పతివచోగతిగ దు ♦ ర్మతి వచించె
వని నుండు మీరేడు ♦ వర్షంబు లన్నన
య్యాజ్ఞఁ గైకొని కోస ♦ లాత్మజకును
మ్రొక్కి తదనుజ్ఞ సతియుఁ ద ♦ మ్ముఁడును దోడ
రా ధనుర్ధరుఁ డగుచుఁ బు ♦ రమ్ము వెడలి
వనికి మునివృత్తిఁ జనఁ బౌర ♦ జనము గాంచి
యంత నాబాలగోపాల ♦ మార్తి నొంది. 15

గీ. ఏమొకో యంచు వెన్నాడ ♦ ధృతధనుర్ల
తాశరధులు నితాంతకృ ♦ పాశరధులు
దాశరథులు యశోజితో ♦ కీర్త్తిశరధులు
వనికిఁ జనుచుండ నిట నంత ♦ జనవిభుండు. 16

ఉ. ఇంచుక తెల్వి వచ్చి మది ♦ నెంతయుఁ జింతిలుచున్ సుమంత్రునీ
క్షించి రఘూద్వహుండు వని ♦ కిం జనుచుండె రథంబుఁ గొంచుఁ బొ
మ్మంచుకొనంగఁ గోమలి మ ♦ హీసుత కాననసీమ నేగ లే
దంచు వచింప నాతఁ డుశ ♦ తాంగము వేఁ గొని పోయి యిట్లనున్.

చ. దశరథునాజ్ఞచే నిదె ర ♦ థం బిటకుం గొని వచ్చినాఁడ క
ర్కశవనభూమియాన మతి ♦ కష్టము గాన రథాధిరూఢులై
కుశలత నేగుఁ డన్న సతి ♦ కూరిమితమ్ముఁడు దాను నెక్కి స
ద్యశుఁడు రఘూద్వహుండు ♦ ప్రజ నప్పుడు వెన్కకుఁ బంపి గ్రక్కునన్

వ. రథంబు ద్రోలిమ్మనుచు సుమంత్రునకుం జెప్పి వనంబునకుం జనుచుండె నంత నిచ్చట రామచంద్రుఁడు చనిన పిమ్మట న మ్మన్నె దొరకమ్మవిల్తుండు కౌసల్యాసుమిత్రలకరమ్ము లవలంబ నమ్ముగా నంతఃపురమ్ము వెడలి చొక్కమ్మగుతమ్మిరేకుల హి మకణమ్ములు జాలుచందమ్మున నేత్రమ్ముల బాష్పంబులు జల జలం దొరుగ నుమ్మలించుచు రాజమార్గమ్మునం గొంతదవ్వు చని రఘునందనునిస్యందనమ్మును గూడనేరక గ్రుమ్మరుచు న రుంధతీసతీశ్వరనివారితుండై మఱలి యవరోధప్రదేశమ్ము ప్ర వేశించి మిగులం బొగులుచుఁ దొంటిమునిశాపం బప్పుడు చే కూఱెఁబోలు ననుచు దైవంబు దూఱుచుఁ గటకటా! యను చు మఱియు నిట్లనియె. 19

ఉ. హా యను దివ్యమంగళమ! హా యనుసాంబుపయోదరమ్యదే
హా యను శ్లాఘ్యసద్గుణవ! హా యను నిత్యమనఃకృపాపరో
హా యను దండితారినివ! హా యనుఁ బన్నగరాజదీర్ఘబా
హా యను విక్రమప్రతిగ! హాయనుదైత్యమదాపహాయనున్.

క. సకలజనంబులు నిందిం
చికొనంగా నిట్లు లయ్యెఁ! జేసినపని యిం
తకు స్త్రీబుద్ధిః ప్రళయాం
తక మనువచనార్థ మరయఁ! దప్పునె జగతిన్? 21

సీ. నిరతవర్ణితభవ్య! తరుఁ డంద్రు గావున
నిరతవర్ణితభవ్య! తరుఁడె యయ్యె

సుమనోధిసేవనా ♦ త్సుకుౡండు గావున
సుమనోధిసేవనా ♦ త్సుకుఁ డయ్యె
గోత్రావనవిహార ♦ కుశలుండు గావున
గోత్రావనవిహార ♦ కుశలుఁ డయ్యె
ధరణికన్యేశతఁ ♦ దనరారుఁ గావున
ధరణికన్యేశతఁ ♦ దనరుటయ్యె
నయ్యయో! యయ్యజుండు మా ♦ యయ్య సేయు
న్యాయ మేమయ్యె నయ్యయో ♦ ధ్యాధ్యతాంత
రాయ మయ్యజుఁ డియ్యెడ ♦ వ్రాయు టరయ
దాశరథికి మహానుకం ♦ పాశరధికి. 22

గీ. అనుచు దశరథుఁ డపరిమి ♦ తాపదబ్ధి
మునుఁగుచును దేలుచును బెను ♦ మూర్ఛ నొందు
చును గళవళించుచును దెల్వి ♦ గనుచు లేచు
చును గటకటా యటంచును ♦ వనరుచుండ. 23

గీ. అంత నచ్చట రఘువరుం ♦ డట్టులరిగి
తమస సరయువు మొదలగు ♦ తటిను లెల్ల
దాఁటి వైదేహియును సుమి ♦ త్రాసుతుఁడును
నిపుపురును దోడరా వని ♦ కేగి మోల. 24

గీతాలంబనమనువృత్తము.

సూరాన్వయనాథుఁడు ♦ చూచెను శ్రీ
నారాయణపాదమ్ము ♦ నాళిభవర్ణ

గౌరీశ్వరశీర్షని ♦ కాయ్యచరణ
వారాన్నిధిగేహిని ♦ వర్ణ్యగుణా. 25

గీ. చూచి తన్మహానీయసం ♦ శుద్ధజీవ
నమున కబ్బుర మంది యా ♦ నంద మలరఁ
దటవిటపికూటవాటి నా ♦ క్కట నిషాద
వరు గుహుని గాంచి యాతని ♦ వసతి నిలిచి. 26

గీ. అర్ఘ్యపాద్యాదిసత్కార ♦ మంది యతని
కుశల మరసియుఁ దనరాక ♦ విశదముగను
వినిచి రఘువీరుఁ డజ్జాహ్న ♦ వీతరంగి
ణీముచర్చిక నిటులు వ ♦ ర్ణింపఁదొడఁగె. 27

క. క్ష్వేళము గళమున వహ్ని
జ్వాలిక ఫాలమునఁ దాల్చి ♦ శంకరుఁడు తదా
భీలోష్ణంబున కోర్చుట
వాలెము నీచలువఁగద సరి ♦ వంతీమాన్యా. 28

క. గురుతరపావకరోధ
స్త్రరుకోటరతటకుటీర ♦ సంస్థితఖగముఖ
వర వూవేగొకచో రా
జ్వరమేశుం డగుటకంటె ♦ స్వర్ద్వీపవతీ ! 29

గీ. తుహినమహీభృద్గుహావిహా ♦ రహితహృదయ
చలితరంగత్తరంగసం ♦ కలితగగన
క్షాళితజగజ్జనాఘుజం ♦ బాలపటల

దివ్యశుచికాంతి భాగీర ♦ థీస్రవంతి. 30

సీ. తలిరువిల్టొరకంటు ♦ బలుసామిసికకు మేల్

గొనబారుమల్లెక్రొ ♦ న్ననలసరము

తరిగట్టువీఁపునఁ ♦ దాల్చు వేలుపుపాద

నాళీకమునకు మృ ♦ ణాళవల్లి

మున్నీటిపేరిటి ♦ వన్నెకానికి నిచ్చ

వలపు లీడేర్చుమ ♦ వ్వంపుఁబోలఁతి

రహి మీఱఁ దెలిగంటి ♦ రాణివాసమునకు

నిచ్చలు నీరాడు ♦ నింగికోలను

పుడమిచేడియ కందంబు ♦ వొలుచుపైఁట

కడఁకముత్తియుప్పరిగకు ♦ నిడుపుఁదాప

వగునిను నుతింప నేరికి ♦ నలవి యగునె

ద్వీపినీమాన్య జహ్నుమా ♦ నీంద్రుకన్య. 31

మ. అని భాగీరథి సంస్తుతించి లలితో ♦ ద్యానావనీవాసలీ
లనిషాదాశ్రమ వాటి నిల్చి మది ♦ నాహ్లాదంబు మీఱం దపో
ధనవృత్తిన్ వరవల్కలాజినజటల్ ♦ దాల్చెన్ రఘుస్వామియుం
తనసౌమిత్రిగుహుల్ ధరించిరటులే ♦ తద్వేషముల్ భక్తితోన్.

ఉ. మానవనాథుఁడయ్యెడ సు ♦ మంత్రుని జేరఁగఁజీరి పొమ్మయో
ధ్యానగరావతంసమున ♦ కచ్చటనాతలిదండ్రు లార్తి నెం
తేనియుఁ గుందకుండఁగను ♦ దెల్పుము మత్కుశలం బటన్న న
య్యానతి పూని తేరుగొని ♦ యాతఁడు గ్రమ్మఱ నేగె వీటికిన్.

పంచచామరము.

అహస్కరాన్వయావతంసుఁ ♦ డంత భూమిపుత్త్రియున్
సహోదరుండు తోడ రాఁగ ♦ జహ్నుమౌనికన్యకన్
గుహప్రసుం దరించి యాత్మఁ ♦ గొంకు లేక వేడ్కఁ స
ద్గుహాప్రబోధితాధ్వుఁ డౌచుఁ ♦ గోనలోన నేగుచున్. 34

శా. ఆయావార్ధిగభీరుఁ డంగనకు యా♦నాయాసమున్ బోవ నా
యాయుత్తాలవిశాలసాలతతు లా♦యాకుంజసద్మంబు లా
యాయర్ణఃపరిపూర్ణశైవలిను లా♦యాకేకినృత్యంబు లా
యాయబ్జాకరతీరసైకతము లా♦యాతావులం జూపుచున్.

క. అడుగడుగునఁ దోడిఁబడునె
న్నడఁ దడవి కడిందియెడరు ♦ నాటుకొనియె ని
య్యడవి గడచి పడఁతుక యె
న్నఁడు క్రమ్మఱఁ జెడని సుఖము ♦ నందనియు నోకో. 36

క. అని మనమున నయిన శ్రీమ
మున కెంతయుఁ జింతనొంది ♦ మునుకొని యవనీ
తనయం దనయంతికమున
నెన రొదవగ నడపికొనుచు ♦ నెలఁతుక కనియెన్. 37

మ. ప్రకటించెన్ వివిధాగమాంతవిచర♦త్ప్రజ్ఞావిశేషస్ఫుర
చ్ఛుకముఖ్యద్విజసూక్త భాగవతసు♦శ్లోకప్రయోగార్థచి
త్రకథాఖ్యానము లాలకింపుముభర♦ద్వాజాశ్రమాభ్యర్ణమా
నిఁక నిస్సంశయ మాశ్రమం బగుట ర♦మ్యిం దిందుబింబాననా!

గీ. అనుచు నూఱడఁబల్కుచు • నంతనంతఁ
జనిభరద్వాజు దర్శించి • తనదు చంద
మెఱుక గావించి యాతిథ్య • మిడినఁ గొని త
దాజ్ఞ మఱునాఁడు చిత్రకూ • టాద్రి కరిగి. 39

గీ. ఎలమి నాచిత్రకూట మ • హీధ్ర మెక్కి
యచటితాపసవర్యుల • కచలభక్తి
మీఱ జోహారు లొనరించి • వారిచేత
దీవనలు గాంచి సంతుష్ట • భావమునను. 40

మ. అలరుందత్కుధరంబునందుఁ గలనా • నానోకహంబుల్ నికుం
జలతాకుట్మలపుష్పపల్లవవిలా • సంబుల్ ప్రఫుల్లాంబుజో
త్పలచక్రాంగరథాంగభృంగవిలస • త్పద్మాకరంబుల్ విని
ర్మలమాయూరకలాపచిత్రములు గో • త్రాపుత్రికింజూపుచున్.

గీ. సీతమాతరిశ్వ • పోతవీతాయనా
యాస యగుచు నొకకు • టాంతికమున
విశ్రమించి యుండు • వేళ రఘూద్వహుం
డతివతలఁ బెఱింగి • యనుజుఁ జూచి. 42

క. మునివనితలతోఁ జెలిమిగ
జనకజవిహరించుఁ గాన • సౌమిత్రీ! చ
య్యానఁ బర్ణశాల యొక్కటి
యొనరింపుము వేడ్క నిచట • నుండఁగవలయున్. 43

గీ. అనుచు లక్ష్మణుఁ డవుడు ప్ర • హర్షమునను

వాస్తులక్షణ మరసిపఱి ♦ శస్త్రలగ్న
మెంచి యటఁ బర్ణశాల ని ♦ ర్మించె నంత
నుత్సుకత మీఱ నుండంగ ♦ నొక్కనాఁడు. 44

చ. ఒకపలుగాకి కాకి యమి ♦ తోన్నద మొప్ప ధరాకుమారికం
జికమక నొందఁజేయ రఘు ♦ శేఖరుఁ డారసి దాని కాత్మలో
నకనక నొంది క్రన్ననఁ దృ ♦ ణం బొకటేయ మహాస్త్రమైకరం
బొకపరి బీరువోక సక ♦ లోర్వరఁ ద్రిప్పినఁ గాకి భీరుతన్. 45

గీ. రామ! రామ! నన్ను ♦ రక్షింపు రక్షింపు
మనుచు బీర ముడిగి ♦ యడుగుదోయి
వ్రాల రాఘవుఁడు కృ ♦ పాళుఁడు గావునఁ
బలికెఁ గాకిఁ జూచి ♦ యలుక విడిచి, 46

క. అవితథ మస్మద్విశిఖము
భవదవయ మొక్కటిడిన ♦ బ్రతికెద వనినన్
దివిరి వెర విరవుకొనఁగా
నవినయమున నయన మొం డొ ♦ సంగి మనమునన్. 47

గీ. ఉసుఱసదు గాదు కానఁగ ♦ న్నోపఁగ కున్న
మన్నఁగఁ దరంబె తాఁ జేసి ♦ కొన్న దెన్నఁ
డెన్నఁ బోవునె యమ్మన్న ♦ కన్నెపున్న
మెన్న నన్నువయన్నువ ♦ చిన్న లగునె? 48

క. అని మనమున ననుకొనుచును
జనియెను జిరజీవి జనక ♦ జనపతిసుతయున్

జనువుగఁ దగఁ బెనిమిటితో
వనమున మునివనితనియతి ♦ వలనుగ నుండెన్. 49

ఉ. అంత సుమంత్రుఁ డట్లరిగి ♦ యయ్యెడ నయ్యయో! యయ్య
[యోధ్యకున్
వంతఁ గలంగి పౌరజన ♦ వర్గము చూడ దురంతచింత శు
ద్ధాంతము చేరి తే రుడిగి ♦ దైన్యము దోఁపఁగ లోని కేగి ఘు
్రవాంతవిభాంశుభంగిఁ గన ♦ నయ్యెడు పఙ్క్తిరథావనీధవున్.

సీ. కనుఁగొని తెలచి యో ♦ జననాథ సీతనూ
జాల మహాభుజులధ ♦ న్యుల భవన్ని
దేశంబు గొనిపోయి ♦ త్రిపథగారోధోవ
సతి దించి మఱలి వ ♦ చ్చితిని వార
లాపూఁట మఱుపూఁట ♦ నంతంత నటమటఁ
గుటకూటవాటికా ♦ కటకతటులఁ
గటకటా! యనుచు ను ♦ త్కటచిత్రకూటాద్రి
కెట్టులైనఁ జని జటి ♦ పటలచటుల
వచనరచనల ముదమంది ♦ యచట నొకట
నుటజ మొక్కటి యొనరించి ♦ దిటము గదురఁ
బండ్లు దొం డ్లారగించి తా ♦ పసులపోల్కె
నందు సమయంబు గడుపుచు ♦ నుందు రధిప! 51

గీ. అనుడు నుడుగులు పిడుగులై ♦ తనువుపైని
బడినవడు వైన విపశుఁడై ♦ పుడమిఁబడియెఁ

గొడుకు లడవుల నిడుమల ♦ నడలు నెడల
నొడలు విడువఁడె కడుఁగూర్మి ♦ నడరుతండ్రి. 52

క. అటు లపుడపగతచేష్టత
నెటు నెఱుఁగక యుండి మఱియు ♦ కింతతడవులో
నిటునటు మెదలుచుఁ దెలివిఁ గ
గటకట యనిదైవ మెంత ♦ గావించె నహా! 53

సీ. నట్టన పట్టంబుఁ ♦ గట్టెద నని సభా
స్థలి నూరకయె ముందు ♦ పలుక నేల
పలికిన నేమి పా ♦ పపుఁ గైక పడకింటి
కావేళ దుర్బుద్ధి ♦ నరుగ నేల
యరిగిన నేమి పా ♦ యక తొంటివరములు
కుత్సితంబుగ నేఁడు ♦ కోర నేల
కోరిన నేమి యా ♦ క్రూరోక్తులకు మాఱు
చెప్పనేరక యప్పు ♦ డొప్ప నేల
యయ్యయో! రాముఁ డేమని ♦ యాడునొక్కొ!
జనకసుత యెంత కెద నెంత ♦ వనరునొక్కొ!
యలుక లక్ష్మణుఁ డేమని ♦ తలఁచునొక్కొ!
పడఁతినుడుఁగుల మెలఁగెడు ♦ జడుఁడు చెడఁడె. 54

సీ. నిర్జరాధ్వవ్యాప్త ♦ నిర్జలజీమూత
మటవీపరిపూర్ణచం ♦ ద్రాతపంబు
విమనఃప్రియాంగనా ♦ విమలసౌందర్యంబు

తరళసంశూన్యము ♦ క్తాసరంబు
మహితతిగ్మమయూఖ ♦ రహితకాసారంబు
ఘనవసంతవియోగ ♦ కాననంబు
జనవిహీనాగార ♦ సంస్థితదీపంబు
ఫలరిక్తసముదగ్ర ♦ పాదపంబు
గాదె విశ్వంభరాకన్య ♦ కాప్రియుండు
లేనియీరాజ్యభోగంబు ♦ లెక్కసేయ
నేర! దైవంబు నేఁడెంత ♦ యవిధిఁ దెచ్చెఁ
గట్టికుడుపదె తొలుజన్మ ♦ కర్మఫలము. 55

భుజంగప్రయాతము.

మహో హాస్కరున్ విక్ర ♦ మాక్రాంత వైరిన్
మహోహాఖువాహు న్న ♦ మచ్ఛాత్రవౌఘున్
సహాహార్యతనూజేశు ♦ సౌమిత్రినిం బా
సి హాహా! యశక్యంబు ♦ జీవంబు నిల్పన్. ౫౬

సీ. నెలఱాలమిట్లమే ♦ డలమెలంగెడుకొమ్మ
పడుకురాగట్ల నే ♦ పగిది నడచుఁ
గలికిరాచిల్కప ♦ ల్కుల కులుకుపూబోఁడి
పలుపుల్గులెల్గు లే ♦ భంగి వినును
బ్రమదవనంబునఁ ♦ బగలు వెగ్గిలు బాల
రేలు కారడవి నే ♦ రీతి నుండు
లేఁచిగంతుల కవ ♦ లీల జంకెడు లేమ

వ్యాఘ్రులంఘనము లే ♦ వరుసఁ గాంచు
సఖులతో మాఱునుడువని ♦ చాన లాఁతి
మునిపురంధ్రులతో నెట్లు ♦ ముచ్చటించు
నహహా! కలనైనఁ దహాతహా ♦ లరయునట్టి
జనకసుత కిట్టివెత వెట్టె ♦ వనజభవుఁడు. 57

గీ. అనుచు దశరథుఁ డతివిప ♦ ద్వనధి మునిఁగి
బురబురం బొక్కి మఱిమఱి ♦ పొరలి పొరలి
రామరామా! యటంచు సు ♦ త్రామసఖుఁడు
గాన సురపురి కరిగి లే ♦ ఖత మెలంగె. 58

మ. అటు లాపఙ్క్తిరథావనీశుఁడుతనూ ♦ జార్తిన్ మృతుండైననం
తట గుర్వాజ్ఞ భటుల్ వెసంజనిమహో ♦ దారున్ సశత్రుఘ్ను ను
త్కటశీలున్ భరతున్ గిరివ్రజపుర ♦ స్థాయిన్ గుమారున్ హుటా
హుటిఁదోతేరనతండు ప్రోలుగనివీ ♦ తోత్సాహుఁడై యిట్లనున్.

ఉ. ఏమొకొ వీట నాఁటిసిరి ♦ యిప్పు డొకించుకయైనఁ గానరా
దేమొకొ పణ్యవీథిక ర ♦ హిన్ క్రయవిక్రయరీతి గానరా
దేమొకొ పౌరులెల్ల శుభ ♦ వృత్తి ముదంబున నుంట గానరా
దేమొకొ రాజలక్షణము ♦ లెవ్వియు నెయ్యెడఁ గానరావహో

ఉ. అంచు దురంతచింత వడి ♦ నంతిపురంబున కేగి తల్లి ద
ర్శించి నమస్కరించి నగ ♦ రన్ శుభలీలలు తొంటియట్ల గా
న్పించ విదేమి యంబ! యవ ♦ నీతనయేశున కెగ్గు సేయ నూ
హించితివేమొకో దశర ♦ థేంద్రున కింతకు సేమమే కదా? 61

ఉ. నావుడుఁ గైక యిట్లనియె ♦ నందన ముందు వరద్వయంబుఁ బృ
థ్వీవరుఁ డిచ్చె నేఁ డదియె ♦ వేఁడితి ; నెట్లనినన్ విదేహక
న్యావరుఁ డేను దొమ్మిదియు ♦ హాయనము ల్వని నుంట నీవు స
ర్వావని నేలుకొంట యన ♦ నట్టులె తండ్రియనుజ్ఞఁ గైకొనన్.

క. వనితయుఁ దమ్ముఁడుఁ దోరాఁ
జనియెను రాఘవుఁడు వనికి ♦ జనపతి యంతన్
దనువు విడిచె రాముని బా
సినదుఃఖంబున నటంచుఁ ♦ జెప్పిన నలుకన్. 63

మ. విని మూర్ఛిల్లి యొకింత సేపునకుఁ దె ♦ ల్విన్ లేచి తల్లీ ! యయో !
చెనఁటుల్ చెప్పిన నీకు నో రెటులు వ ♦ చ్చెన్ సర్వలోకేశ్వరుం
డనఘుం డైనమహీసుతారమణు రా ♦ జ్యశ్రీవిఘాతోక్తు లా
డిన దుశ్చిత్తవు భర్తృహంత్రి విఁక సం ♦ దేహింపనే వెంతకున్

క. లోకులు నను నిందింపరె
నీకుఁ గుమారుండ నగుట ♦ నిక్కువముగ గో
త్రీకన్యావరు వనయా
త్రాకృత్రిమబుద్ధి నామ ♦ తం బనిసతమున్. 65

క. శ్రుతులను స్మృతులను వెండియు
నితిహాసముల న్మనీషి ♦ వృద్ధులసంభా
షితములఁ దల్లియ దైవం
బితరం బిఁక లేదటంచు ♦ నెఱిఁగినకతనన్. 66

శా. ని న్నీపట్ల క్షమింపఁగావలసె నిం ♦ తేకాదు సంరక్షితా

పన్నుండై నరఘూద్వహుండు పితృస♦ద్భక్తుం డతం డల్క న
న్నెన్నం గామాతృవిఘాతినంచునిఁక వే♦యేలా? భళీ! చాలునం
చన్నాతిం విడనాడితం(డియొడక♦త్యంతార్తిశత్రుఘ్నుతోన్.

చ. అరిగి గతాసుఁ బఙ్క్తిరథు♦నారసి డగ్గఱి దేవ! వచ్చితిన్
భరతుఁడఁ బల్కవేమి? విను♦పాపపుఁగైకకుఁ బట్టి నన్నదు
శ్చరితమె కాని వేరె కలు♦షంబిఁకఁ గల్గ దెటైనఁ బెద్ద లో
ర్తురుగద! వీఁడెపిన్నకొమ♦రుండుగనుంగొనుమార్యసన్నుతా!

గీ. అని యనేకవిధంబుల♦నడలునట్టి
భరతు నరసి వసిష్ఠుండు♦పలికె నిట్లు
గుందఁ దగునయ్య! వెన దశ♦స్యందనునకుఁ
జరుపవలవదె యనలసం♦స్కారవిధులు. 69

క. అని బోధింపఁ దటాలున
జనకున కతినియతి ననల♦సంస్కారాదుల్
వినయవిధి నడపి గోభూ
ధనముఖదానములు విప్ర♦తతుల కొసంగెన్. 70

క. పదపడి రఘుకులవీరుఁడు
త్రిదశేశసమానభోగి♦దీనునిక్రియ నా
పద నడవులలో నుంచెన్
గద యని కుందంగ గురుఁడు♦గని యిట్లనియెన్. 71

సీ. జగతి యరాజకం♦బగుపట్లఁ బ్రజలందు
సకలకర్మంబులు♦వికల మగును

వర్ణాశ్రమాచార ♦ నిర్ణయంబు చొలంగు
నామయం బమితంబు ♦ గా మెలంగు
జారచోరాళి ని ♦ శ్శంకఁ బ్రవర్తించు
సస్యసంశూన్యమై ♦ క్షమ గడంగు
వేదశాస్త్రంబులు ♦ విడుతు రుర్వీసురుల్
విఫలంబులై యొప్పు ♦ వృక్షతతులు
ధర్మము నశించు నర్థంబు ♦ తఱుఁగు నీతి
బాధలు ఘటిల్లు ననృతంబు ♦ పరిఢవిల్లుఁ
గాన నీవింకఁ బట్టంబుఁ ♦ గట్టుకొమ్ము
భూతలాంకితసముదగ్ర ♦ భుజుఁడ వగుచు. 72

క. నా విని భరతుఁడు గురుతో
నీ విటు లాడంగఁ దగునె ♦ నే నెచట ధరి
త్రీవిభుత యెచట వైదే
హీవరుఁ డుండంగ నిది త ♦ దితరులతరమే. 73

సీ. విశ్వలోకేశుండు ♦ విష్ణుసంకాశుండు
విపులప్రకాశుండు ♦ విదితయశుఁడు
విబుధాద్రిధీరుండు ♦ విషధిగంభీరుండు
విక్రమోదారుండు ♦ విపదగపవి
వినయసంపూర్ణుండు ♦ విశ్రుతవర్ణుండు
విహతప్రకీర్ణుండు ♦ విప్రసేవి
విమలకైరవహేళి ♦ విమలసద్గుణపాళి

విపణాప్తకులవశాలి ♦ విజయశాలి
విపినవీథుల వెతఁ గుందు ♦ విధ మెఱింగి
విభుత దొరకొనె ననుచును ♦ విక్కి విక్కి
విఱ్ఱవీఁగిన వెంబర ♦ విత్తటించు
విబుధు లిట నన్ను నిందఁ గా ♦ వించి నగరె! 74

వ. అదియునుం గాక. 75

గీ. ఉత్త మానెడుబరువు క్రే ♦ పోవ నగునె
సితగరుద్గతి చిరజీవి ♦ చెందఁగలదె
కాన రఘువీరుఁ దెచ్చెదఁ ♦ గాన కరిగి
రానిచోఁ దోన చనియెద ♦ వ్రతము పూని. 76

క. అని పలికి భరతుఁ డప్పుడు
జననీగురువృద్ధబంధు ♦ జనసహితముగాఁ
జనియె మురవైరిఁ గనుటకు
సనిలింపుఁడు మఘవుఁ డరుగు ♦ చందము దోఁపఁగ. 77

సీ. ఆలీల భరతుఁడ ♦ త్యామోదమున సర్వ
రథినీసమేతుఁడై ♦ రభసముగను
సరయూధుని తరించి ♦ జనపదవనగిరుల్
గడచి జహ్నుతనూజ ♦ కడకుఁ జేరి
తత్తటాంచద్గుహు ♦ దాశవంశోద్వహు
గుహు శౌర్యగుహు మహా ♦ గ్రహు హితగతి
భాషించి లబ్ధన ♦ వద్యుఁడై త్రిపథగ

దాఁటి తద్దర్శితా ♦ ధ్వమున నేగి
యలభరద్వాజునాశ్రమ ♦ స్థలిని నిలిచి
తత్కృతాతిథ్యుఁడై యటఁ ♦ దరలి సంత
తాభిరుచిఫలకూటచి ♦ త్రాద్రియైన
చిత్రకూటాద్రి కరిగి యా ♦ సేన నునిచి. 78

క. ఉటజపరిస్థితు వల్కల
పటభాసితు ననుజయుతుఁ ద ♦ పస్వినుతు జటా
పటలాంచితు బుధహితు ను
త్కటధనురిషుకలితు నవని ♦ కన్యాదయితున్. 79

గీ. కాంచి పులకించి ప్రణతిగా ♦ వించి కుశల
మెంచి భూపుత్త్రికి నమస్క ♦ రించి సంత
సించి సౌమిత్త్రిఁ బ్రీతి భా ♦ షించి పఙ్క్తి
రథుఁడు సమయుట వినిపించి ♦ రాము నెదుట. 80

గీ. నిలిచియుండె నంతఁ ♦ బలుమఱు గుందుచు
దశరథేంద్ర చనితె ♦ దైవలోక
మున కటంచుఁ గరము ♦ మూర్ఛిల్లి లేచి సౌ
మిత్త్రియును ధరిత్రి ♦ పుత్త్రికయును. 81

క. కుందఁగ నోదార్చి దశ
స్యందనునకు శ్రుతిహితక్రి ♦ యలు నడపియు భ
క్తిం దనతల్లులకుఁ దెలచి
బందుగులం గౌరవించి ♦ పరమప్రీతిన్. 82

సీ. కుశలంబు దెలియుచుఁ ♦ గూర్చుండియున్నంత
భరతుఁ డంజలిఁ జేసి ♦ పలికె నవని
నేలనేరము ! కాన ♦ యేల? నేరముఁ గాచి
మాపై నలుకమాని ♦ మహిమ వెలయు
రఘువర ! రాజ్యభా ♦ రము పూని రాష్ట్రము
రక్షింపుమనుచుఁ బ్రా ♦ ర్థన యొనర్ప
బజ్జిత్రి రఘుననుజ్ఞఁ ♦ బదునాల్గువర్షముల్
వనినుండి క్రమ్మఱ ♦ వచ్చి యపుడ
పట్టభద్రుఁడ నయ్యెద ♦ భరత ! ధర్మ
వృత్తి నందాఁక నీవు భ ♦ రింపు మనుచు
రామ ! మిముఁ బాసి నిముసమా ♦ త్రంబు బ్రదుక
నగునె యనఁ బాదుక లొసంగి ♦ యాదరించి. 83

గీ. పనిచినఁ జమూసమేతుఁడై ♦ భక్తిఁ బాదు
కలు ప్రతిష్ఠించి భరతుఁడు ♦ కదలి వచ్చి
ఘను భరద్వాజు దర్శించి ♦ గంగ దాఁటి
గుహుని వీడ్కొని యేతెంచి ♦ సహితవృత్తిఁ. 84

శా. నందిగ్రామమునందు నిల్చి ప్రజకా♦నందంబు సంధిల్లఁగా
విందుల్ ముందగువారలెల్ల సుఖులై♦ వేమారు గీర్తింప స్వ
చ్ఛంద ప్రక్రియ రామరాజ్యము గభూ♦చక్రంబుఁ బాలించెఁ జెం
పొంద న్స్వామి సుతాధిపాగమదిదృ♦క్షోత్సాహచేతస్కుఁడై.

సీ. అంత నాచిత్రకూ♦టాద్రి నై దేహీవ

ధూగృహమేధివే♦ధోవిదగ్ర్యు
లగుతపోనిధులస్నే♦హము మీఱ భాషించి
దండకాటవి కేగఁ♦దలఁచి కదలి
దారానుజన్ములు♦దారానుమోదులై
తో రా నొకించుక♦దూర మరిగి
ప్రతిపాదపానాత♦పద్వీపినీతటీ
వాటి నంతంత న♦ధ్వశ్రమమున
విశ్రమించుచుఁ జనిచని♦విశ్రుతసతి
యైనయనసూయ దర్శించి♦యవనితనయ
కామె యొసఁగినసత్కృతు♦లంది యవల
నొకట నవ్వని నుండంగ♦నుత్సహించి. 86

క. ఇంచుక దవ్వేగఁగ న
క్తంచరుఁ డాభీలశూల♦ధరుఁడు విరాధుం
డెంచికొనినగతి నెదురే
తెంచి ధరాపుత్త్రిఁ గొని ధృ♦తిం దివి కెగసెన్. 87

చ. ఎగసిన నంత రాముఁ డెద♦నెంతయుఁ జింతిలి వీని నిప్పుడే
పగిది జయింతు నింతి నెటు♦భద్రముగాఁగయికొందునంచునుం
డఁగ నట సీత తోయదప♦దస్థవిరాధకరప్రబద్ధయై
పొగలుచునుండె జోడువిడి♦పొక్కెడుజక్కవ వెంటిచాడ్పునన్

గీ. అంత దశరథాధి♦పాపత్యవర్యుండు
కాంచనాంగి సీతఁ ♦ గాంచి పలికె

బెగడఁదగదు వేగఁ ♦ బొగడఁగఁ బ్రాధులు
నసురహితు నొనర్తు ♦ నసురహితుని. 89

క. అని కోపంబునఁ జాపం
బునఁ దూఁపులు దొడిగి వైవ ♦ భూమితనూజన్
దనుజుఁడు డించి తటాలున
మనుకులవరుతోడ ననికి ♦ మార్కొని కినుకన్. 90

ఉ. శూలము వైవ రాఘవుఁడు ♦ శూరత భల్లముతో మరల్ప నా
భీలతరంబుగా నసుర ♦ పెల్లున రాముని నూర్మిళావిభున్
వైళమ పట్టి మూఁపుల న♦వారితశక్తి భరింప వారలా
వేళ భుజద్వయంబుఁ దెగ ♦ వ్రేసిరి రాఘవుఁ డంతలోపలన్.

క. క్రోధము మీఱ వధించె ధ
నాధిపశాపాప్తబాధు ♦ నయసనిరోధున్
సాధుజనతాపరాధున్
యోధున్ జర్జితమునీంద్ర ♦ యూథువిరాధున్. 92

గీ. అటులు రక్కసుఁ బరిమార్చి ♦ యంతనచటఁ
గాఁక మించుల వేల్పువం ♦ గడపుజేఁడు
పంటపైదలిగారాపుఁ ♦ బట్టియు నను
జన్ముఁడును దోడఁ జనుదేరఁ ♦ జనఁగ నొకట. 93

సీ. గోవబుమీఱెడునార ♦ కుబుసంబు మొలఁ జుట్టి
సరిమించుతోవరుడాల్ ♦ జడలు ముడిచి
యొఱపుగా నొసలిపై ♦ నూర్ధ్వపుండ్రము దిద్ది

తెలిబూది నెమ్మేనఁ ♦ గలయ నలఁది
వరయోగదండంబు ♦ వలకేలఁ గైకొని
తొలికొమ్ము ప్రక్కఁ జె ♦ న్నలరుసీటి
పనఁటి డాఁకైఁ బట్టి ♦ పవడంపుజిగి వ్రేళ్ల
ఘనకుశోర్మికలు చొ ♦ క్కముగ నిలిపి
మహితసచ్ఛాత్రసాపత్య ♦ మానవేద
శాస్త్రపుణ్యేతిహాసని ♦ స్వనము లొలయ
నెదురుగా వచ్చె నెమ్మది ♦ ముదము గదుర
వినయచతురుండు శరభంగ ♦ మునివరుండు. 94

గీ. వచ్చి సద్భక్తి రఘుకుల ♦ స్వామి కర్ఘ్య
పాద్యమధుపర్కముఖ్యస ♦ పర్య లిచ్చి
వినయగతిఁ బెక్కుభంగుల ♦ వినుతిఁ జేసి
చనియె శరభంగుఁ డబ్జజ ♦ సదనమునకు. 95

క. తదనంతరంబ యచ్చోఁ
గదలిమహీసుతకుదండ ♦ కవనస్థలిస
మ్మదలీలఁ దెరవు గడుపుచు
నెదయెదఁ బొడవంగ నీక ♦ యేగఁగ నొకటన్. 96

క. తీక్ష్ణాంశువంశమౌళి సు
తీక్ష్ణమహామౌనిఁ గని ను ♦ తించి యభీక్ష్ణా
భీక్ష్ణనమస్కృతు లిడి య
శ్లక్ష్ణామోదమున నుండె ♦ సంయమి సరసన్. 97

గీ. అంత మఱునాఁడు కొంత ద ♦ వ్వరిగి యరిగి
పనఁటిపుట్టువు తమ్ముని ♦ భక్తి నరసి
యతనియానతిఁ గైకొని ♦ యంతనంత
మెల్లమెల్లనె చనఁజన ♦ నుల్ల మలర. 98

సీ. ఆగ్రహానుగ్రహ ♦ వ్యాపారనిశ్శేష
పీతోర్మిళితాపగా ♦ ప్రియవరుండు
వైభేయవింధ్యప ♦ ర్వతజగద్భయపూర్వ
కాఖర్వగర్వాసం ♦ హారకుండు
సకలమహర్షిహీం ♦ సాతత్పరస్వాంత
వాతాపిశలభవై ♦ శ్వానరుండు
ప్రతిదినకృతయాగ ♦ భాగసంతర్పిత
హరిహయప్రముఖసు ♦ ధాశనుండు
ఘనతపశ్శంబఖండిత ♦ కలుషశిఖరి
భువనసంశ్లాఘ్యనిర్మల ♦ పుణ్యరాశి
సంయమీశ్వరవర్ణిత ♦ సద్గుణాళి
కలితసుశ్లోకవిభవుండు ♦ ఘటభవుండు. 99

ఉ. చెచ్చర శిష్యుచేత రఘు♦శేఖరురాక యెఱింగి వేగఁ దో
తెచ్చి సపర్య లిచ్చి విను♦తించి కృతార్థుఁడ నైతి నంచు లో
నొచ్చెము లేనిభక్తి విన♦యోక్తుల నాదరణం బొనర్చి ని
ప్పచ్చరపుణ్ మనుష్యునకు♦భాగ్యము గల్గినయట్టులుబ్బుచుణ్.

శా. పంకేజాసనపాకశాసనసుధా♦భక్షాదు లెల్లణ్ నిరా

తంకస్ఫూర్జితచిత్తులై సతతముఁ ♦ దర్శించి యుష్మత్ప్రభా
వాంకాజ్ఞానతఁ గుందుచుండఁగను రా ♦ మా! మాదృశుల్ గాంచు టె
ట్లింకన్ వేయును నేల కంటి నిఁక మి ♦ మ్మేఁ గోరి ముక్తుండనై.

మ. నృపచూడామణు లైనమీ రిటు మహా ♦ ర్షిత్వంబునన్ వచ్చుటన్
గృపకున్ బాత్రుఁడ నైతి నీప్సితము లీ ♦ డేరెన్ జపం బొప్పెఁ బా
పపయోరాశి తరించితిన్ జననముల్ ♦ ప్రఖ్యాతి నొందెం బురా
తప మెల్లన్ ఫలియించె నేమికొదవే ♦ ధన్యుండ నై యుంటకున్.

చ. అనవుడు రాఘవుండు విన ♦ యమ్మున నమ్మునిఁ జూచి యోతపో
ధనవర ! లాఁతివాఁడనఁటె ! ♦ తావకకింకరకోటిలోన నే
నును నొకరుండఁగా భవద ♦ నుగ్రహ మెట్లుగ నున్న నట్లయొ
ప్పను దగ సర్వముం ద్రిదశ ♦ పూజిత! మాటలు వేయు నేటికిన్.

ఉ. బాలిశు లైనమానవు ల ♦ పస్మృతులై చరియించుచుం దప
శ్శాలులచిత్తవృత్తి గనఁ ♦ జాలక మోసము నొందు టెంత వా
ణీలలనేశ్వరాదులు గ ♦ ణింపఁగ నేరక మొక్కపోయి రే
వేళలఁ గానఁ దాపసుల ♦ విస్మృతి లేక భజింపఁగాఁ దగున్.

చ. తపమునఁ బొందరాని సుకృ ♦ తంబు జగంబునఁ గల్గ నేర్చునే
తపమున గాధిసూతి విబు ♦ ధస్తుతుఁడై ద్విజుఁ డయ్యెఁ బోయయుం
దపమున నాకుజుం డగుట ♦ తథ్యము గాదె తలంప వెండియున్
దపసు లనేకు లుత్తములు ♦ ధన్యులు గల్గుదు రెంచి చూచినన్.

సీ. కూళముప్వేటిసోఁ ♦ కుఱులఁ ద్రుంచినమేటి
కరుదారఁ దరకసం ♦ బయ్యె నెద్ది

గొనబుమీఱెడుపైఁడి ♦ కుబుస మానెడుసామి
కందంపుమేల్వాను ♦ పయ్యె నెద్ది
యుగముగుబ్బలిపట్టి ♦ యెదఁ బొఱి డాఁగని
మ్రుగువజ్రపంజర ♦ మయ్యె నెద్ది
యెల్లజగంబుల ♦ నేప్రొద్దు గాపాడ
నెంతయు జీవనం ♦ బిచ్చు నెద్ది
యట్టినారాశిఁ బుడిసిటఁ ♦ బట్టి యొక్క
తేప నాపోశనము గ్రోలి ♦ తిరుగఁ దొంటి
యట్ల నిండించినట్టిమ ♦ హాత్ము నిన్ను
నలవియె నుతింప నార్యమ ♦ హర్షివర్య! 106

క. కలశీసంభవ తాపస
కులతిలక నితాంతధైర్య ♦ గురుతరకీర్తి
కులిశధరస్తుత నీతోఁ
దుల యగుసంయములు గలరె ♦ దురితవిదూరా. 107

గీ. అని యనేకవిధంబుల ♦ నధికభక్తి
నిగమపగరాకోలంపుఱేఁ ♦ డిట్లు పొగడఁ
బనఁటిపుట్టువు తపసినె ♦ మ్మనమునందుఁ
బొడముకనికర మిగురొత్త ♦ నుడివె నపుడు. 108

గీ. తఱుఁగనిలకోరు లలరెడు ♦ తరకసంబు
గవయు మహనీయవైష్ణవ ♦ కార్ముకంబు
వీరరిపుదుర్జయాయుధ ♦ విసరములును

గాను మొసంగెద రాఘవ! ◆ మనుకులేంద్ర! 109

మ. అని బోధించి సమంత్రకంబుగఁ బయో◆జాప్తాన్వయస్వామికిం
పెనయం గుంభజుఁ డిచ్చి పంచవటి మీ◆కెంతే వసింపంగ ని
మ్మని పంపన్ ముదమందిసీతయుసుమి◆త్రాపత్యముందోడరా
మనువంశ్యుం డరుదెంచెఁ బంచవటికిన్◆మౌనీంద్రులగ్గింపఁగన్.

క. అటుల యరుదెంచి లక్ష్మణుఁ
డుటజం బొక్కటి ఘటించె ◆ నొక్కటను విశం
కటఫలదళకుసుమపరి
స్ఫుటకుటపంచవటి రామ ◆ భూవరునాజ్ఞన్. 111

క. హేమంత మంతనంతట
సామంత మెలర్ప మెఱసి ◆ జగతీస్థలిలో
హ్రీమంతుల ధీమంతుల
శ్రీమంతుల సారె కొక్క ◆ క్రియ వణఁకించెన్. 112

చ. పగ లసదయ్యె రేయి దలఁ◆పన్ నిడుపైతవరెన్ జగంబునం
దిగముకరళ్లు జొంపముగ◆నెల్లెడ నిండె వణంకుజంకుచేఁ
దొగపగసామి యుత్తరపుఁ◆ద్రోవనుద్రిమ్మరఁ జాలఁడయ్యెసాం
పగుచు నెసంగె నీఁదుచెలి◆ప్రాణుల కబ్బలితంపుసీతునన్.

సీ. కమనీయపరిమళ ◆ త్కాలాగరూద్భూత
ధూమప్రసారణా ◆ త్సుకృతకరము
వరకశోదరమనో ◆ హరలోమనిచయకా
రితకంబళపిధాన ◆ హితకరంబు

సీరంధ్రయవనికా ♦ నికరావృతాభ్యంత
రమహీవిహారని ♦ ర్వ్యాజకరము
ప్రహతధూమాంగార ♦ సహితహసంతికా
యంత్రసంసేవనా ♦ హ్లాదకరము
నగుచు మగువలు మగలును ♦ బగలు లేక
ఋతు వెఱఁగి వేట్క మిగులఁగ ♦ రతులఁ దేలి
జగతి నగునగు ననుచును ♦ బొగడ నెగడె
సరసహేమంతసమయవా ♦ సరము కరము. 114

సీ. అనయంబు నగజాత ♦ నెనరొప్ప సామేన
నిడుకొనఁగారణం ♦ బిదియె శూలి
క్రిచ్చ నిచ్చలు లచ్చి ♦ మచ్చిక నెదమీఁదఁ
గదియించుకొనమూల ♦ మిదియె చక్రి
మొగమాట మెఱుఁగక ♦ మొగమునఁ దనరాణి
నెనయించుకొనహేతు ♦ విదియె ధాత
ఛాయఁ బాయఁగనీక ♦ జాయ నేయెడఁ జాయ
నెనఁగించుకొనఁగార్య ♦ మిదియె తరణి
రమ్యకార్పాసరచితకూ ♦ ర్పాసశతము
వలనఁగాంతాస్తనాశ్లేష ♦ కలన లేమి
నేమిచలి దీఱునే యని ♦ భూమిజనులు
పలికి రతిశీతభీతిన ♦ ప్పట్టునందు. 115

చ. ఘనహిమవారిసేకమును♦గంధవిలేపనముం జొకారపు

స్మనలసకుల్ సహింపఁ జెద♦నర్మిలి లేదు కుబేరదిక్ప్రభం
జనుఁడు ఖలుండు వచ్చె నివి♦సాగఁగనీఁ డని మాని మానినీ
స్తనగిరిసీమఁ జెందెఁబురు♦షప్రకరం బెదలో వణంకుచున్.
క. చలి నిటులు సకలజనములు
నలపున దినదినము జరుప ♦ నంతటను సుశీ
తలశిశిరాగమ మయ్యెను
ములు దొలఁగినఁ గొట్టుబిగ్గ ♦ మొత్తెడుకరణిన్. 117
సీ. ఫాలభాగంబునఁ ♦ బ్రాలేయకరహారి
శీతభీతివహించె ♦ వీతిహోత్రుఁ
బార్శ్వస్థుఁ గావించె ♦ బలభేది సతతంబు
చలిమిరిభయమున ♦ శ్వసనసఖుని
గర్భదేశమునందుఁ ♦ గల్లోలినీశుండు
చలి కుల్కఁ బడబాగ్ని ♦ నిలుపుకొనియె
సాయంప్రభాతావ ♦ సరములఁ జలిదీఁటఁ
బ్రజ్వరిల్లఁగఁ జేయు ♦ యజ్వ జ్వాలను
వారె యిటు లుండిరిం కేది ♦ వల నటంచుఁ
బ్రహతధూమాంచదంగార ♦ సహితపృథుహ
సంతికాయంత్రసేవనా ♦ సక్తచిత్తు
లైరి ప్రజ లెల్ల నాశిశి ♦ రాగమమున. 118
క. శిశిరర్తు విట్లు లటక
ర్కశమై జనములకుఁ దోఁచి ♦ కాలము గడపన్

బ్రశమితశీతం బగుచును
విశద మగువసంతవేళ ♦ వెస నరుదెంచెన్. 119

ఉ. వాసరవల్లభుండు సని♦వార్యగతిన్ సమయంబు దాఁటి వి
శ్వాసము మాని రిక్థపది♦శాగమనోన్ముఖుఁ డయ్యె నంచు లో
గాసిలి దక్షిణాశ వలి♦గాడ్పుల నాస్యముచే వ్యళీకని
శ్వాసముభంగి వీడిచె వ♦సంతసమాగమవేళ నారయన్. 120

గీ. వనరమకు మాధవుండు స ♦ త్వరతఁ దీర్చి
నట్టిపత్త్రవిశేషము ♦ లట్టిశురవ
కములు మధుదానచాతురీ ♦ కలనమధుక
రములకు నితాంతనినదకా ♦ రణము లయ్యె. 121

క. తెఱవలకును భయమొదవఁగ
మొఱయుచుఁ జరియించెఁ ♦ దేఁటిమొత్తము వని నే
ర్తెఱ మాధవుఁ డేతేరఁగఁ
బఱచి బరాబరు లొనర్చు ♦ భటతతి యనఁగన్. 122

క. కోకిలకులకాకలికా
వ్యాకీర్ణం బగుచు మాధ ♦ వాధీశపురః
ప్రాకటశుభకాహలికా
స్తోకారావమువలె వని ♦ చొప్పడి యొప్పెన్. 123

క. ఘుస్రిము లధికము లయ్యెఁ ద
మిస్ర లలఁతు లయ్యెఁగడు శ ♦ మించెఁ జలి ప్రవం
తీస్రోతోవేగ మణఁగె

నుస్రవదంశువులు సమధి ♦ కోష్ణము లయ్యెన్. 124

సీ. ఘుస్రావసాననిర్గతగంధ ♦ గిరిగంధ
వాహనృత్యాలోక ♦ వాంఛితంబు
కాంతకుపాకాంత ♦ కాంతాశ్మకుట్టిమ
సంచారసమధికో ♦ త్సాహకంబు
తతదివ్యవాసనో ♦ ద్భాసితచందన
శాదానులేపన ♦ సంభ్రమంబు
పరిఫుల్లశతపత్ర ♦ పంకజాకరముహు
ర్ముహురంబు విహరణా ♦ మోదగరిమ
శీతలతుషారనీరాభి ♦ షేకరక్తి
హిమకరాతపసేవనా ♦ భీప్సితంబు
గలుగఁజేయుచు ధారణీ ♦ స్థలి జనంబు
లభినుతింప వసంతర్తు ♦ వలరుచుండె. 125

ఉ. అట్టివసంతకాలమున ♦ నబ్బురపాటుగ నొక్కనాఁడు లోఁ
బుట్టెడుమోహ మేర్పడఁగ ♦ భ్రూయుగలీల దలిర్పఁ జూచుచు
న్నెట్టనరాముకట్టెదుర ♦ నిల్చి యొకానొకదైత్యకాంత పె
న్పిట్టడి గాఁగ శూర్పణఖ ♦ రావణుసోదరి పల్కెఁ గుల్కుచున్

శా. ము న్నే నెన్నఁడెఱుంగనిట్టిశుభల ♦ క్ష్మున్ రాసుతుంగావునన్
నిన్నుం గోరి వరింప వచ్చితి మదిన్ ; నీ వెవ్వరం టేని య
స్మన్నామాన్వయ మేర్పడన్ వినిచెదన్ ♦ సర్వాభియాత్యబ్జదృ
ష్యన్నాగేంద్రమవింటిశూర్పణఖనాఁ ♦ ఖ్యన్ యాతువంశోద్భవన్

శా. స్వారాజ్యాధిపుఁడై సమస్తవిబుధ♦త్సంపూజ్యుఁడై వజ్రియై
వీరశ్రేష్ఠుల జంభుఁ బాకు నముచిన్వృత్రున్ బులోమున్ భుజా
సారం బొప్పఁగ నాజిఁ గూల్చినమరు♦త్స్వామిన్ దిశానాథులం
బోరం గెల్చినపఙ్క్తివక్త్రునను జన్♦భోగైకపారాయణున్.

సీ. ఒకవేళ వ్యాళబా♦లికలచందము నొంది
లీలతోఁ గేళిదే♦లించనేర్తు
నొకపట్టున మనుష్య♦యోషాకృతి వహించి
ప్రీతిగా రతులమె♦ప్పించనేర్తు
నొకతఱి నప్సర♦యువతులగోన బూని
సురతచమత్కృతిఁ♦జూపనేర్తు
నొకసారె దనుజభృం♦గకచలచెలువంబు
మించి మాయలను గ్రీ♦డించనేర్తు
నెటులుకోరినఁ దావకా♦భీష్టమటులు
సలుపనేర్తుఁ దరీవనీ♦శైలవిహర
ణములు నొకపరిఁ గామయా♦నమునఁ దీర్ప
నేర్తు నింకేమికొఱఁత వ♦ర్ణించుకొనుము. 129

మ. అనినన్ నవ్వి పరాంగనావిముఖుఁడై♦నబ్జాప్తవంశ్యుండు దా
ని నిరీక్షించి పడంగునాతివిగదే♦నీవెంచుకొన్నన్ సహాం
గను నన్నున్ వరియించు టేమిసుఖమా♦గాంతా!లతాంతా
[యుధుం
డననొక్కండు చరించు లక్ష్మణుని సౌ♦ఖ్యంబొందుఁగాంక్షించినన్.

క. నావుడు సోఁకుడుపడఁతుక
భావించి సుమిత్రపట్టి • పజ్జకుఁ జనియో
స్త్రీవిషమాంబక నాకు మ
నోవిభుఁడవు గ మ్మటంచు • నొడివిన నగుచున్. 131

క. పరవన్నరు వరియించిన
తరుణి వరువు డగుట నిజము • తలఁచుకొనిన నా
పురుషోత్తము వరియించిన
పరవర్ణిని లక్ష్మి గాదె • వనితా యనినన్. 132

క. ఆమాటకు మాఱాడక
కామాతుర గాన మఱలి • గ్రక్కునఁ జని యా
రామాంకపాళిఁ గొనియెద
నీమాటేమైన విడుతు • నేనే నతనిన్. 133

శా. అంచున్ వచ్చి తటాలునం గదియునా • హా! చూచి తేదీని బా
ధించం గావలె నంచుఁ దమ్మునికి ని • ర్దేశించినన్ దోన యా
చంచద్విక్రముఁ డగ్రజాజ్ఞఁ గొని నా • సాకర్ణముం బట్టి ఖం
డించెన్ ముక్కిఁడినాతియంచునిలఁ బా • టించంగ నెల్లప్పుడున్

గీ. ముక్కుఱ యొనరింప • ముక్కర యొనరింప
వలను దప్పెఁ గలికి • వలను దప్పె
శ్రుతివిరుద్ధ మైన • శ్రుతివిరుద్ధ మైన
కమ్మవలెనె యింకెఁ • గమ్మవలెనె. 135

క. నానాసామజగమనల

లో నాసాశ్రోత్రములవి • లోపము వచ్చెన్
నేనాసారసబంధుకు
లీనా సాధుత్వ మింత • యెఱుఁగనికతనన్. 136

క. అని మదిఁ దన వైరూప్యం
బున కెంతయుఁ బొగలుచున్ న•భోవీధి వెసం
జని ముగ్గాలియనుఁగులో
యనఁగ జనస్థానవాసు • లగు బల్లిదులన్. 137

క. ఖరదూషణత్రిశీర్షుల
ఖరదీధితిసుప్రతాప • కలితులఁ గని మా
ఖరి మెఱయ నొడివెఁ దనవై
ఖరియును రఘుశేఖరులప్ర • కారము నలుకన్. 138

క. నుడువ ఖరుఁ డుగ్రుఁడై యో
పడఁతుక విడువు మిఁకఁ గిన్క • ప్రతిన యొనర్తున్
జడులై నిను నెత వెట్టిన
చెడుగుల మడిపెద రణోర్విఁ • జిరయశ మొప్పన్. 139

చ. అని పదునాల్గువేలమను•జాశనవీరులు గొల్వ దూషణుం
డును ద్రిశిరుండునుం గెడలఁ•దోఁ జనుదేర ఖరుండువచ్చి తెం
పున వనవహ్నిపైమిడుత•మొత్తముదార్కొనురీతిఁదాఁకినన్
గనుఁగొని రాఘవుండు భుజ•గర్వ మఖర్వముగాఁగనుద్ధతిన్.

క. ముదితం దమ్ముని నొకచోఁ
బదిలముగా నునిచి తాను • ప్రధనంబునకున్

బెదరక చెదరక పదరక
నుదరక భిదురకరసదృశుఁ ♦ డుగ్రత వెడలెన్. 141

ఉ. అయ్యెడ నయ్యమర్త్యవిమ ♦ తాగ్రిణి సైనికు లెల్లఁ బెల్లుగా
నయ్యినవంశ్యమీఁద వివి ♦ ధాయుధవర్ష మఖండభంగిగా
నయ్యమరేశునానతి న ♦ హార్యముపై జలదాళి పెంపుతో
నెయ్యెడ వర్షధార లెన ♦ యించువిధంబున నించి రంతటన్.

క. తారకదారక మైనకు
మారకరాళాసిభంగి ♦ మనుకులుఁ డాజిన్
వారక గోరిక నూరక
సారెకు నతినిశితవిశిఖ ♦ సమితి నిగుడ్చెన్. 143

సీ. బలితంపుగాఱు ♦ బారులమీఁదఁ గొఱకొఱఁ
గుప్పించుసింగంబు ♦ కొదమపోలెఁ
దివురొప్పఁ దొట్టుకూ ♦ టువులఁ దార్కొని కోర్కెఁ
మెసవెడు చాఱల ♦ మెకముపోలెఁ
దొలఁగక తుంగము ♦ స్తలఁ జూచిధారుణీ
స్థలి గ్రుద్దలించెడు ♦ దంష్ట్రిపోలెఁ
గినుకతోఁ దగరుల ♦ గని వాని నంజుడు
పెకలించుకొనియెడు ♦ వృకముపోలెఁ
నసుఁ డొకరుఁ డిట్టు లీపదు ♦ నాల్గువేల
బల్లిదపుసోఁకుమూఁకల ♦ పైకిఁ గవిసె
ననుచు వెఱగంది ఖరనిర్జ ♦ రారిసైని

కపివరు లెల్ల పంచబం ♦ గాళమైరి. 144

గీ. అటుకలనఁ బంచబంగాళ ♦ మైనసేన
తోన మరలించి ఖరుఁ డేఁచి ♦ తూఁపు వేయ
ద్యుమణికులుఁడు ముహూర్త్తచ ♦ తుష్టయంబు
ఘోరనారాచనిచయంబు ♦ గురియునపుడు. 145

సీ. వరుస విశ్వంబు సం ♦ వర్తంబు సేయఁ గా
మారి యిమ్మానవుఁ ♦ డయ్యెనొక్కొ
కనలి ముగ్గాలిసం ♦ గాతు లొంద జగం
బేర్చునిన్నరజన్మ ♦ మెత్తెనొక్కొ
పనిఁ బూని దంతబా ♦ బాజోదు ప్రాణుల
నడఁగించ మానిసి ♦ యయ్యెనొక్కొ
చెలఁగి రేద్రిమ్మరీఁ ♦ డుల నెల్లఁ బొలియింపఁ
జుట్టువాల్ఱేఁ డిట్లు ♦ పుట్టెనొక్కొ
కాకయుండిన లోకభీ ♦ కరనిశాట
వీరదోర్విక్రమమునకు ♦ వెఱఁగుపడక
యెదిరి కదనంబు సేయంగఁ ♦ గదియఁదొడఁగె
నితఁడు కేవలమర్త్యుఁడే ♦ యెంచిచూడ. 146

గీ. అనుచు భీతిలి యొకకొంత ♦ యని యొనర్చి
రాఘవామోఘచాపధా ♦ రాధరోద్భ
వాశుగాభీలజలధార ♦ నాఖరాసు
రారిసేనాదవాగ్ని చ ♦ ల్లారె నంత. 147

క. దూషణుఁ డజస్రసుబుధజన
దూషణుఁ డని సేయఁ దొడఁగి ♦ తోడనె త్రిజగ
ద్భీషణబాహువమౌర్వీ
ఘోషణమున గుండె పగులఁ ♦ గూలెం బుడమిన్. 148

క. త్రిశిరుఁడు సశరశరాసుఁడు
పశుపతిదత్తాస్త్రచయుఁడు ♦ పటుభుజశక్తిన్
దశరథసుతు మార్కొనియెను
మశక మిభేంద్రంబుతోడ ♦ మార్కొనుకరణిన్. 149

గీ. అటులు మార్కొన్న త్రిశిరోసు ♦ రాంశుమత్ఫ
లావనీజాత మతివిక్ర ♦ మాభిరామ
రామభూమీశభీమాస్త్ర ♦ సామజేంద్ర
శరసముత్ఖాతమైన స ♦ బ్బురమునంది. 150

క. ఖరుఁ డుగ్రదృష్టి రఘుశే
ఖరుఁ గని యబలల నిరర్థ ♦ కము గారింపన్
బురుషత్వము నీకయమో
ఖరకరకులుఁడ నన సిగ్గు ♦ గాదె తలంపన్. 151

క. ఇష్టము దండాదండియొ
ముష్టీముష్టియొ కడంక ♦ మును పటు గుకుసం
దిష్టంబు తలాతలియొం
స్పష్టము కోదండకళయొ ♦ సరగున దానన్. 152

ఉ. రమ్ము దురమ్ము నీమది క ♦ రమ్ముఁ దిర మ్మగునేని కాని వే

రమ్ము భరమ్ము సుమ్ము పఱిద ♦ రమ్మును విల్లును బెట్టి నాదునే
రమ్ము దెమింపుమంచునుగ ♦ రమ్ములు మోడ్పుము కాక యున్నఁ బ్రా
ణమ్ములు గొందు నమ్ముము మ ♦ నమ్మున నాకపుఁ డడ్డువచ్చినన్.

మ. అని బాహాబలగర్వపూర్వముగ వీ ♦ రాలాపముల్ వల్కి గొ
బ్బున సీతాపతిపై ఖరుండు శరము ♦ ల్బూరింపఁ జేరల్క సం
తనె రామాధిక కార్ముకారణిజను ♦ ర్నారాచ ఘోరప్రభం
జనమిత్రుం డదహించెఁ గ్రూరతరర ♦ క్షశ్శాఖి నత్యుగ్రతన్.

మ. తఱి వర్షించెఁ బ్రసూనవృష్టి రణగో ♦ త్రన్ దేవతాదుందుభుల్
మొఱసెన్ గిన్నరగాననాదమెసఁగెన్ ♦ మోదంబుతో నచ్చరల్
నెఱి నృత్యం బొనరించి రధ్వరభుజుల్ ♦ నిత్యోత్సవశ్రీల నే
డ్తైలనుప్పొంగుచునుండి రవ్వనిమునుల్ ♦ దీవించిరుత్సాహులై.

చ. అటు పదునాల్గువేలదను ♦ జావళితో ఖరుఁ డాజిఁ గూలినన్
దటుకున లేచి శూర్పణఖ ♦ దానవవంశవరున్ దశాస్యుని
చ్చోటికని దోడితెచ్చి ఖర ♦ సూదనుఁ డార్తిఁ గృశించునట్లుగాఁ
గుటిలశిరోజ సీత నట ♦ కుం గొనిపోయెడుభంగిఁ జేసెదన్.

క. అని తలఁచి లంక కప్పుడె
చని దశముఖుతోడ జనక ♦ జాసౌందర్యం
బును రఘువరుదాష్ట్యంబును
దనవైరూప్యమును దెలుప ♦ దర్పోద్ధతుఁడై. 157

శా. ఏమేమీ మనుజుండు పోర ఖరునిన్ ♦ హింసించెనే యూరయం
గామండూకమహీన్ గురంగము హరిన్ ♦ ఖండించు చందంబునన్

హా! మర్త్యుల్ దనుజాళిఁ ద్రుంచిరకటా ♦ యంచున్ విషాదించినా
సామర్థ్యం బిఁకఁ జూడుమంచు భగిని ♦ స్సంతోషినిం జేయుచున్
శా. మాయోపాయధురీణు సుందతనయున్ ♦ మారీచునిం జూచి ప్ర
జ్ఞాయుక్తిన్ మదభీష్ట మేర్పఱిచి త ♦ త్సాహాయ్యసంపత్తి సీ
తాయోషం జెఱఁగొందునంచు మదిలోఁ ♦ దర్కించి యేతెంచెదు
ర్వ్యాయామంబు వినాశహేతువనుప ♦ ర్యాలోచనాహీనుఁడై.

క. ఏతెంచి తాటకేయుని
బ్రీతిం దర్శించి నిన్నుఁ ♦ బృథురాజ్యరమో
పేతుం జేయుదు ఖ్యాతిగ
నాతోఁ బనివినుము చెలిమి ♦ నాటుకొనంగన్. 160

సీ. తెలిగారురాతుతో ♦ బలిమి పోరఁగఁ గాదు
కరువలి చెలిఁ గెల్వ ♦ క్రిచ్చగాదు
జమునితో నాలంబు ♦ సమకూర్పఁగాఁ గాదు
రేద్రిమ్మరినిఁ గా ♦ రింపఁ గాదు
మున్నీటిదొరతోడ ♦ మోహరింపఁగఁ గాదు
గాలివేలుపుసత్తి ♦ గలపఁ గాదు
విషిముడిరొయొడయనిఁ ♦ బొడిచేయఁగాఁ గాదు
ముక్కంటితోఁ గయ్య ♦ మునకుఁ గాదు
మనజనస్థానమున కొక్క ♦ చెనఁటిచేరి
చెడుగుఁజెయువుల నచ్చట ♦ గొడవ వెట్టె
వానివృత్తాంత మంతయు ♦ వరుస వినుము

దళితమదశాత్రవనికాయ ♦ తాటకేయ. 161

క. నరుఁ డఁట తరణికులుం డఁట
తరుణియుఁ దమ్ముఁడును దాను ♦ దండకవనిలోఁ
దిరుగునఁట ఖరుని బోరం
బోరిగొనెనఁట యరయ భూమి ♦ భుజుఁ డఁటమఱియున్. 162

క. రాముఁడఁట నాము మర్త్యమ
ధాముఁడఁట తపస్వియఁట వి ♦ దారితవిమత
స్తోముఁడఁట యయోధ్యాపుర
ధాముఁడఁట శరాసతూణ ♦ ధరుఁడఁట వింటే. 163

క. నాసామర్థ్యము తనకున్
నాసంబనియో మదేభ ♦ నాసోరూరున్
నాసోదరి శూర్పణఖన్
నాసాశ్రుతిశూన్యఁ జేసె ♦ నవలా ల్నవ్వన్. 164

ఉ. కావున వాని నెంతయును ♦ గాఱియఁ బెట్టెదఁ దద్వధూటిస
ర్వావయవానవద్య నెటు ♦ లైనను దెచ్చెద నింతవట్టు నీ
తో వినిపించి నిన్నటకుఁ ♦ దోడ్కొనిపోవఁగ వచ్చితిం జుమీ
నా విని గుండె ఝల్లుమని ♦ నన్ వెఱఁగందినితాంతఖిన్నుఁడై.

ఉ. ఎవ్వఁడు దెల్పె నీకు దను ♦ జేశ్వర కృత్రిమమిత్రుఁడయ్యెయో
క్రొవ్వున క్ష్వేళముందినుట ♦ కొంగున నగ్గి బిగించుకొంటయా
నవ్వసుధేశుదేవి జగ ♦ దంబను దెచ్చెదనంట యారయన్
దివ్వ యొకండు లాగుటను ♦ దిగ్గున డొంకకదల్చు టౌఁజుమీ.

మ. ధనురస్త్రంబులుపూనికయ్యమునకుం♦దార్కొన్నెఁబద్మాసనే
శనిలింపేంద్రులకైన బ్రమోల నిలువన్♦శక్యంబె చర్చించినన్
వనజాక్షుండు రఘూద్వహుండుగ నుద♦న్వత్కన్యకై దేహిగా
జననం బొంట నిజంబు కేవలమను♦ష్యవ్యక్తు లిట్లుండునే. 167

సీ. తెలియ రతిబాలిశులుభవా♦దృశులు మాదృ
శోక్తి సరసత్వమైనబ♦హుపరికార
ముల భవన్మంగళార్థికై♦తెలిపినాఁడ;
తన్మహత్వ మగోచర♦మున్నదులకు. 168

చ. అది యెటులంటివేని విను♦మా రఘువీరువరాక్రమంబు దె
ల్పెదఁ గుశికాత్మజాధ్వరము♦ప్రీతిగఁ గాచె; సుబాహు
[ద్రుంచె న
న్నదధిని వైచె; సతుపము♦నుగ్మలిశాపమువాపెఁ; బన్నగాం
గదఘనచాపము న్విఱిచె♦గర్వవిహీనుని జేసె భార్గవున్. 169

చ. అనవుడుగాలినెచ్చెలిఘృ♦తాహుతిమండెడుమాడ్కినుగ్రుఁడై
కని పరిభుచిత్త మించుకయుఁ♦గానక పల్కెద వైన నోర్చితిం
బనితమి నీయలీకకళఁ♦బాటలసన్మణిబిందుయుక్తకాం
చనహరిణంబవై జనక♦జాతకు ద్రోలఁ జరింపుమీయనన్.

క. మర్యాదఁ దప్పి కార్యా
కార్యము తెలియఁగక చరించు♦ఖలసహవాసం
బాద్యులకు హాని యనియెడు
నార్యోక్తి ఫలిక్కి యగునె♦శ్రుతిహితమగుచున్. 171

వ. అని.

గీ. తాటకేయుండు లేచి ని ♦ శాటనాథుఁ
గూడి దండకవని కేగి ♦ క్రూరబుద్ధి
శాంబరీశంబరం బయ్యె ♦ శంబపాణి
ముఖుల కరిదిగ వైదేహి ♦ మ్రోల నపుడు. 172

క. సీత కనుంగొని రఘుకుల
నేత కెఱింగించి దాని ♦ నేర్పునఁ దనకుం
జేతికిఁ దెమ్మని వేఁడిన
నాతఁ డనుమతింప నూర్మి ♦ ళాధిపుఁ డంతన్. 173

ఉ. ఇట్టిమృగంబులం దొలుత ♦ నెందును గంటివె వింటివే యయా!
పట్టికొనం దలంచెద వ ♦ పస్మృతి గాదె దొసంగు లెంతయున్
బుట్టవె దీన నిప్డు రఘు ♦ పుంగవ టక్కరిచిల్వవాతఁ జే
పెట్టఁగఁ జూతురే సతుల ♦ వేఁదుఱుపల్కులు విశ్వసింతురే?

శా. క్రవ్యాదుం డొకఁ డెవ్వఁడో కపటసా ♦ రంగాకృతి స్వచ్ఛిమం
తవ్యం బీక్రియ యన్న యన్న నది మి ♦ థ్యాశంబరం బైన హం
తవ్యం బౌను విచార మేల విను సీ ♦ తారత్న నీ కిప్డు క
ర్తవ్యం బే నిదె వత్తు నంచును ధను ♦ ర్నారాచధౌరేయుఁడై.

శా. అర్ణోరాశిగభీరుఁ డారఘువరుం ♦ డభ్యర్ణముం జేర నా
స్వర్ణైణంబు చరించుఁ బొంచు నవనీ ♦ జచ్ఛాయలంఘించు నా
కర్ణించుం బరికించు వెన్క కరుగున్ ♦ గ్రాసార్థమై జీర్ణపుం
బర్ణాఘ్రాణము సేయు మేయఁగడఁగున్ ♦ బొంచుందరింజూపడున్

సీ. చేపట్టుకోలఁదిగా ♦ బిలిబిలినడకల
నందందఁ ద్రిమ్మరు ♦ నంద మెసఁగఁ
బట్టనేగిన రెచ్చి ♦ చెట్టుమాటున నిల్చి
బెదరిపాఱెడులీలఁ ♦ బొదలఁ దూఱు
నెటనుండెనో యంచు ♦ నటునిటు నెమకంగఁ
దటుకున మఱలముం ♦ గటనె యుండు
నచ్చె నింక నటంచు ♦ గొబ్బునఁ గేల్సాఁపఁ
గడుదూరమున నున్న ♦ కరణిఁ దోఁచుఁ
గెడలఁ బొడకట్టి క్రొమ్మించు ♦ క్రియ మెలంగు
మాయమగుఁ దోఁనఁ బ్రభవించు ♦ వేయుగతులఁ
దిరుగుహరిణంబు వెనువెంట ♦ నరిగి యొకటఁ
బఙ్క్తిరథధారణీపత్య ♦ పత్యవరుఁడు. 177
గీ. ఏమొకో యంచుఁ జింతించు ♦ భూమిజాత
తమిఁ దలంచు మృగంబుసొం ♦ దర్య మెంచు
మంచి దీక్షఁ బొంచియైన ద ♦ ట్టించియైనఁ
ద్రుంచియైనను నెలఁత క ♦ ప్పించవలదె? 178
గీ. అని మనంబునఁ దలపోసి ♦ హరిణ మనెడు
కోర్కె విడువక క్రమ్మఱఁ ♦ గొంతదవ్వు
చని యలపునొంది యట నొక్క ♦ చక్కి నిలిచి
పట్టువడకున్కి నాత్మ నిం ♦ కెట్టు లనుచు. 179
క. మేయుట రోయుట డాయుట

పాయుట మొదలగుగరాను • పను లధికముగాఁ
జేయుట యరయ శరమునన్
ద్రేయుటకార్యంబు చాల • వేసటఁ బెట్టెన్. 180

క. అనుజుఁడు చనఁజన దనుచును
దనుజునిపని యనుచు వినిచెఁ • దథ్య మడియద్రైయె
చనె నను నెలఁతుక వేఁడినఁ
బని విన ననుకొనఁగ నగునె • పౌరుషనిధినై. 181

క. ఇపుడైన నేమి నిజముగఁ
గపటైణం బైననొక్క • ఖరశరమున దం
డిపురికిఁ బనిచెద నని య
స్త్రిపమాయగ నిశ్చయించి • సాయక మేసెన్. 182

క. ఆసాయకమున సమ్మా
యాసారంగంబు భీతి • నవనిం గూలెన్
వేసారి నిజనృశంసత
హా సీతా! లక్ష్మణా! య • టంచుఁ బలుకుచున్. 183

శా. ఆయార్తధ్వని భూమిజాత విని యా • హా! లక్ష్మణా! వింటివే
యాయాసంబునఁ బల్కె రాముఁడటనీ • వందాఁకఁ బోమ్మన్న నే
మీ యాతం డిదెవచ్చునమ్ముమఱలన్ • మిథ్యారవంబౌనయో!
వేయుం జెప్పకు మింక శంక తగునే • ఏరుం డతం డెందులన్.

క. సింగంబు కురంగముచే
భంగపడునె వినుము రాజ • పంచాస్య మతం

డంగీకరింపు దంభకు
రంగంబును ద్రుంచి వచ్చు • రభసము గాఁగన్. 185

సీ. కినిసి ముల్లోకములు వెల్ల • గిల్లెనేని
పాటిసేయనిపోటరి • బల్లిమండు
తెల్ల మిదియెల్ల నమ్ము సా • ధ్వీమతల్లి!
తల్లి! నీడెందమునఁ దల్ల • డిల్లవలదు. 186

చ. అదియునుఁగాక భూమితన • యా! వినుమన్నిటికన్నమూలమై
నది యొకటున్న దెట్టు లని • నన్ వినుపించెదఁ గాననస్థలిన్
ముదితల నోంటిఁ డించి చన • మోసము వచ్చునుగాన నేఁగఁబో
ల దనిన నొక్కచోఁ జదికి • లంబడి సారెకు దుఃఖితాత్మ్మయై.

సీ. సాకేతపురి నున్న • సకలభాగ్యము దప్పి
వనవాస మెవ్విధి • వచ్చెనొక్కొ
వచ్చెఁగా కిచ్చోట • నిచ్చఁ ద్రిమ్మరుచున్న
కాంచనమృగ మేల • కాంచనయ్యె
కాంచనయ్యెనుగాక • చాంచల్యమున దానిఁ
దెమ్మని పతిని బ్రా • ర్థింపనేల
ప్రార్థించితినిగాక • భర్తమాటాడక
వెసఁ బట్టికొనఁ బని • వినఁగ వలెనె
పనివినియెఁగాక కష్టోక్తి • భంగి నార్త
రావ మాలింపఁబడనేల • దైవమింక
నేమి వెతపెట్టునో యంను • భూమిజాత

చాల దుఃఖించి పల్కె ల ♦ క్ష్మణుఁ గాంచి. 188

చ. భరతుఁడు తల్లిచేఁ బురముఁ♦బాయఁగఁజేసెను గాని యిట్టిదు
శ్చరితుఁడు గాఁడు నీగుణము♦చాల మదిం దలపోసిచూడ భే
కరవసరీసృపంబుగతి♦గానఁగ నయ్యెడు; సాధ్విపాట నీ
నరయక పాపచింత బలు♦వై చనఁజాలవు ప్రాణఘాతుకా. 189

చ. అని విలపించుచుం గడు న♦హంకృతిఁ గర్ణకఠోరవాక్యముల్
జనకజ పల్కినన్ విని పౌ♦లంతులు సాహస లింకఁ జెప్పఁగాఁ
జనదు సమస్తభూతములు♦సాక్షిగ నామదిఁ బాపచింత లే
దను మఁజనంగనంతటద♦శాస్యుఁడువచ్చెనృపాయతీంద్రుఁడై.

సీ. సప్తసప్తిగభస్తి ♦ సాంగత్యమబ్బక
కుందెడుపద్మిని ♦ చందమునను
హరిణాంకరహితమై ♦ యపరిమితార్తికా
ర్ణవంబునఁ గనుపట్టు ♦ రజనికరణి
మాధవురాక నె ♦ మ్మదిఁ గోరి మాటికి
శ్లేషపర్ణ యగువన ♦ లక్ష్మిపోల్కె
వారివాహము వాసి ♦ వాసి డీసియుఁ దల్ల
డిల్లుసౌదామినీ ♦ వల్లిపగిదిఁ
బక్షిరథధారణీపత్య ♦ సత్యవచశు
భాభిగమనావలోకనా ♦ యత్తచిత్త
యగుచు నుటజాంతరంబునఁ ♦ బొగులుచున్న
జనకనృపజాతఁ గని పల్కె ♦ దనుజనేత. 191

క. ప్రతిలేనివ్రతిని సుమతిని
నతి నియతిని యతినికృతిని ♦ నతిధిని నతివా!
యతులితమతి చతురత శ్రుతి
హితగతి నతిఁ జేసిబికిర ♦ మిడి నుతి గనుమీ. 192

ఉ. ఎవ్వరిదానవో శశిము♦ఖీ! పురుషోత్తముకూర్మిపట్టపుం
జవ్వనివై జనంబులకు ♦ సంపద లీఁగలచిన్నె లొప్పునీ
కవ్విధి యెవ్విధిం దగని♦యంగడ వెట్టినో చూడనైన నేఁ
డివ్వని నొంటి నీవు చరి♦యింపఁగఁ గారణ మేమి చెప్పుమా?

క. అని యడిగిన నవనీసుత
తనవృత్తాంతంబు సత్య ♦ తాపసి యనుచున్
వినిపించిన విని ముదమునఁ
దనచందము దెల్పఁ దొడఁగె ♦ దశముఖుఁ డంతన్. 194

సీ. అఖిలలోకారాధ్యుఁ ♦ డగునగేష్వాస నుం
డిష్టదైవము మాకు ♦ హీరరదన
సకలజగత్సర్గ ♦ చతురుఁ డౌచతురాస్యుఁ
డన్వయస్వామి మా ♦ కబ్జవదన
కడలేనివిడిముడి ♦ గలయలకేశ్వరుం
డగ్రజన్ముఁడు మాకు ♦ హరిణనయన
స్వారాజ్యపతి యగు ♦ జంభాసురారాతి
పరమభృత్యుఁడు మాకుఁ ♦ బద్మగంధి
తొల్త దనసటేనితోడుకు మా ♦ దొడ్డిగిడ్డి

పెట్టుఁజెట్టు తలంప మా • పెరటిచెట్టు
కనకసాలాంక లంక మా • కునికిపట్టు
పొలఁతి నీయాన నాయాన • భువనములకు. 195

చ. పవనపుఁగంబముల్ మిసిమి•బంగరుగోడలు పుల్గురాచరా
గవనులు వజ్రకుట్టిమము•గల్గి చౌకారము మీఱు మేలిమా
దువులఁ జరింపవచ్చునగ•దున్ వనిఁ గుమ్మర సేల నావధూ
టి వగుము లెమ్మురమ్ముపరిక•టించితినాదగుభాగ్యమంతయున్.

క. కొఱఁతయొకించుక యెందే
తెఱఁగునఁ గనరాదు గాన • స్థిరమతి నన్నుం
బెఱవానిగఁ జూడకు మిఁక
నుఱుసిరి గలవాఁడఁ బొందు • ముగ్మలి నన్నున్. 197

క. కుహనామునినై వచ్చితి
గహనావని కిల్లు నీకుఁ • గలభాగ్యము పా
కహనారి కైనఁ గలదే
స్పృహ నాపై నుంచి నను వ•రించితివేనిన్. 198

క. అనుక్రూరోక్తులు జనకజ
కును గళవెళ నుడ్కునూనె • గూబల కంటున్
మునుకొని వీనులలోఁ బో
సిన తెఱఁగుగ నుల్కిపడి వ • చించెం గినుకన్. 199

ఉ. కూళ సహింపరానిపలు•కుల్ పలుకూఱును బల్కె దేల దు
ర్గీల తెఱుంగలేక సద•లీకమునీంద్రుఁడ నంచుఁ బల్కితే

తాళుము రాఘవాస్త్రఫణి దత్తహాలాహల భైషజ్య మిచ్చు నీ
వేళ భుజింతు గాని రఘువీరుఁడు వచ్చినదాఁక నిల్వుమీ.

క. పులిమీసంబులు గొని యు
య్యెల లూఁగఁగ నాత్మనుత్సహించుట హాలా
హల మానఁ గోరుట దవా
నలము మెసవఁ దివురు టిదియు నమ్ము నృశంసా. 201

మ. అని వైదేహి మహాదుర్గ్రహాశ్శ్రుతికటు వ్యాహారముల్ ప
[ల్కుచుం
దన ప్రాణేశు భజించుచున్ వనరుచున్నం జూచి దుస్సాధ్యగా
దనుజాధీశ్వరుఁ డూహఁ జేసి యచటం దరోద్ధతిన్ శాంబరీ
మునివేషంబుఁ బరిత్యజించి మొగముల్ మూఁడా ఱోకం
[ఘొప్పఁగన్. 202

క. వెటవెట దంష్ట్రలు గొఱుకుచు
స్ఫుటకుటిలాకృతి వహించి భూసుత కెదుటన్
గటకట యని పెనుభయమున
నటమట నొందంగఁ గాన నయ్యోఁ దటుకునన్. 203

క. తాదృగ్విధవికృతాకృతి
భూదుహిత పరీక్షఁ జేసి ఘోరున మూర్ఛన్
మేదిని వ్రాలిన నయ్యెడ
నాదశముఖుఁ డెత్తి యునిచె నరదముమీఁదన్. 204

గీ. అట్టిలోకత్రయాతిఘో రావసరము

నందుఁ దప్పెఁ బయోజబం ♦ ధ్వందుగతులు
తారకలు రాలెఁ గూలె ది ♦ గ్దంతు లచల
ములు కదలె నుర్వి కంపించె ♦ మొలిచెఁ దమము. 205

గీ. రావణుం డంత సరదమ ♦ భ్రగతివేగ
నడపికొనుచుఁ జనంగ జా ♦ నకి యొకింత
మూర్ఛఁ దెలిసి కనుంగొని ♦ మొఱ్ఱవెట్టె
జోడు విడికుందుజక్క్రవ ♦ చేడెకరణి. 206

ఉ. ఓనరులారా! యారయుఁ డ♦యో! యడవిన్ సతి సద్వ్రతీయ నే
జానకి రాముపత్ని నట♦జస్థిత నైనననుం దశాస్యుఁ డెం
తే నయహీనుఁ డై కొని య♦తిత్వర నేగుచునున్నవాఁడు లం
కానగరంబుఁ జొచ్చునఁట♦కావరె న న్విడిపింపరే కృపన్.

సీ. దివిషదీశ్వరముఖ్య ♦ దిక్పాలవరులార
రఘువీరుఁ జీరరే ♦ రభసముగను
దీనరక్షణకళా ♦ ధిపజగత్పతులార
రక్షింపరే నన్ను ♦ రాముసతిని
దండకాటవిచర ♦ త్తాపసోత్తములార
విడిపింపరే పుణ్య ♦ వృత్తి మెఱయ
మహనీయబలభిల్ల ♦ మల్లతల్లజులార
ఖండింపరే వీనిఁ ♦ గలుషకర్ము
మృగములార పక్షితప ♦ న్నగములార
నగములార మహోదగ్ర ♦ నగములార

ఖగములార కడిందివాఁ ♦ కగములార
కావరే మీర లియ్యెడఁ ♦ గరుణమీఱ. 208

గీ. అనుచు నాక్రందనము సేయ ♦ విని జటాయు
వడ్డు దాఁకెఁ దటాలున ♦ నసురవరున
కార యిఁక నెందుఁ బోయెద ♦ వనుచు గాంగ
ఝరమునకు సేతువట్టులు ♦ సాహసమున. 209

క. బలశాలి యగుజటాయువు
బలశాసనముఖులు మెచ్చఁ ♦ బక్షిగ్రీవున్
జలకఁగ నడలిచి ముంగల
నిలిచి తెలచి పలికె మేది ♦ నీనందనతోన్. 210

శా. అమ్మా నెమ్మది నమ్ము మిమ్మెయి లవ ♦ మ్మైనన్ భయ మ్మేల నే
నిమ్మాయావిని గ్రమ్మి నెమ్మి నిదె ఘ ♦ స్రేశాన్వయస్వామికిన్
మిమ్మర్పించెద నమ్మురుద్వరుఁడు సం ♦ ప్రీతిన్ నుతించంగఁ జి
త్త మ్మేకాగ్రముఁ జేసికన్గొనుము మ ♦ ద్బాహాబలంబెంతయున్.

క. అని యనితరచింతనుఁడై
మనమున నతివినయ మొనర ♦ మధురోక్తుల న
జ్జనకతనయ నూరాఱిచి
దనుజపతిం జూచి పలికె ♦ దర్ప మెలర్పన్. 212

ఉ. ఓరిదురాత్మ! యింతపని ♦ నొప్పునె భూసుత లక్ష్మి రాముఁ డం
భోరుహనేత్రుఁ డిట్లు భువిఁ ♦ బుట్టిరి భూజనరక్షకై యయో
ఘోరతఁ దెచ్చినాఁడ విఁక ♦ గొబ్బునఁ గ్రమ్మఱ నిమ్ము నీకు వె

ర్యాలులు చెప్పనేటికి దు♦రంతముసు మ్మిది నీకు రావణా.
ఉ. ప్రత్నపరాక్రమంబు లిటఁ♦బల్కఁగఁ జెప్పకుమా విరాధభి
త్పత్నిసి డించు మగారక స♦పత్నత దెచ్చుకొసంగరాదు ద్యో
రత్నకులీనుఁ డైనరఘు♦రాముఁ డలంతియె? చూడ నీదుదు
ర్యత్నము లింక సాగవు ఖ♦రాదులు చచ్చుటనీ వెఱుంగవే?
మ. దనుజాధీశ్వర! మామకోక్తి విను చి♦త్తమ్మేకతానమ్ముగా
ననహంకారతఁ గోసలక్షితిపక♦న్యాశుక్తిముక్తామణిం
గని ప్రార్థింపు కృతాపరాధి ననుచున్♦క్ష్మాపుత్రి నర్పింపుమం
తనెసేఁరంబుఁ క్షమించిరిన్ మనుచు లే♦దాయుల్కఁ జాపుంజమా.
క. వసుసదృశుం డగు దశరథ
వసుమతిపతి సుతవరుండు ♦ వైధేయవిభా
వసునిభధాముఁడు విదళిత
వసుదసుహృద్ధస్వియనెడు వార్తలు వినవే? 216
గీ. అనుచు నెల్లిదముగ ♦ నరిశిరశ్శితకుంత
మగుశకుంత మంటఁ ♦ దగిలిపలుకఁ
దోఁకఁ ద్రొక్కఁబడిన ♦ దుష్టాహివడువునఁ
గినుక వొడమ నుడివె ♦ దనుజవిభుఁడు. 217
క. రాముఁడు భీముఁ డటంచును
వేమరు పామరతఁ బలుక ♦ వెఱతునె దివిష
ద్గ్రామణిఁ బౌలస్త్యసుధాం
ధోమండలి నోర్చి నట్టి♦దోర్బలుఁడనె కా. 218

సీ. బలపాకజంభుల ♦ గెలిచినవజ్రియో
యాటఁ బట్టఁగరాని ♦ యనిలసఖుఁడో
ప్రాణితతిఁ దూఁకిరియో ♦ ప్రభుఁడైనశమనుఁడో
కులపాలకుండైన ♦ కోణపతియొ
సకలరత్నాకరే ♦ శ్వరుఁడైనవరుణుఁడో
భూరిసత్త్వుఁడగు స ♦ మీరణుండొ
రాజరాజాఖ్యచే ♦ రంజిల్లు శ్రీదుఁడో
ప్రళయకారుండగు ♦ భద్రపతుఁడో
విక్రమంబున వీరిలో ♦ నిసమునకుఁ
జాలఁగలఁడేమొ తలపోయ ♦ సరసముగను
మనుజభక్షుండ నగునాకు ♦ మనుజుఁ డొకఁడు
మేటి యనిపల్కెద వదేటి ♦ మాట? పక్షి! 219

మ. మనుజేశావిహారిద్వయుల్ సతతము౯ ♦ మద్భృత్యులై యుండరే
నను డొక్కంబు ధనుఃకళాఢ్యుఁడు జగ ♦ న్నాథుం డటంచు౯ [మహో
దరతం బక్షివి గాన వాని గని చి ♦ త్తభ్రాంతి నీ వెంతయు౯
నరభుగ్వర్యుఁడ నైననాకొఱకు గ ♦ ణ్యాంబె ప్రలాపించిన౯.

క. పక్షీ నీ విటు పల్మరు
నక్షీణబలుండు రాముఁ ♦ డని చెప్పెదవా
సాక్షాద్ధరి యైనను న
న్నీక్షింపంగలఁడె? వినుము ♦ నే హరిణాక్షీ౯. 221

క. శకునమ నీ విధి యొకయప
శకున మనితలంచి యెదురఁ • జాలమరుత్తుల్
ప్రకటించిన నాబాహు
ప్రకరపరాక్రమము గొఱఁతఁ • బఱునే యింతన్. 222

గీ. అని తృణప్రాయముగ నిశా • టాధిపుండు
పలికిన నిజంబు నీయంత • కలుషకర్తు
నకుఁ దొరకు నెట్లు రాముబా • ణహతి యరయు
నాదుపాదాహతియె కాక • నయవిహీన. 223

మ. అని సంపాత్యనుజన్ముఁ డాగ్రహముతో • నద్దానవాధీశుఁ గ్రొ
క్కునఁ బాదంబులఁ దన్నె నౌదలలపైఁ • గోటీరరత్నంబు లె
ల్లను రాలన్ బెనుఁగిన్క సారథిని బ • ల్మాఱున్ బడ న్మోది కే
తనముల్ ముక్కలు సేసి వారువములం • దార్మాఱుగావించుచున్

క. అక్క పెనుగోళ్ల రక్కన్
జెక్కున్ ముక్కునఁ గరంబుఁ • జెక్కలఁ బెట్టున్
ద్రుక్కించు నౌదలలపై
కెక్కం బడఁద్రొక్కి నిక్కి • నెక్కుడు బలిమిన్. 225

వ. మఱియు నవ్విభావరీచరవరునురంబు కరంబు రుధిరంబు దొ
రుఁగఁ గులిశసదృశఖరనఖరంబులఁ గొఱగాని కొఱకొఱం బి
రంబిరం జీఱియు నిజతుండాగ్రంబున ధ్వజవ్రజంబు గజిబిజి
గావించియు విచిత్రం బగుసితచ్ఛత్రం బఱుమాత్రంబున ధా
త్రిం బడవైచియు వేమఱుం జామరంబులు భూమిపైం బారవే

సియు బహువిధంబుల సారథి సనవధిగా నవిధి నొందించి వ
ధించియుఁ జిత్రరంపుఁగత్తులానుల నొత్తి నెత్తుఱుల జొత్తిల్ల
నత్తిమీఱ మొత్తి మిత్తి నర్తించియుఁ బెక్కుగతుల నెక్కు
డుగఁ జిక్కుపఱిచి టక్కున విరథుం గావించి చికాకునొందిం
చినఁ జేయునది లేక వితాకు పడియున్నయన్నరఘుస్మరు దశశి
రంబులు పఱియలై కీలాలంబులు కాలువలై పాఱ సారంబున
ఘోరంబుగా సారెసారెకు ఝుంకారంబు సేయుచుం బడ
మోదిన డిమ్ముఁదిరిగి విఱిగిపడి పరవశుండై యెట్టకేలకుం దె
ప్పిఱిలి లేచి యద్దానవాగ్రణి యుదగ్రుఁడై యాగ్రహంబున
నగ్గరుత్తద్గ్రామణితో విగ్రహం బొనరింప సమకట్టి కట్టెదుర
దిట్టతనంబున నున్నట్టియప్పిట్టకొలంపుఁదలకట్టుం జూచి యో
రి పక్షీ నీయట్టుల మిట్టిమిట్టిపడట్టి యడిగొట్టులఁ గట్టలుగాఁ
గన్నట్టిజగజట్టి నైనన న్నెట్టు దట్టించెదవు నీ వింక నిట్టి నో
టియొట్టుపుమాట లాడితివేని చట్టుపలు దెగఁగొట్టి జగముచు
ట్టంబుపట్టి మనికపట్టునకుఁ బట్టిపనిచెదం జుమీ యైనను ఘటి
యు నొక్కటి వినుము నీ కిత్తఱి నాతో రిత్తయొంటమి యే
ల భూసుత విడిపింతు ననెడునడియాసల వేసరిలక యోసరిలి
తివేని మోసంబు వాసి సుఖంబున మనియెద వనిన మసంబు
నఁ బెనుఁగినుక జనించి కడువడిఁ బిడుగువడువున నొడలిపైఁ
బడిన నప్పు డన్యోన్యంబు మన్యుపూరితచిత్తత ననన్యసామా
న్యం బైనజన్యం బతిదైన్యశూన్యంబుగాఁ బెద్దయుం బ్రొద్దు

సేయుచు నుండఁ బక్షికంధరుం డంతకంత కధిక బలుండై

చ. జనకజ నొక్కచో నునిచి సాహస మొప్పఁ గులాయజన్ము గ్ర
క్కునఁ దనకేలఁ బట్టి పెనుగుబ్బలిచెట్టుపలాదితేయనా
ఘునికరణిం గఱుల్ విఱుగఁ ద్రొక్కి తటాలునఁ బ్రక్కయెమ్ములె
ల్లనువడి పిండిగుండఁగ జలంబు బలంబలరంగఁ గ్రమ్మియున్.

క. ప్రాణావశిష్టుఁ జేసి కృ
పాణుసమేతాత్ముఁ డై విహంగమపర్యుక్
క్షోణిఁ బడవైచి రఘువరు
రాణిం గొని దంభరచిత రథ మెక్కి వెసన్. 228

మ. వినువీధిం జనుచుండఁగా నొకట నుర్వీపుత్త్రి పాదస్ఫుర
ద్ఘనమంజీరము జాఱి వచ్చె నిలకుం గాకుస్థవంశ్యేశుతో
జనకక్ష్మాపతికన్యకామణి నెఱింగించన్ దివేంద్రుండు కాం
చనపత్త్రంబున లేఖ వ్రాసి వెసఁ గ్రచ్చంబంపినాఁడో యనన్.

చ. మఱియుఁ జనంగ నొక్కటను హాద్రిపయిం బ్లవగేంద్రపంచకం
బఱమరలేక త్రిమ్మరఁగ నారసి చీరచెఱంగు చించి యే
డ్తెఱ మణిభూషలన్నియును దీసి తటాలున మూటగట్టి వే
మఱుఁ బతిసంస్మరించుచుఁ మాసుత వైచె దదంతికంబునన్.

క. హా మాత! ధరణి! కావవె
హా! మైథిలజనక! హా! మ హావిక్రమ! హా!
రామా! హా! లక్ష్మణ! హా!
సౌమిత్రీ! ప్రోవరే యశం బలరారన్. 231

గీ. అనుచు విలపింప లంకకుఁ ♦ జని యశోక
వనములో నుంచె మేదినీ ♦ తనయ నపుడు
కీలికీల నపస్మారి ♦ తూలరాశి
లోన నునిచినపగిది న ♦ ద్దానవుండు. 232

శా. వృద్ధస్త్రీల నిదేశబద్ధమతులన్ ♦ వీక్షించి ధాత్రీసుతన్
శ్రద్ధాబుద్ధులఁ గాచియుండుఁ డనియా ♦ జ్ఞాపించియత్యుద్ధతిన్
సిద్ధించెన్ మదభీష్ట మింతకనుచున్ ♦ జేతఃప్రమోదంబుగా
శుద్ధాంతంబున కేగె రావణుఁడు ర ♦ క్షోభామినీయుక్తుఁడై.

గీ. అంత నచ్చట రఘువరుం ♦ డడవిలోన
శాంబరీశంబరము వెంటఁ ♦ జాలదవ్వ
చని దనుజమాయ యనియొక ♦ శరము వైచి
తుంచి వచ్చుచు లక్ష్మణుఁ ♦ గాంచి యపుడు. 234

ఉ. ఏమి సహోదరా! యిటుల ♦ యీడకు రాఁ బనియేమి? కానలో
భూమిజ నొంటి నుంట యప ♦ బుద్ధిగ నెంచుకొనంగవైతి వ
చ్చో మఱి యెవ్వ రేదిగతి? ♦ చూడఁగఁ జుట్టము ప్రొమొక్క
[దైవమున్
వేమరు గల్గనట్టియుట ♦ వీస్థలి మోసము నొందెనోకదా. 235

మ. అనినన్ లక్ష్మణుఁ డన్నకుం దెలచిరా ♦ మావించెవాక్రుచ్చెదన్
వని మాయాహరిణార్తరావము భవ ♦ ద్ధ్వానంబుగా సీతకున్
వినవైనన్ మదిఁ దల్లడిల్లుచు ననున్ ♦ వేవేగఁ బొమ్మన్న నే
ననుమానించితి నంతలో శుభ్రితికలో ♦ రారావముల్ వల్కుటన్.

క. విని యోర్వలేక వచ్చితి
ననవుడు రఘువరుఁడు విన్న ♦ నై వెతఁబడుచున్
వనితలమాటలు గణ్యమె?
చనుదెంచుట చనునె? బుద్ధి ♦ శాలివి గదవే? 237

గీ. అకట! లక్ష్మణ! మనలఁ గా ♦ సక మహీజ
యెచటి కరిగెనో? యాశరు ♦ లీరసమున
నేమి చేసిరో? పన్నగ ♦ మృగఖగాది
దుష్టదుర్బాధ నెందులఁ ♦ గష్ట పడెనో. 138

గీ. అనుచుఁ బలుమరు విలపించు ♦ కొనుచు వేగఁ
బర్ణశాలకుఁ జనుదెంచి ♦ పడఁతి యచటఁ
గానరాకుంట కెంతయుఁ ♦ గటకటపడి
వివశుఁడై లేచి యుందంద ♦ వెదకి వెదకి. 239

క. వెలుపు దఱిగి నెఱి చరులన్
దఱుచగు దరిదరులఁ దరుల ♦ దరులం గిరులన్
తెఱవున మఱువుల నిరవుల
మఱి మఱి గుఱివఱల నరసి ♦ మఱుగుచుఁ దిరుగున్. 240

ఉ. రా యను నబ్జసన్నిభక ♦ రా యను నెచ్చట దాఁగియుంటి దా
రా యను నెంత యయ్యె నవు ♦ రా యను నీవెతఁ బాపువారు లే
రా యను మానసంబు పెను ♦ తా యను వాక్పతికిట్లు సేఁత మే
లా యను విందు లెల్ల నగ ♦ రా యను నేగతి సోదరా యనున్.

గీ. చమరవాలశిరోజపం ♦ చముఖమధ్య

కుంభికుంభసమానవ ◆ క్షోజయుగ్మ
హరిణసన్నిభలోచన ◆ యైనకతన
భామినీమణి వ్యగ్రమైన ◆ దేమొ యకట! 242

సీ. అదె పువ్వుబోఁడిచె ◆ న్నొందవుక్రొవ్వెద యంచు
డంబొంగుశిఖికలా ◆ పంబుఁ జూచు
నదె బాలికాలోక ◆ నాలోకములటంచు
బ్రిచురసారంగదృ ◆ గ్రుచులు చూచు
నదె వాలుగంటిసాం ◆ పాలుపాలిండ్లంచు
సమదభద్రేభకుం ◆ భములు చూచు
నదె భామినీమంద ◆ యానమటంచును
గమనీయకలహంస ◆ గతులు చూచుఁ
జూచి యుప్పొంగు వెతఁ గ్రుంగు ◆ సోలుఁ డొంగు
నింగిఁ జెంగట ముంగిట ◆ నెమకుఁ జెదరి
నట్టితాల్మిని హా! యంగ ◆ నా యటంచు
బెంగఁ గొనియుండు నారఘు ◆ పుంగవుండు. 243

సీ. ఫాలభాగస్ఫుర ◆ జ్జ్వాలికానిలమిత్ర
సహసాంకవామోద ◆ చండి యనుచు
రాహుగ్రహాన్వయ ◆ రాజవిభూషణ
హరిదశ్వసుతదర్ప ◆ హరణ యనుచుఁ
జంపకసుమగంధ ◆ చంచజ్ఝురీజూట
హిమశైలపూజ్యగా ◆ రీశ యనుచు

మరుదంబుపర్ణభు ♦ జ్ఞానీంద్రరతుక
శరదభ్రనిభగాత్రి ♦ గిరిశ యనుచుఁ
గలఁగు మలఁగును దొలఁగు ను ♦ మ్మలిసెఁ బలుకు
సీత వాక్ఛ్రోత్రముఖకచ ♦ శ్రీఁ దలంచి
సూనశరశశ్యాళిపయోద ♦ శుకవికసిత
కుముదరాజీవచంద్రకి ♦ సమితిఁ దలఁచి. 244

వ. పదంపడి పర్ణశాల వెడలి తమ్ముఁడుం దానును బుడమిపట్టిఁజా
డ నెడనెడ నడుగుచుం గడువడి నరిగి గిరిదరీఝరీసరస్తరుప్ర
కరంబు లరయుచుం గొంతదవ్వు చని జన యవసాస్వాదనం
బు మాని మేదినీనందనజాడఁ దెల్పుగతి మోము లెత్తి త
న్నుఁ గనుంగొను హరిణసంచయంబులం గూర్చి యిట్లనియె.

గీ. గంధవహునకు నెప్పుడు ♦ నైంధనమ్ము
లగుట నాతనితో మీకు ♦ నరయనట్టి
తావు లారయ జగముల ♦ లేవు గాన
మేదినీసుతఁ గానరే? ♦ మృగములార! 245

చ. చెలువ తనర్చు కన్నుఁగవ ♦ తేఁటమెఱుంగులు నిమ్ముఁ గెల్చునం
చలిమలి మాని దెల్పుఁడు చ ♦ లాత్మజజాడ మృగంబులార! మీ
రెఱుఁగుదు రుర్వి సర్వము న ♦ నెట్లన మీకుఁ గొలంపుఁ బెద్ద లి
ద్దఱు శశిమండలంబున స ♦ దాశివపాణి నెసంగుచుండుటన్.

గీ. అనుచుఁ గలశజచరితది ♦ గభిముఖముగఁ
జన నొకట సీత తురమున ♦ జాఱినట్టి

ననలు నొకటఁ బదభ్రష్ట • కనకకటక
మరసి మఱికొంతద వ్వేగి • యనుజుఁ జూచి. 248

చ. సితగరుడేణపల్లవవి • చిత్రవిలాసము నుర్వికన్యస
ద్గతికచనేత్రమధ్యకరకంఠరవంబులు గెల్చి వెండియుఁ
క్షితిధరచక్రకీరముల • చెల్వ మణంచెఁ దలంచి చూడ న
య్యతివ నితంబదంతసము • దగ్రకుచాననవాక్యగంధముల్.

చ. వనశుకరాజిపల్కు లన • వద్యములై శ్రుతిసమ్మతంబులై
జనకతనూజపంజరపు • శౌకవచస్స్థితి నొందియుంట బూ
తనయ వనిం జరించుచు య • థావిధి శిక్ష యొసర్చెనేమొ కా
వునఁ బరికింపు మీసఁదరు • వుల్ మఱువుల్ తెరవుల్ సహోదరా

శా. కాంతారాంతరసంచరజ్జనకరా • ట్కన్యామణీవిస్ఫుర
త్కాంతశ్యామలకేశపాశవిలస • త్కాలాంబుదాలోకనా
త్యంతామోదనటత్కలాపిచయకే • కారావసంపూరితా
శాంతం బయ్యెను వింటికాని యెసఁగె • వ్యాఘ్రంబులిట్లుండునే.

మ. కలహంసల్ ఘటసంభవస్థితహరి • త్కాసారకంజాదిఖం
డలసంచ్ఛంచుపుటంబులై వెడలి వే • డ్కన్ వచ్చె శ్రీదాశకుం
దలఁపం దత్సలిలాశయాంతికచర • ద్వైదేహిచంచత్కచ
చ్ఛలనీలాభ్రవిలోకనాధికభయ • స్వాంతంబులై కంటివే. 252

వ. అని మఱియుం జనిచని 253

క. వీధ్రచరిత్రుఁడు కరుణా
సధ్రీచీనాత్ముఁ డాసి • సంభవుఁ డొకచో

గృధ్రవరు భిదురనిహతమ
హీంధ్రగతిని నున్నవాని ♦ నీక్షించి మదిన్. 254

క. ఖగముగ నున్నది కనుఁగొన
ఖగము లిటుల యునికి వినికి ♦ గలదే మును భూ
జగమున సమీరణాశన
జగమున యోగాశనేంద్ర ♦ జగమున నైనన్. 255

చ. తఱుచగుమాయచే నిటులు ♦ దానవుఁడెవ్వఁడో భూమికన్యకన్
వెఱవక యెక్కి పక్కికర ♦ ణిం బడియుండినవాఁడు వీని ను
క్కఱుగఁగ నొక్కకోలఁదును ♦ మాడెదనన్న జటాయువంతలో
నెఱిఁగి మహీజవృత్తమును ♦ రేశునివృత్తము నార్తిఁజెందుచున్.

క. వినిపించి చనియె దివికిన్
జనకునిసఖుఁడనుచు నగ్ని ♦ సంస్కారం బా
తని కొనరిచి పదపడి మఱి
జనకసుతను వెదకికొనుచుఁ ♦ జనిచని యొకచోన్. 257

క. బంధురయశుఁ డవ్విష్టప
బంధుకులీనుఁడు వధించెఁ ♦ బ్రకటితభుజగ
ర్వాంధు మునిశాపప్రతి
బాధప్రాగ్జన్మకర్ము ♦ బంధుఁ గబంధున్. 258

వ. పిమ్మట నక్కబంధుండు విముక్తభవబంధుండై సుధాంధోలో
కంబున కేగుచు నజ్జగద్బంధువంశావతంసులం జూచి చతు
స్సింధుసంగతుం డగుపాశహస్తుగతి వానరచతుష్టయంబుతో

సుగ్రీవుండు ఋశ్యగ్రావంబున నగ్రజాపహృతరాజ్యకళత్రుం
డై యున్నవాఁ డతండు భవదనుగ్రహంబునఁ గృతార్థుండై
మీకు సహాయుం బొసరించి కార్యసిద్ధి సేయంగలఁ డచటికిం
జనుఁ డనిన విని మఱికొంతదవ్వు చని. 259

క. ద్యుమణికులీనులు నొకయా
శ్రమసీమం గాంచి రంతఁ ♦ బ్రణమితదివిష
ద్భ్రమరీకబరీ సద్గుణ
సముదయజాలాహృతాఘ ♦ శ్శబరీ శబరీ. 260

గీ. తత్సమర్పితపూజావి ♦ ధాను లగుచుఁ
గాంచి రాత్మీయఘనసవీచి ♦ కాకలాపి
హృతనిఖిలలోకకలుషద ♦ ర్వీకరంబు
శ్రీకరం బగుపంపాంబు ♦ జాకరంబు. 261

గీ. కాంచి వర్ణించి తత్తీర ♦ కలితసకల
ఫలితకుసుమితపాదప ♦ ప్రకర మచట
నచటఁ జూచుచు ఋశ్యమూ ♦ కాచలాభి
ముఖులగుచు నేగుచుండ నా ♦ మ్రోల నంత. 262

సీ. లలితాంబుజాతఖే ♦ లన్మరాళాళిచే
మందయానవిలాస ♦ మహిమ నేర్చి
కమలగర్భభ్రమ ♦ ద్భ్రమరచలద్గరు
న్మరుదంకురములతో ♦ మైత్రి సలిపి
తతవీచికాసము ♦ ద్ధతశీతలాంభఃక

ణంబులఁ జల్లఁద • నంబు నొంది
కమనీయపరిఫుల్ల • కైరవ శ్రేణుల
రాణించువాసనా • ర్భటి నెసంగి
వీచె రఘువీరులకు శుభ • సూచకముగ
నారపంపాసరోవర • తీరచారు
భూరుహాలతాంతసౌరభో • దీరణాతి
కారణం బగుబాలప • మీరణంబు. 263

శా. అద్రీందుజ్వలనాంబకా ధృతకురం•గా భక్తమందార హే
మాద్రిప్రాస్వ దయాసముద్ర శ్రితచే•తోంభోరుహేందిందిరా
కద్రూసంభవసర్వ కార్ముకగుణా•కాత్యాయనీనాథ భ
ద్రదాద్రిఘిస్థతురంగ పీఠపురస•ద్మా తామ్రిచూడామణీ. 264

క. దిక్పాలకాభినందిత
వాక్పతివృషముఖ్యవిబుధ • వందితపాదా
దృక్పరిహృతదర్పక స
మ్యక్పాలితలోక రక్షి • తాశ్రితలోకా. 265

ఉత్సాహము.

కాశఫేనభేనతార • కాశతారతారకా
కాశనిమ్నగాశశిప్ర • కాశపాండురాంగకా
భూశతాంగ మారభంగ • భూరిశైలకార్ముకా
కోశదాప్త స్కందవప్త • కుక్కుటేశ్వరా భవా. 266

గద్య:—ఇది శ్రీమత్కుక్కుటేశ్వరానుగ్రహప్రభూతకవిత్వ
వైభవ విశ్వామిత్రగోత్రపవిత్ర వారణాసివంశపారా
వారకైరవమిత్ర విద్వన్నుతచరిత్ర కామయార్య
పుత్త్ర సుకవిజనవిధేయ వేంకటేశ్వరనామ
ధేయ ప్రణీతంబైన రామచంద్రో
పాఖ్యానం బనుమహాప్ర
బంధంబునం దరణ్యకాండ
మనుతృతీయాశ్వాసము
శ్రీ.

శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీరామచంద్రోపాఖ్యానము.

## చతుర్థాశ్వాసము.

శ్రీమద్భద్రితురంగా
భూమాలంకృతభుజంగ ♦ భూమిశతాంగా
తామరసాశుగభంగా
కోమలకరుణాంతరంగ ♦ కుక్కుటలింగా. 1

వ. అవధరింపు మనంతరకథావిధానంబు. 2

చ. విపులయశఃప్రతాపు రఘు♦వీరు సలక్ష్మణు జంభదైత్యభే
ద్యుపలవినీలవిగ్రహు స♦ముద్యదనుగ్రహు దుష్టనిగ్రహుం
గపిపతి పారి గాంచి భయ♦కంపితుఁడై కొఱగానిదీనతన్
ద్విపరిపుఁ గన్న యేణముగ♦తింబర తెంచియమాత్యయుక్తుఁడై.

క. భూరుహము లెక్కి సారెకు
వారలఁ గని వాలియాజ్ఞ ♦ వచ్చినవారిం
గా రూఢిసేయ నప్పుడు
ధీరుఁడు సామీరి పలికె ♦ దినకరసుతుతోన్. 4

క. సుత్రామతనూజాజ్ఞా

మాత్రాగతనరులు గారు ♦ మది నరయ జితా
మిత్రులు మిత్రద్యుతులు ప
విత్రులు సత్సఖులు వాలి ♦ విజయసహాయుల్. 5

ఉ. నావుకు సూర్యసూనుఁడు మ♦నంబున హర్షము నొంది పావనీ
నీవచనం బమోఘ మగు♦నీవ గుఱుండవు గూర్మిమంత్రివిం
గావున వారి నేకరణిఁ♦గాంచెదొ యేగతిఁ బల్కరించెదో
తేవ దలిర్ప సఖ్యము ఘ♦టింపుము వారలతోడ ధీరతన్. 6

వ. అనిన నాతఁడంబ సమయోచితవిహితక్రియాగోపాయనమ
హోపాయుండును, స్వచ్ఛందరూపధేయుండును, నగునాంజ
నేయుండు. 7

శా. మిథ్యాసంయమియై రఘుప్రవరసా♦మిత్రుల్ భళీ దేవతా
రాధ్యుం డీయతి యెవ్వఁ డీడ కరుదే♦రం గార్య మేమంచు నెం
తే ధ్యానింపఁగ వారిఁ జేరఁ గని ప్రీ♦తిం గాంచి నిస్వాండు సే
వధ్యాలోకనహర్షితాత్ముఁ డగుచే♦వం గుల్కి పల్కెన్ ధృతిన్.

క. ఎటనుండి యెటకుఁ జనియెద
రిట కరుదేరంగఁ గర్జ ♦ మెట్టిదొ విూయు
త్కటకులగోత్రము లెట్టివొ
స్ఫుటముగఁ బ్రకటింప శ్రవణ ♦ పుటమోదమగున్. 9

క. అనిన సుమిత్రాతనయుఁడు
వినయము పెనగొనఁగ రామ ♦ విభునాజ్ఞాభా
జనుఁడై మాయామానికి

వినిపింపఁగఁ దొడఁగెఁ బూర్వ • వృత్తం బంతన్. 10

సీ. సకలకర్మములకు • సాక్షి యాదినమణి
యన్వయస్వామి మా • కమితపుణ్య
పవిపాణిదత్తాస • నవిభాగుఁ డగుపఙ్క్తి
రథుఁడు మజ్జనకుండు • ప్రీతిఁగన్న
సిరిమించుసిరులకా • కరమైనసాకేత
పురము మానీంద్రకాఁ • పురము మాకు
శ్రుతులు శ్రుత్యంగముల్ • స్మృతులు ధనుశ్శ్రుతుల్
సహజవిద్యలు మాకు • సత్యవచన
నిగ్రహానుగ్రహాచణుండు • విగ్రహాన
హాయశూరుఁ డమేయబా • హాబలసము
దగ్రుఁ డీరామవిభుఁడు మా • కగ్రజుండు
లక్ష్మణుఁడ నేను విబుధసం • శ్లాఘ్యచరిత. 11

ఉ. తండ్రియనుజ్ఞ నేను వసు • ధాసుతయుం దనతోడ రాఁగఁ బె
క్కండ్రిది యేటిమాట యవుఁ • గాదనుచున్నదిలోఁబురీజనుల్
గుండ్రిల వల్కలాజినము • లుం జట లక్షసరంబు లూర్ధ్వపుం
బుండ్రము దాల్చి ధన్వియయి • ప్రోలటు వెల్వడిదండకాటవిన్.

ఉ. పంచవటీతటంబునఁ ద • పస్వివిధంబునఁ బర్ణశాలఁ గా
వించి యటన్ వసించి సుఖ • వృత్తిఁ జరింపఁగ నొక్కనాఁడున
క్తంచరభర్త రావణుఁడు • గ్రన్నన మమ్మును గన్నొఱంగి జం
కించుక లేక రాముసతి • నెత్తుకపోయె విషాదమందఁగన్. 13

ఉ. పిమ్మట నేను నచ్చటికి • బెగ్గిలుచుం జనుదెంచి సీత య
య్యమ్మునఁ గానరామి కెద • నెంతయుఁ జింతిలి కాననెల్లయుం
ద్రిమ్మర గృధ్రరా జొకటఁ • దెల్పె నొకించుక జాడ యొక్కెడ౯
నెమ్మిక బంధుఁ డర్కభవు • నేస్త మొనర్ప సమస్తకార్యముల్.

క. సమకూరు ననిన నటకుం
దమి నరిగెద మోమహాత్మ • తావకవృత్తాం
తము వినఁ గోరెద మనవుడుఁ
బ్రమదంబుగ మాయతపసి • పలికె౯ భక్తి౯. 15

గీ. దేవ మీచంద మెల్లను • దెలియుటకును
గైతవతపస్విశైలూషుఁ • డైతి నింకఁ
బ్రకట మగునట్లు యూనుపూ • ర్వ్యకముగాఁగ
వినుఁడి వినిచెద మత్పూర్వ • వృత్తమంత. 16

సీ. అఖిలస్థలవిహారుఁ • డగుజగత్ప్రాణుండు
జనకుండు మాకు స • జ్జనగరిష్ఠ
స్వఃపార్కసుతు లైన • వాలిసుగ్రీవులు
కులముసామ్ములు మాకు • గోత్రధీర
ప్రాగస్తహిమపటీ • రగ్రావగహాసంబు
లాటపట్టులు మాకుఁ • బాటితారి
జేనియూనతి మెచ్చు • రీతి గూర్చుట వెన్న
తోఁ బెట్టినది మాకు • దురితదూర
సూర్యనందనుప్రియవయ • స్యుఁడను భవద

నుగ్రహార్హుఁడ స్వచ్ఛంద ♦ విగ్రహుండ
సంజనీగర్భజనితుఁడ ♦ నద్రిచరుఁడ
హనుమదాఖ్యుఁడ రామచం ♦ ద్రావనీంద్ర. 17

ఉ. వృత్రహపుత్త్రసంహృతప ♦ విత్రచరిత్రకళత్రుఁ డోట మీ
మైత్రికిమైత్రిపాత్రుఁడను ♦ మానముమానుముమానసంబునన్
శాత్రవజైత్రత్వత్కృపను ♦ సాఁకఁ గృతార్థుఁగఁ జేయు దేని యా
రాత్రిచరేంద్రుఁ ద్రుంచి వెసఁ ♦ గ్రమ్మఱ భూసుత మీ కొసంగఁడే.

చ. అన విని యట్లు సేయు మన ♦ నంజలిఁ జేసి ప్రమోద మొప్పన
య్యనసుతుఁ జేరి వారివిధ ♦ మెల్లను మెల్లన తెల్పి సాఁకఁ దో
డ్కొని చని వహ్నిసాక్షిగ న ♦ కుంఠితసఖ్య మొనర్చె భూసుతా
వనచరరాట్సురారులకు ♦ వామవిలోచనముల్ స్ఫురింపఁగన్.

సీ. ఖలతారకపలాశ ♦ కాందిశీకతమహా
సేనుఁ జేరినసునా ♦ సీరుకరణిఁ
బత్రవిచ్ఛేదేంద్ర ♦ భయమునఁ బాథోధిఁ
జెందినమైనాక ♦ శిఖరిరీతి
దండభృద్భీతిచేఁ ♦ జండీశ్వరునిదండ
మనినమార్కండేయ ♦ మౌనిభంగి
గ్రాహసంగ్రాహసం ♦ త్రాసతశ్రీహరి
ప్రాపుఁ గాంచినగజ ♦ రాజుపగిదిఁ
గనకకశిపునిసాధ్వసం ♦ బున నృసింహు
నలఘు భజియించినట్టిప్ర ♦ హ్లాదుపోల్కి

వాలిపీడితుఁడై రఘూ ♦ ద్వహునిసరస
నొంది తత్కృప సుగ్రీవుఁ ♦ డుండె నెలమి. 20

చ. పదపడి రామకౌశలము ♦ పరీక్ష యొనర్చి కటా! యిటువ్యైనే
ప్రిదిలినధైర్యవృత్తి మది ♦ బెగ్గిల నేల మహీజజాడఁ దె
చ్చెదఁ ద్రిజగంబులు న్నమకి ♦ చెచ్చెర రాఘవనమ్ము మెన్నమా
కిది విధి గాదె భృత్యుఁ డిల ♦ నేలికకుం హితకారి గాఁడొకో.

చ. కలనొకమాట వింటె దశ ♦ కంధరుఁ జెత్తుకపోవునాఁడు మై
థిలి రవిఁ బాసి శీతకర ♦ దీప్తిముడుంగుసరోజినీగతిం
గలఁగుచు మమ్ము నిచ్చటను ♦ గన్గొని చీరచెఱంగునందు భూ
షలు బిగియించి నైచె నమ ♦ సంపద భక్తుల కిమ్ముకై వడిన్. 22

గీ. అనుచు నగ్గిరిగుహ డాఁచి ♦ నట్టితొడవు
లినసుతుఁడు దెచ్చి రామున ♦ కిచ్చె నాత్మ
భావిహానరరాజ్యాధి ♦ పత్యనియత
కరము కరము సమర్పించు ♦ కరణిఁ దోఁప. 23

తరళ. అటు లొసంగినఁ దొడవులందుక ♦ యూఁగరాని వెతం గడుం
దిటము బెంగ మనోవికారగ ♦ తిం గటా యనురాఘవుం
గుటచరేంద్రుఁడు సేదఁ దేరిచి ♦ గుంభితేష్టకథల్ శ్రవః
పుటవినోదముగాఁగఁ దెల్పుచుఁ ♦ బొందెలర్పఁగనుండఁగన్.

శా. అంతన్ వాలిపరాక్రమంబు నిజవృ ♦ త్తాంతంబు నాద్యంతమ
త్యంతార్తిన్ రవినందనుండు రఘువం ♦ శాధీశుతోఁ దెల్పె వా
క్కాంతుం డెంతయుసోమకాహ్వతవి ♦ ఖ్యాతాగమశ్రీకుఁడై

వంతన శ్రీహరికాత్మదుర్వ్యథవడిన • వాకు ప్రిచ్చుచుండెంబుసన్.
ఉ. ప్రత్యయహీను వాలి నొక • బాణముచేఁ బరిమార్చి నెమ్మదిం
బ్రత్యయ మొప్ప నిచ్చి నిర • పాయముగాఁ గపిరాజ్యలక్ష్మి నీ
వ్రత్యయ మే నొనర్చెదఁ బ్ర • భాకరనందన చింతయేల నే
ప్రత్యయ మిట్లు చేసితి వి • పర్యయ మించుక గల్గ దెల్లెడన్.
తరళ. అనుచు నక్కటికం బెలర్పఁగ • నప్పు డెంతయు రాఘవుం
డినతనూజుఁ గలంక దేరిచె • నేవపుంబెను వేఁకిఁ జి
క్కినమనుష్యుని ప్రోడ వెజ్జు చి • కిత్సచే సుఖిఁ జేయుచా
ద్పున నహోయరయంగనిశులు • ప్రోతురార్తులసత్కృపన్.
వ. తదనంతరంబ. 28
క. నందితవిక్రముఁ డారఘు
నందనుఁ డాందోళితాత్మ • నలినాప్తజను
స్పందన్మితహరివిరహాత
దుందుభిమెయి కాలివ్రేలఁ • దొలఁగఁగ మీటెన్. 29
ఉ. వెంజియు రాఘవుండు నిజ • విక్రమ మేర్పడ సౌరి నెమ్మదిన్
నిండినశంక వాయ నొక • నిష్ఠురసాయక మేసి కూల్చె నా
ఖండలవిక్రముండు త్రిజ • గద్విదితోన్నతసప్తతాళముల్
దండిపురామధాతులఁ జ • లమ్మునఁ ద్రుంచినరుద్రు కైవడిన్. 30
ఉ. అప్పుడు సూర్యసూతి వెఱఁ • గంది మహాత్మ భవత్పరాక్రమం
బప్పరమేష్ఠిమైనఁ గొని • యాడఁగలండె కృతాపరాధుఁడన్
దప్పుఁ క్షమింపుమార్య! చరి • తంబు లెఱుంగు నె మొక్కలీఁడు నేఁ

చెప్పెడిదేమి నీదుపద • సేవకుఁగాఁ గృపఁ జూచి ప్రోవవే. 31

వ. అనిన రామచంద్రుండు. 32

క. మనమున వగవక సంతస
మునఁ బురమున కరుగుము దుర • మునకు మఘవసం
దనుఁ గడు దృఢముగ రమ్మను
మనయము శుభద మగు మన క • హ్వాఃప్రభుతనయా. 33

వ. అని సుగ్రీవునిఁ బురికొల్పి వాలిపాలికిం బనిచి తా మంతంత
వెనుకొని. 34

శా. శుష్కీభూతపరాలి వాలిఁ దునుమన్ • క్షోణీతలేంద్రుల్ సమి
న్నిష్కంపప్రతిభాప్రభావు లనురా • నీకాటవీదావశో
చిష్కేశుల్ కరుణాధురీణు లమర • క్షేమప్రదుల్ రాఘవుల్
కిష్కింధాపురి కేగ నంతటను సు • గ్రీవుండు నుద్గ్రీవుఁడై. 35

గీ. ప్రళయకాలమహోగ్రహ • భైరవార
వంబుగతి భూనభోంతరా • ళంబు వగుల
నార్చి పిలిచిన విని వాలి • యబ్బురపడి
యనికిఁ జనుదెంచె మనమునఁ • గినుక వొడమి. 36

వ. అట్లు చనుదెంచినపురందరనందనుం గనుంగొని సుగ్రీవుం డ
ట్టహాసంబు సేయుచుం దాఁకె నప్పు డయ్యిరువురు గొంత
గాని కొఱకొఱం బోరిపోరి పెనంగి చరణముష్టిఘాతంబుల
నొంచుచు భంజించుచు సునిశితంబు లగునఖంబులం జించు
చు మత్సరంబు పెచ్చుపెఱుఁగ నిచ్చలం బచ్చుపడ నితరేతర

మర్కకర్కంబు లుచ్చరించుచు విచ్చలవిడిం గ్రచ్చుకొంచు న
న్యోన్యవిజయం బపేక్షించుచు నెల్లజగంబులు తల్లడిల్ల బెల్లు
గా నార్చుచుఁ బేర్చుచు వ్రేటులు నాటినం బాటిసేయక నా
నాఁటికిం బోటరితనంబులు తేటపడ నూటిమాటలు పాటిం
చుకొనుచుఁ బేరానిక నేనికదాయమొకపుదాయలచాయం
బాయని వైరంబునం బోరాడుచున్నం జూచిచూచి తమ్మివిం
దుకొలంపుబలియుండు వాలిసుగ్రీవులరూపులు చూపున నొ
క్కటిగా లెక్కించి వారి నేతీరున వేఱుపఱుప నేరక యూ
రకున్నంతం బ్రొద్దుపట్టి గట్టులచట్టుపలు కట్టలుకం ధట్టించు
జగజట్టికిం జాలి యగువాలిచేఁ గొట్టువడి బిట్టుబెగడి దిట్టత
నంబు మిట్టువిడి గుట్టుచెడి కట్టా! యిప్పట్టు నెట్టట్టోకదే
యిట్టివెడఁగుపుడమిరేడుడయనినుడువులం గడిదేరి కడలేనిగొడ
వం బడితి ననుచుం గెంజాయనీటిసెలయేటికూటము జిలజిల
వెలలెడుబలుమలతలకట్టుఁజాడ్పున నెత్తురులు జొత్తిల్లుఁగడితం
పుబడుగుటొడలితోడం బాటి భోరున రఘువీరుం జేరి కన్నీరు
మున్నీరుగాఁ బాఱ వేమారు మొఱవెట్టుచుఁ దనదైనగాసి
రోసితే యనుచు నెన్నరానివిన్నఁదనంబును నానలేసినాన
యుం గానిపింప విన్నవించిన మన్నించి జానకీజాని యిట్లనియె.

క. శిరములు స్వరములు కరములు
నురములు కంధరము లరయ నొకతీరుగ మీ
యిరువురభేద మెఱుంగమి

మురుశర మపుడేయునైతి ♦ నోర్చి కపీంద్రా. 38

మ. అని సుగ్రీవుఁడు కొండలం బుడుప నె♦య్యంపుంగనిష్ఠుణ్ వెసం
గని శుంభద్గజపుష్పమాల యఱుతం♦గ్రై సేయు మీవానవా
లానరణ్ పోరి కటన్న నట్లుసలుపం♦బ్రోత్సాహియైరామచం
ద్రునిసుజ్ఞణ్ రవిసూనుఁ డేగి హరిపీ♦రుంగ్రమ్మఱం బోరికిణ్.

మ. పిలువం గ్రక్కున వాలి తోంటియటులే♦బీరంబుమై నేగఁగాఁ
గలనణ్ పోరికిఁ బ్రాపు గల్గెవినుమై♦యోద్ధకుండువింటిణ్ జనణ్
వల దంచున్ నిజదార తారకడిఁదిణ్ ♦ వాక్రువ్వనిర్వ్యాకృయఁడై
పెలుచణ్ వెల్వడివచ్చితాఁకెకడునో♦ప్పించెణ్ దినేంద్రాత్మజుణ్

క. అప్పుడు రఘుపతి యది తన
నొప్పిగ భావించి మది స ♦ నూనక్రోధం
బుప్పతిలఁ జాప మెక్కిడి
తప్పక సుగ్రీవుగెలుపుఁ ♦ దలఁచి పలుమరుణ్. 41

సీ. కడమూలడాఁగె నె ♦ క్కుడుభీతి ముక్కంటి
మహిజముల్ మొదలంట ♦ వ్రాలుపడియె
బయలూని వెలవెలఁ ♦ బారెఁ గల్వలఱేఁడు
గట్టులుకదలక ♦ చట్టుపడియెఁ
బాథోధి కొంఱగాని ♦ భంగసంగతమయ్యె
సర్పముల్ దలవాల్చి ♦ సాఁగఁబడియెఁ
జేట్లోకపిట్టలై ♦ చెదరెఁ బక్షికులంబు
దిగ్గజంబుల పెంపు ♦ మొగ్గఁబడియె

వేఁడి వేల్పుకోలంపుబ ♦ ల్వీరుఁ డటులు
కినుక నొకమ్రాఁకుమఱువునఁ ♦ గను మొఱంగి
కఱుకగులకోరి గుఱిగసిం ♦ గాణిగూర్చి
గాటముగ వాలి నేయంగఁ ♦ గడఁగుతఱిని. 42

గీ. అట్టిభువనభయంకరం ♦ బగుశరంబు
రఘువరుఁడు వ్రేయ వ్రేటున ♦ రణముఁదక్క
సమరజయశాలి నిర్జిత ♦ శాత్రవాలి
వాలి ధృతిఁ దూలి కడు సోలి ♦ నేలఁ గూలె. 43

ఉ. కూలిన వాలిచెంతకు ర♦ఘుప్రవరుం డరుదేరఁ గాంచి య
వ్వాలి యనేకభంగుల శ్ర♦వఃపరుషోక్తులు పల్కె యక్కటా!
పాలితసర్వలోకుఁడవ ♦ పారకృపాహృదయుండ వీడ్యసం
శీలివి ధర్మమూర్తి వని ♦ చెప్పఁట నమ్మితి మోసపోయితిన్. 44

క. ఐనం గానిమ్ము మదీ
యైనోస్యం బగణితం బ ♦ హా! యారయ ల
క్ష్మీనాథమూర్తి వగునీ
చే నీక్రియ ముక్తిఁ గనుట ♦ శ్రీరఘురామా! 45

గీ. జనుఁ డసారతరాజవం ♦ జనసుఖార్థా
నిత్యకృత్యాగతైనోబ్ధి ♦ నిస్తరింప
సాధనం బొండు గలదె యు ♦ ష్మత్పదాబ్జ
యుగళసేవాతరీవర ♦ మొకటి దక్క. 46

శా. దేహం బస్థిర మాజవంజవ మఘా♦ధీనంబు కాంతాసుత

వ్యూహాంబై హిత బాంధవంబనుచుఁ దా♦నూహించి శ్రీశుం జతు
ర్వ్యూహుల్ నిన్నుఁ దలంచి తావకపదా♦బ్జద్వంద్వసంసేవనో
త్సాహుం డైననరుండు పొందుఁగద మో♦క్షుం బెమ్మెయిన్
[రాఘవా!

చ. వినుము కులాలకీటకము♦వృత్తిఁ జరించుచు నాజవంజవం
బునఁ దరుణీతనూజపరి♦పోషణతత్పరుఁ డయ్యు మోహపా
శనిరవబద్ధుఁడై తమి స♦జస్రము తావకపాదపద్మసే
వన మొనరించుధన్యుఁ డప♦వర్గము చూఱకొనండె రాఘవా!

క. అని యి ట్లుపలబ్ధి పెనం
గొన నాడి సుతానుజుల ర♦ఘుస్వామికిఁ జ
య్యన నప్పగించి కపిపతి
తనువు విడిచె నంతఁ దార ♦ తద్వ్యథవిదయై. 49

గీ. ప్రియునికడ కేగి విలపించెఁ ♦ బెక్కుగతుల
రవిజు నిందించి ససఖియై ♦ వివశ యయ్యె
భాస్కరవియోగజనితతా ♦ పపరితాంత
కమలినీయుక్తసారసా ♦ కరముకరణి. 50

గీ. అంత దశరథసూనుఁ డ ♦ త్యాదరమునఁ
దార నూరార్చి కరుణపెం ♦ పార నపుడు
సూరి నగచరరాజ్యాధి♦కారి గాఁగ
నంగదుని యువరాజుగా ♦ నానతిచ్చె. 51

క. పొమ్ము నిజపురికిఁ గ్రమ్మఱ

రమ్మ్య శరత్సమయమున ధ • రాతనయాన్వే
షమ్ము పచరించు కపిసై
న్యమ్ము బలసి కొలువ రిపుభ • యంకరలీలన్. 52

వ. ప్రావృట్కాలంబు మే మీమాల్యవద్గిరీంద్రంబున నుండెద
మని సుగ్రీవునిం బనిచి తమ్ముఁడుం దాను నయ్యచలంబునం
దు వసియింప నంతట. 53

శా. పాంథాభీలము వారిఘూర్ణణపత • త్కాసారాపగాకూలముల్
గంధేభేష్యసభోభ్రమాలము మరు • త్త్రాక్షిప్తకీలాలముల్
సింధుస్వాపనహర్షితాచ్యుతమహా • శీలమ్ము సారంగతృ
డ్గ్రంథీభేదనశస్త్రజాల మగువ • ర్షాకాల మేతేరఁగన్. 54

సీ. నతతత్రివర్ణ్మమం • డల మర్దనము గాఁగ
లలితసౌదామని • లక్ష్మి గాఁగ
జంభశాసనశరా • సనము శార్ఙ్గము గాఁగ
స్తనితంబు కంబునా • దంబు గాఁగ
గర్భస్థసలిలంబు • కరుణారసము గాఁగ
రవిరోచి కౌస్తుభో • స్రంబు గాఁగ
లాస్యత్కలాపిజా • లముభక్తతతి గాఁగ
ద్రుతహంసము లరాతి • తతులు గాఁగ
సవిధగతచాతకావళి • దివిజరాజి
గాఁగ నలరారుకాలాభ్ర • కమలనయనుఁ
డఖిలలోకమహాతాప • హరణసమర్థ

కోకిల్కలికుఁ డొచు నపుడుసా ♦ క్షాత్కరించె. 55

సీ. అఖిలబీజావాప ♦ నారంభసమయంబు,
తోయదచ్ఛన్నవి ♦ హాయసంబు,
పరిపక్వఫలరుచి ♦ స్ఫురదరణ్యామ్రంబు,
శమితోగ్రదావవై ♦ శ్వానరంబు,
హాలికశ్రేణికా ♦ వ్యాపారజనకంబు,
ఘనశిలీంధ్రాంకూర ♦ కారణంబు,
సకలలోకాద్భుతా ♦ సారభూయిష్ఠంబు,
నీరపూరితధార ♦ ణీతలంబు,
ఖగకులకులాయసంకులా ♦ గమచయంబు,
తాండవోత్సుకనీలకం ♦ ధరచయంబు
నగుచుఁ బొగడిక నెగడ నౌ ♦ జగతి నపుడు
వాసి మీఱంగ వార్షిక ♦ వాసరంబు. 56

సీ ఘనముక్తజలకణ ♦ గ్రహణచాతురి మీఱు
చాతకవ్రాతముల్ ♦ సంతసించె
విమలమానససరో ♦ గమనకౌతుకమనః
కలహంసపఙ్క్తులు ♦ కదలి నడచె
గర్భభృత్యామోద ♦ గణనాధికమృణాల
కంఠికల్ శ్రేణులు ♦ గట్టి తిరిగె
నటనకేళీసము ♦ ద్భటమయూరసమూహ
ములు శైలవనములఁ ♦ జెలఁగియాడె

మించుమించులు మొయిలపై ♦ మించి మించెఁ
గాలధారాధరచ్ఛాయ ♦ కడల నెగడెఁ
బధికబిసరుహముఖులకుఁ ♦ బ్రమద మొదవె
జగతిఁ బొగడొందువర్షర్తు ♦ సమయమందు. 57

గీ. నవరసాన్విత మగుచును ♦ దరమనోజ్ఞ
తరళజలధరలక్షణో ♦ దారవృత్త
మై ప్రబంధలీలఘనశ ♦ బ్దప్రయుక్తి
మహిమ నలరారె వర్షాగమంబు ♦ మహిని. 58

చ. గుఱిగ నకారణం బొకల ♦ కోరి నిజాత్మజు వాలిఁ ద్రుంచె నా
కొఱకొఱ దీఱ మీ రిట న ♦ కుంఠితవృష్టి యొనర్చి రాము ను
క్కఱుగఁ గలంచుఁడంచునమ ♦ రాధిపుఁడానతియిచ్చెనో యనం
గురిసె ఘనాళి రాఘవుఁడు ♦ కుందఁ దదద్రి నఖండవర్షముల్.

క. స్థిరతరరఘువరకరుణా
పరిలబ్ధార్యమతనూజ ♦ భాగ్యేక్షేచ్ఛాం
బరచరదమరసతీసుం
దరతను రుచు లన నిరమ్మ ♦ దమ్మాలు మెఱసెన్, 60

ఉ. రావణమర్దనప్రియత ♦ రామనృపాలకృపావిశేషసం
భావితలోకబాంధవకు ♦ మారవలీముఖరాజ్యసంప్రతి
ష్ఠావసరజ్ఞవజ్రివచ ♦ నానుగపుంస్కృతభవ్యవాద్యస
ద్రావములో యనంగ స్తని ♦ తస్వనముల్ వెలసెన్ నభస్థలిన్.

చ. తనమణివంశకర్త వసు ♦ ధాతనయేంద్రుఁ డనుగ్రహంబునన్

దనమణిసూను వానరుఁ బు♦నఃకపిరాజ్యసనాథుఁ జేసె మే
లని మదిఁ బొంగి నింగి కుశ♦లార్థము ముత్తెపుసేస లత్తఱిఁ
బనివడి తాను జల్లె సన♦భాసిలె వృష్ట్యుపలంబు లెల్లెడన్. 62

గీ. అట్టిదుర్ధర్షవర్షాగ♦మావసరము
నందు సీతావియోగదు♦రాపతాప
విచలితస్వాంతుఁడై రఘు♦వీరుఁ డంగ
భవముఖులఁ గూర్చి నిందించి♦పలికెనిటులు. 63

సీ. అబ్జశబ్దాకర్ణ♦నాసహిష్ణుత్వంబు
చక్రిలీలేక్షణా♦సహ్యబుద్ధి
హరిపాదసంసేవ♦నానభిరుచియును
ఘనలింగపదయోగ♦కౌతుకంబు
సన్మండలప్రభా♦సంహరణోత్సాహ
మత్యంతబుధవిరో♦ధాభిమతము
సకలవియోగిహిం♦సాసమాసక్తియుఁ
గుజనులకభివృద్ధిఁ♦గూర్చువృత్తి
తలఁచి చూడ నిశాచర♦త్వంబు సహజ
మైనదుష్టాత్మ నిను శంక♦రావతంసుఁ
డనుమినుకు పూర్వపక్షమై♦యొనరకున్నె
కాముకాభీలరేఖను♦ధామయూఖ. 64

సీ. అనిమిషాంకస్థితి♦నలఘుమాత్రమె కాని
సాంగలావణ్యము♦పొంగఁగలదె?

విషమాంబకసమాఖ్య ♦ వెలయుమాత్రమెకాని
శంకరవ్యాపార ♦ మంకఁగలదె?
హరిహయప్రఖ్యాతిఁ ♦ బఱఁగుమాత్రమెకాని
కృపవియోగుల నాద ♦ రింపఁగలదె?
కమలోదయప్రౌఢి ♦ కలుగుమాత్రమెకాని
జీవనాస్పదవృత్తిఁ ♦ జెందఁగలదె?
ప్రచురతరసుమనోధర్మ ♦ పరత గలుగు
మాత్రమేకాని మాను నె ♦ మధుపగుణము?
కటకటా! మర్మ మెంచిన ♦ ఘనత చెడదె?
స్థిరపవిత్రచరిత్ర ర ♦ తీశశత్రు! 65

ఉ. మారుదురంతవేదనల♦మ్రగ్గుచు నిగ్గిరి నున్ననన్ను వే
మారు నలంచె దేల పెర♦మానిసిగానిభవత్కుమారుఁడౌ
మారుతి మద్భటుం డగుట♦ మానుగ నీవును విందవేఁగదే
మారుత సర్వజంతుగణ♦మానసవర్తన లోకకీర్తనా. 66

సీ. ఎక్కడి దిది యొకో ♦ లెక్క కెక్కుదు రాదు
తనగుద్దు గా దని ♦ తలఁకి తలఁకి
కుజ్జనాఁ డహహా! క ♦ న్నెఱ్ఱఁ జేయఁదొడంగెఁ
బెంచుఁటేటికటంచు ♦ నెంచి యెంచి
యొరసి చూచిన నెందు ♦ నొకదృష్టి నుండదు
పొం దింక వల దని ♦ పొగిలి పొగిలి
కావు కావు మటంచుఁ ♦ గడఁగి పల్కు మటన్న

కుహూకుహూ యనె నని ♦ కుంది కుంది
కలరవం బెంచి తనకూఁత ♦ గాకయున్న
నిలువెడలఁ ద్రోయఁ దనకూఁత ♦ యిదియె యనుచుఁ
గాకి యేకాకిగా నిన్నుఁ ♦ గడకు నొత్తెఁ
బలఁచుకోయిలఁ గోయిలా ♦ యలఁతి బ్రదుకు. 67

సీ. పెఱవారినిసువుల ♦ బిఱబిఱఁ గొనివచ్చి
మాఱురూ పిడుదోస ♦ కారి వగుట
గడిదేఱి మధువాని ♦ చెఱుగుచండాలినీ
సంగతి నుండుపి ♦ సాళి వగుటఁ
కుటిలవేషము పూని ♦ కుజనులహత్తి పాం
థుల నెల్ల హింసించు ♦ ద్రోహి వగుట
శ్రుతి కుపశ్రుతిసేయు ♦ చునుబంకజాతాప్తిఁ
బ్రబలి వాపోవు బే ♦ రజము వగుటఁ
దుర్మద వటంచుఁ దొలుతనె ♦ తమ్మిచూలి
ప్రసవసమయంబులం దంఘ్రి ♦ పముల నునిచి
నీకసంగగుణత్వంబు ♦ నిర్ణయించెఁ
గన్నుఁగొను మదెల్లఁ ద్వల్లీల ♦ కరటి తేఁటి. 68

క. పవమా నీ కిది నాయా
పదమాన్యక యేల నెగసి ♦ వడిమొఱసెదు ష
ట్పదమా పదమా వేగమ
పదమా యావలికి విష్ణు ♦ పదమార్గమునన్. 69

క. చిలుకా మాసుతుఁడై రం
జిలుకాముని తేజి వయ్యుఁ ♦ జెలిమి చెడ సరో
జిలుకఁ దగునఁటవె రోషము
చిలుకులగతిఁ బైని నాటఁ ♦ జీకాకుపడన్. 70

గీ. అని యిటులు చంద్రమదనమం ♦ దానిలాస్య
భృద్భ్రమరకీరములఁగూర్చి ♦ పెక్కుచంద
ముల నుపాలంభన మొనర్చి ♦ కలఁగుచున్న
తఱి శరత్కాల మరుదెంచె ♦ ధరణి నిటులు. 71

శా. పూసెంగాశము లెల్లవెల్లసగుడా ♦ ల్పొల్పొప్పఁగాఁజంద్రికల్
గాసెం బేశలభంగి నింగిఁ బుడమిం ♦ గాంతిచ్ఛటల్ మీఱఁగాఁ
బాసెం గేశవభోగయోగనిబిడప్ర ♦ స్వాపకాలం బటన్
మ్రోసెం దేశములందుఁ గ్రందుగఁ గరం ♦ బు న్జైత్రయాత్రా
[ర్భటుల్.

సీ. కాలాంబుధరగతా ♦ గతపద్ధతు లడంగఁ
గలమ ధూర్వ్యాహత భూ ♦ స్థలిఁ గడంగ
శాలిపాల్యంగనా ♦ సంగీతము మెలంగ
నిర్మలద్యుతి సుధా ♦ నిధి వెలింగ
సితగరుత్తతి మంద ♦ గతి వైఖరి నెసంగఁ
దమిఁ గీరధీరగీ ♦ రమ పొసంగ
వాగ్వధూపూజన ♦ వైభవంబు చెలంగ
బర్హికేకారవా ♦ ర్భటి దొలంగఁ

గడిచిది నెత్తమ్మిత్రాపు లెల్లెడఁ ♦ బెనంగ
ఘనతరధునీప్రవాహావే ♦ గంబు క్రుంగ
మదనునకు జైత్రయాత్ర నె ♦ మ్మదిఁ దొడంగ
భాసురంబుగ శారద ♦ వాసరమున. 73

శా. ధాత్రిన్ సర్వజనోత్సుకం బగుశర ♦ త్కాలంబు వ్యాపింప స
న్మిత్రుండై సమరుత్సుతుం డవనిజా ♦ న్వేషప్రమత్తోష్ణరు
క్పుత్రుం డగ్గతి తత్ప్రయోజనము సంబోధింప నౌనంచు నా
తుత్రోత్రత్రంపసతీగవేషమునకై ♦ సైన్యాధిపగ్రామణిన్. 74

ఉ. నీలుని నీతిశీలుని వ ♦ నేచరవీరుని సౌరి చీరి సీ
తాలలనం గనం బ్లవగ ♦ దక్షులఁ బంపుమటంచుఁ జెప్పి ప్రో
యాలిని గూడి వేడుకల ♦ నర్మిలి నుండఁగ నంత రామభూ
పాలుఁ డనంతకంతుశర ♦ బాధను జింతిలుచుండి యిట్లనున్. 75

సీ. చిరకాలసంప్రాప్త ♦ తరుణీలలామసం
శ్లేషసంభావనా ♦ చిత్రరతుల
యౌవనారూఢశు ♦ ద్ధాంతాంగనారత్న
సహితవాఃకేలికా ♦ విహారణముల
కామినీప్రోత్సాహ ♦ కల్పితద్యూతాద్య
నేకచేతోభీష్ట ♦ కృత్యగతుల
నరసవాక్ప్రౌఢయో ♦ షాసముద్గీతమ
నోజాతశాస్త్రవి ♦ నోదకథలఁ
దనిసి సంభోగచతురకాం ♦ తామణీవి

శాంతసాంగత్యపరవశ ♦ స్వాంతుఁ డగుచు
సూర్యనందనుఁ డాత్మమ ♦ త్కార్యసరణి
మఱచెనో కాక యిచటికి ♦ మఱలిరాక. 76

గీ. ఐనఁ గానిమ్ము భ్రాత నీ ♦ వటకుఁ బొమ్ము
మఱచియున్నట్టిరవిసూతి, ♦ కెఱుకపుట్టి
వడి సరుగుదెంచుకరణి నా ♦ వచనసరణి
గా హితోక్తులు బోధింపు ♦ శాంతినింపు. 77

క. అతఁ డంతకుఁ దమసౌఖ్యమె
మతిఁ దలఁచిన వాలియటుల ♦ మర్దించెద నం
చతిభయదంబుగఁ బలుకుము
ప్రతిన యొనర్చితి నిజంబు ♦ భవ్యవిచారా! 78

సీ. అన శుభలక్షణుఁ ♦ డైనట్టిలక్ష్మణుం
డాక్షణం బక్షుద్ర ♦ కక్షమూల
మున విల్లు దవిలించి ♦ ఘనతరాశుగయుక్త
తూణీరము ధరించి ♦ పాణియుగము
ముకుళించి యగ్రజు ♦ నకు నతి యొనరించి
యాతని వీడ్కొని ♦ యాగ్రహమునఁ
గిష్కింధ దర్శించి ♦ కీశుల ధాటిచేఁ
దొలఁగించి తత్పుర ♦ తోరణమునఁ
దగఁ బ్రవేశించి భావించి ♦ తనదు రాకఁ
గంచుకులఁ బంచి యెఱుకగా ♦ వించి యటకు

సారి రావించి తత్కృత • జ్ఞతకు సంత
సించి కొఱకొఱడించి భా • షించి యపుడు. 79

శా. సీతాన్వేషణ మాచరింపవలదే • శ్రీరాముకార్యం బనన్
వాతూలాత్మజ వింటివే చతురుద•న్వన్మధ్యభూసంస్థిత
ఖ్యాతాశేషకపీంద్రసైన్యముల వే•గం బిల్వఁగాఁ బంపు ము
ద్ధూతారాతిరఘూద్వహాజ్ఞ మనకెం • దున్ ముఖ్యమై
[యుండుటన్. 80

క. అని సుగ్రీవుఁడు చెప్పిన
విని పవనతనూభవుండు • వేగమె కిష్కిం
ధను గలవార్తాహరులన్
బనిచి రఘుస్వామికార్య • పరతఁ దదాజ్ఞన్. 81

సీ. నేల యీనిన రీతి • నిఖిలవానరసేనఁ
బిలుపింప మఱునాఁడు • జలరుహాప్త
తనయుఁ డంగదమరు • త్తనయనీలగవాక్ష
జాంబవన్ముఖకీశ • సైన్యపతులు
కొలువంగ సౌమిత్రిఁ • గూడి సంతసమున
మాల్యవద్గిరి కేగి • మహితభక్తి
శ్రీరాము దర్శించి • సేవితతత్పాద
వనజుఁడై రఘుపతి • స్వాంత మలర
వినయగతి మధురోక్తులు • వినిచి కినుక
వలను కరుణింపు మఖిల ది • గ్వాసకీశ

సేన లోనఁ గూర్పఁ దడవయ్యెఁ ♦ జిత్తగింపు
మనుచుఁ దగువారి నరసి త ♦ దాజ్ఞనపుడు. 82

చ. వినయధురీణు లైనకపి♦వీరులు వీరని నించి సత్కృతుల్
వినతసుషేణులన్ శతవ♦లిన్ వెస రమ్మని ప్రాక్ప్రతీచ్యుద
గ్జనపదపూర్వనాబ్ధిగిరి ♦ కందరసానుధునీసరోవరా
దినిఖిలభూములన్ వసుమ ♦ తీసుత నారసి మీరు క్రమ్మఱన్.

క. మాసమునకు రాకుండిన
శాసించెద ననుచుఁ బనిచి ♦ సామీరి నలున్
వాసవపౌత్త్రుం గజుఁ గమ
లాసనసుతు నీలు మఱియు ♦ నగచరవరులన్. 84

గీ. కాంచి దక్షిణదిశ కన్పఁ ♦ గడఁగి వారిఁ
బెక్కు దలపోసి సామీరిఁ ♦ బెద్దఁ జేసి
రామునకుఁ జెప్ప నాతఁడు ♦ ప్రమద మొప్ప
ముద్రిక యొసంగి చనుమన ♦ ముట్టె నింగి. 85

సీ. అటు లంపఁ దనవెంట ♦ నడవి ద్రిమ్మరి దంట
దళములు చనుదేర ♦ వలనుమీఱఁ
జనిచని నెమకిరి ♦ జనకజఁ గపులెల్లఁ
బురముల జనపదం ♦ బుల సరోవ
రములఁ గూపములఁ ద ♦ రంగవతుల వాలు
కలఁ బల్వలంబులఁ ♦ గానములఁ
దరుల శాఖల మహో ♦ దరుల నద్రుల నుప

త్యకల సానుల నధి ♦ త్యకల మఱియుఁ
గలనెలవు లెల్ల వినువక ♦ కాంచి కాంచి
సీతఁ గానక యొక్కెడఁ ♦ జేరి ప్లవగ
వీరు లందఱుఁ దమ కేది ♦ వెరవటంచుఁ
దలఁచి రపుడాత్మ నపబుద్ధిఁ ♦ దలఁకి తలఁకి. 86

సీ. కలగన్నయటుల యె ♦ క్కడనుండియోరఘు
స్వామి యిచ్చటి కేల ♦ వచ్చె నొక్కొ
వచ్చెఁ గా కేమి భా ♦ స్వత్ఖ్యాతి కతనిఁ గోఁ
గడ లేని పొం దేల? ♦ కల్గెనొక్కొ
కలుగుఁగా కేమి వి ♦ క్రమశాలి యగువాలి
సమరంబులో నేల ♦ సమసెనొక్కొ
సమసెఁ గా కేమి య ♦ జ్జనకజ నెమకంగ
మనల నేటికి సారి ♦ పనిచెనొక్కొ
కటకటా! గాసి కోర్చి ♦ గళ్లు దెగిన
దవ్వరుగుదెంచి చేరరాని ♦ తఱులు గిరులు
చొచ్చి నెమకితి మారాము ♦ సుదతిజాడ
చూడఁబడదయ్యె నింకెందుఁ ♦ జొత్తు మనుచు. 87

గీ. ప్రకటసుగ్రీవుదండన ♦ వికృతిఁ దలఁచి
సంగతమహామనోగదుం ♦ డంగదుండు
పవనజానీతవిశ్రుత ♦ ప్రకృతి నపుడు
చెంది ప్రాయోపవేశంబు ♦ సేయుతఱిని. 88

క. సవిధస్థితుఁ డగుసంపా
తి వలీముఖకృత్య మరసి ♦ ధృతి డాసి తదీ
యవచఃకలనాలబ్ధస
దవయవ్రుఁడై సంతసించి ♦ యతఁ డిట్లనియెన్. 89

మ. వినుఁ దుర్వ్యసుత రావణాపహృతయై ♦ విశ్వేశ్వరుం డాముఁజే
రొక్కనుచున్ లంకకు నేగి యున్న దచటన్ ♦ యూథం బఁట
[న్నుం గపుల్
సునయుజ్ఞుల్ వెసఁ బోవుచో నెదుర నా ♦ లోకించిరుత్కఁఠమీ
అనిజాభంగతరంగసంకలితతా ♦ రాపీథిఁ బాథోనిధిన్. 90

శా. ఆలోకించి తదున్నతత్వమున క ♦ త్యాశ్చర్యులై వానరుల్
వేలాసంస్థితులై తరించుగతికిన్ ♦ వేర్వేఱ బాహాబలం
బాలోచించి దశాదిగా నవతిప ♦ ర్యంతంబు వాక్రుచ్చుచో
బోలన్ వాలిసుతుండు యోజనశతం ♦ బున్ సత్వ మేపాఱఁగన్.

క. దాఁటెదను మగుడివచ్చుట
గాటముగాఁదోఁపదనినఁ ♦ గని భల్లుకరా
జేటినుడువు లివి యిది మన
బోఁటుల కలవియె వినుండు ♦ భుజబలఘనుఁడై. 92

క. ఈమారుతి మనకుండఁగ
వేమారుఁ దలంక నేల ♦ వేధోమధుజి
త్కామారు లడ్డినం బ్రో
ద్దామారుణతేజుఁ డబ్ధి ♦ దాఁటెడుఁ గంటే. 93

వ. అని హనుమంతుడిక్కు మొగంబై. 94

మ. స్వరిలాన్యృక్షత్రిలోకలోకపటలీ ♦ సంస్తూయమానార్హవి
స్ఫురతేజోబలకీర్తిసంయుతుఁడవై ♦ శోభిల్లుబాల్యంబునం
దరుణాంభోరుహమిత్రబింబకబళీ ♦ ద్ధత్యంబుఁ జూపింపవే
పరిపక్వారుణకామనీయకఫల ♦ భ్రాంతిన్ మరున్నందనా. 95

గీ. శక్తివంచన గాకుండ ♦ స్వామికార్య
మనసి సమకూర్చి స్వజనావ ♦ నానురక్తి
గలిగి ఘనబాహువిక్రమా కలన నెసఁగు
వాఁడు బుధలోకసంస్తుతి ♦ వఱలుఁగాదె? 96

క. కావున నీ వీకార్యముఁ
గావింపు ముదగ్రశక్తి ♦ కలవాఁడవుగా
భావించి భానుసూనుఁడు
భూవరునకు నిన్నుఁ జూపె ♦ మున్నుగ ననుచున్. 97

ఉ. భల్లుకనాథుఁ డిట్లు బహు ♦ భంగులఁ బ్రస్తుతిసేయ నప్డు సం
ఫుల్లమనస్కుఁడై పవన ♦ పుత్త్రుఁడు కీశులకెల్లకోర్కె సం
ధిల్ల నగాధిరోహణ మ ♦ తిస్థిరశక్తి నొనర్చె నాసరి
ద్వల్లభలంఘనోద్ధతజ ♦ వంబున వాలము మిన్నుముట్టఁగన్.

వ. అట్లు మహేంద్రపర్వతాధిరోహణంబు చేసి. 99

శా. జంఘల్ దగ్గఱఁబట్టియంఘ్రులొరయున్ ♦ సంధించుచున్ రోదసీ
సంఘట్టోద్భటసింహనాదుఁ డగుచున్ ♦ సంరంభియై యాగభు
క్సంఘుం బాత్మభుజాబలంబు పొగడన్ ♦ గల్లోలినీవల్లభో

ల్లం ఘోరోత్సాహ మొలర్పఁగా నెగసెన్ శై♦లం బంతయుం గ్రుంగఁగన్.

వ. అట్లెగసి గగనగతిం గడిచి దూరం బరిగి సదద్వరప్రేరితం
బై సమైనాక శైలేంద్రంబు నుపలక్షించి నిజగమనావరోధకంగా
భావించి యించుక విచారించి నిజవక్షఃపీఠపీడితుం గావించిచ
న నుద్యోగించి తదీయసాంత్వనోక్తు లాలించి తదాగమన
బాంధవంబునకు సంతసించి కొండొకతడవు విశ్రమించి క్ర
మ్మఱం జనఁజన ముందట. 101

మ. నలినాప్తాధ్వము శీతశైలముగతిన్♦సామీరిమార్గంబు కుం
డలిపంకేరుహనేత్రి యాసురస♦యడ్డం దాని నిర్జింప నా
జలరాశిస్థితపాదయుగ్మము వియ♦చ్ఛ్వాలినీపీఠికా
స్ఖలితాంభఃకణమాల్యభృచ్ఛిరము గాఁ♦గన్పట్టె శీఘ్రంబుగన్.

గీ. అంగ మంగుష్ఠమాత్రమై ♦ యలరఁ జేసి
సురసజఠరంబుఁ జొచ్చి స♦త్త్వరత వెడలి
తదబలాగతవృత్తాంత ♦ విదుఁడు నగుచు
వినయమున దానిఁ జను మని ♦ విజయుఁ డగుచు. 103

చ. అరుగఁగ నంప నొక్కెడ న♦నాతపసంగ్రహణాప్తమన్యుఁడై
నరహరిరంహుఁడై నిజన♦ఖపాటితసింహికాంగుఁడై
శరనిధిపారశైలపరి♦సర్పితదభ్రశరీరుఁడై పడిన్
సురరిపుపట్టణోత్తరసు♦శోభితగోపుర మెక్కి యాత్మలోన్.

శా. ఈయాదోనిధి నెల్లదాఁటిసరొ యీ♦యింద్రద్విషత్స్థానమే
చాయం డాయఁగవత్తు రక్కసుల హా♦చర్చించుకొన్న న్మదీ

యాయాసంబు నిరర్థకం బగునొకో యంచుం గడుందీనుఁడై
సేయంగాఁ గలకార్యమెట్టి యనుచుం జింతించి ధైర్యంబునన్.

మ. జనకక్ష్మాధిపుఁ గన్యఁ గాంచుటకుఁ బ్రచ్ఛన్నప్రచారంబు మే
లనుచున్ శర్వరి నాత్మఁ గోరనపుడయ్యర్కుండు నాత్మాన్వయే
శునికార్యంబు జగద్ధితం బని మరుత్సూనుండు హర్షింప న
స్తనగాభ్యర్ణము చేరె నారయరయన్ సాధుల్ పరాభీష్టదుల్.

గీ. సవిధలబ్ధదినేశ్వరోన్నిప్రతప్త
వితతనిష్యందపశ్చిమోర్వీధరస్థి
తప్రభాకరకాంతతామ్రప్రదీప్తి
ముసుకొనెనో యనన్ ధాత్రి మెఱసె సంధ్య. 107

గీ. మిత్రుఁ డవసుత్వమున నస్తమింప నవుడు
సరసులప్రఫుల్లజీవనజాతములు ర
జోవిహీనతసత్వసంశూన్యతఁ గడు
విన్ననై యుండ నావిర్భవించెఁ దమము. 108

ఉ. తారకరాజిరాజితనితాంతపరిస్ఫుటదీప్తి దద్ద సొం
పార నిజప్రియాగమనహర్షితయామవతీవిలాసిని
స్ఫారవినీలకమ్రకచభారవిచిత్రపరీతసాంద్రశృం
గారితమల్లికాసుమనికాయ మనంగ విహాయసంబునన్. 109

క. ఆవిర్భవించెఁ బూర్వ
గ్రావమునఁ దమస్తమాలగహనశుతారం
బై విశదభంగి యామవ

శ్రీవల్లభబింబ మఖిల ♦ దిక్శోభనమై. 110

గీ. అంత సామీరి లంకిణి ♦ యనుపురాధి
దేవతను గెల్చి దానిచే ♦ భావికార్య
రీతి సర్వముఁ దెలిసి సం ♦ ప్రీతిఁ జని మ
హీజ నెమకంగ నొకసౌధ ♦ మెక్కి పిదప. 111

మ. ప్లవగేంద్రుఁ డరయంగడంగెఁ బ్రఘణ ♦ ప్రాకారహర్మ్యాళిమా
డువలన్ మందురలం గుటీరముల నే ♦ డూకంబులం గంజులన్
సవనాగారములం బ్రతిశ్రయములన్ ♦ క్షౌమంబులం గేళికా
భవనంబం దెకరాల గోష్ఠముల సో ♦ పానప్రదేశంబులన్. 112

మ. రభసం బొప్పఁగ దేవళంబులమహా ♦ రామంబులన్ వెల్గులన్
సభలం గ్రొంతల రథ్యలన్ విపణులం ♦ జైత్యంబులం బద్మసా
రభకాసారతటంబులన్ ముదము మీ ♦ ఱం గాంచి సీతన్ జగ
త్ప్రభుదేవిం గనలేక యెంతయునుజిం ♦ తంబోవ నాముంగటన్.

సీ. పగడాలకంబాల ♦ జిగినీలభిత్తుల
సఘనసౌదామనీ ♦ సౌరు దేరఁ
జవులఁ దీర్చినముగ్గు ♦ చాయరత్ననిబద్ధ
ధరభర్మపాత్రికుం ♦ దగతి గసురఁ
గెంపులవలభికా ♦ ఘృణివిధూపలవేది
వెండిపల్లెపుదివ్వె ♦ విధము దోఁప
మరకతద్వార్ద్యష్టి ♦ మగఱాలతలుపుల
నిలువుటద్దపుజవ ♦ పొలుపుఁ దెలుప

సలిలరాగపుబొమిడికం ♦ బుల మెఱుంగు
లలితనైర్మల్యసోపాన ♦ ములమహోన
రోంబురత్నాబ్జముకుళపు ♦ హొయలు నెఱప
హొవణిఁ బెంపొందుశయ్యాగృ ♦ హంబునందు. 114

సీ. రమ్యరత్నప్రకీ ♦ ర్ణసువర్ణకోటీర
సహితోత్తమాంగద ♦ శక మెసంగఁ
గజ్జలాహార్యరే ♦ ఖాచిత్రవిస్ఫూర్తి
నొఘుళించెడుదేహ ♦ యష్టి మెఱయఁ
బ్రిసవాశుగాసనం ♦ ద్విప్రిస్థరవితర్ది
కరణి విశాలవ ♦ క్షము దలిర్ప
గౌరీశ్వరసమేత ♦ కైలాసశైల మె
త్తినబాహువింశతి ♦ గొనబు వెనుప
వలపుతావి గుబాళించు ♦ కలప మలఁది
సరవి నిద్రంపుటలరుల ♦ శయ్యమీఁద
సొంపు రాణింపఁ గడిఁది ని ♦ ద్రింపుచున్న
జంభభిక్ష్మము రాక్షస ♦ సార్వభౌము. 115

క. చూచి తలయూఁచి యీతని
ప్రాచుర్యమనోజ్ఞభాగ్య ♦ రాజ్యసుఖం బా
ప్రాచీనబర్హి కైన మ
హాచోద్యముగాదె యనుచు ♦ నబ్బురపడుచున్. 116

వ. కొంతతడ వుండి యచ్చటం గదలి క్రమ్మఱ నమ్మహీవల్లభుపల్ల

వాధరిం గనుంగొనుట కచటనచటం ద్రిమ్మరి యెచ్చోటం
గానరామికి నెమ్మనంబున. 117

మ. అకటా యిచ్చటఁ బఙ్క్తికంఠఘటక♦గ్రాహార్యభిజ్జిన్నరాం
తక దేవాంతకశోణితాక్షవికటో♦న్మత్తప్రహస్తాతికా
యకటాగ్నిధ్వజరశ్మికేతుఘనధూ♦మ్రాక్షాశ్వకర్ణాష్ఠమ
స్త్రకభీమాక్షవిభీషణాదిపలభు♦క్సందోహగేహంబులన్. 118

ఉ. కంటిని గాని జానకిని♦గానఁగ నైతిఁ బ్లవంగసేనలో
దంటనటంచు నేగు మన♦దర్ప మెలర్పఁగ వచ్చి లచ్చిపు
ట్టింటిదరిన్ మదాగమన♦మెన్నుచు నున్నకపీంద్రకోటికిం
బంటవలంతిఁజేనికిఁ బ్ర♦భాకరసూతికి నేమిచెప్పుదున్. 119

క. అని మనమునఁ జింతించుచుఁ
జన నెదుట నశోకవనము ♦ సంభ్రమ మొనయం
గన వచ్చిన నచ్చో న
జ్జనకజఁ గన నోపు నిఁక ని ♦ జం బనుచు ధృతిన్. 120

వ. మత్కార్యసిద్ధిఁ గావింపుం డనుచు నిష్టదేవతలం బ్రార్థించి
యయ్యుద్యానవనంబుఁ బ్రవేశించునవసరంబున. 121

క. ఇమ్ముఖువునం దశోకవ
నమ్మున నమ్మహిపుసతి క ♦ నంబడు నిటురా
ర మ్మని పిలుచువిధమ్మునఁ
గమ్మనితెమ్మెరలు వీచెఁ ♦ గపివరు నెదుటన్. 122

వ. అదియొకశకునమ్ముగా నెమ్మదిం దలఁచుచుఁ దదుద్యానవనంబు

సాత్తైంచిశింశుపానోకహారూఢుండై కలయం గనుంగొనుచు న్నతఱి నొక్కతరుమూలంబున నతిభయంకరాకారరక్షస్స్త్రీ పరివృతయై పాదపస్కంధసంభ్రష్టపరిమ్లానలతగతి నతిభీతిఖి న్నయై యున్నయన్నరనాథుదేవి సీతం గనుంగొని పరమానం దంబు నొంది తదీయమహాయాసంబునకు నత్యంతచింతాక్రాం తుండై యంతర్గతంబున. 123

క. ఔనా కాదో యిట ని
మ్మానినివృత్తాంత మంత ♦ మఱువునవిందున్
బూని యని వితర్కించుచు
నానగమున దళపిధానుఁ ♦ డై యుండంగన్. 124

ఉ. అత్తఱి భూమినందన ని♦జాధిపుతో నెడఁబాసి యుండుటం
జిత్తము దూల నెంతయుఁగృ♦శించి మదిం డిగులొంది పేరెలుం
గెత్తుక రామ రామ యను♦చేమియుఁ దోఁచక కుందికుంది పే
ర్చెత్తినదుఃఖభారమున♦ నేడ్చెఁ గనుంగవ నశ్రులొల్కఁగన్.

క. ఈవిధమున శోకింపఁగఁ
బావని గని సీత యంచు ♦ భావించి మదిన్
దావచ్చుటఁ దెలుపుటకును
గావలిరక్కసులు మేలు ♦ కని రరయంగన్. 126

వ. ప్రత్యూషావసరంబై తోఁచుచున్నయది క్రమ్మఱ రాత్రి వచ్చునందాఁక నిందేకతంబుగా నుండుట కార్యం బని నిశ్చయింప నంతట. 127

చ. చదలు వెలుంగుమానికము♦సంతమసంబణఁగించు వేల్పు స
మ్మదమునఁ దమ్ములందినము♦మ్లానత మాన్పవలంతి కల్వఫూ
ముదితసిరుల్ హరించుదొర♦ముప్వురు సాములకున్కిపట్టు ప్రాఁ
జదువులగబ్బిమందసము♦జక్కవకిందుదయించెఁ దూర్పునన్.

చ. అపుడు ప్రభాతకాలవిహి♦తాఖిలమంగళవాద్యనాదముల్
రిపునృపలోకభీకరప♦రిస్ఫుటకాహళికానినాదముల్
విపులయశఃప్రతాపకుల♦విశ్రుతవందివచోనినాదముల్
కపిపతికిన్ వినంబడియెఁ♦గర్ణకఠోరములై పురంబునన్. 129

వ. అట్టిసమస్తభవ్యలక్షణంబులు చెలంగం బురాణగీర్వాణులు ప్రబోధితనిద్రాణులై కాల్యకరణీయంబులు దీర్చి నిజకులాచారధర్మంబు లగుదివసక్రియాకలాపంబులం బ్రొద్దుపుచ్చుచు లంకాపురవాసు లెల్ల నిరాయాసంబున యథేచ్ఛాసుఖంబు లనుభవించుచుండ నంతట. 130

చ. తరుచరవీరుఁ డుర్విజకుఁ♦దాఁ జనుదెంచుట విన్నవింప రా
తిరి తఱి యంచు నుండుట మ♦దిం దలపోసి బుధుండు గానస
త్వరగతి నేగెనో యనఁగ♦వారుణదిగ్గతుఁ డయ్యె భాస్కరుం
డరయఁ బరేంగితజ్ఞత మ♦హాత్ములసొమ్ముగఁ జుమ్మ యెమ్మెయిన్.

మ. ఫలమోహంబునఁ బిన్ననాఁడె కబళిం♦పం జూచె నీక్రోఁతిస
ద్బలుఁడై రామునివార్త సీత కెఱిఁగిం♦పన్ నేఁడు రేఁ గోరె నం
దులకై నం జనకున్నఁ దన్నలుక నెం♦తో సేయునం చల్కచే
నలినాప్తుం డపరాబ్ధిఁ గ్రుంకెఁ గసఁ బ్రా♦ణంబెంత తీపో నటన్.

వ, అంత. 133

మ. సిరితోఁబుట్టువు కాంచనాచలధను♦శ్శీర్షావతంసంబు తా
మరసశ్రీలహరించుకల్లరి నిలిం♦పశ్రేణిపాలింటియో
గిరిపుంబుట్టిక కైరవంబులకుని♦క్షేపంబు వారాశివె
న్నరథాంగంబులనూఁడుచందురుఁడుగ♦న్పట్టెందురాషాడ్డిశన్

వ. తదనంతరంబ. 134

చ. మదనునిశాతబాణపరి♦మర్దితుఁడై సదూరేయివేళ దు
ర్మదమునవిద్రిమేల్కనియు♦మర్షముదోఁప షుమాకుమారికన్
మదిఁ దలపోసి మేలిరవ♦ణమ్ములు చెల్వగువల్వ లెత్తులున్
ముదమునఁ దాల్చిదైత్యకుల♦ముఖ్యుఁడు కేళిగృహంబువె
[ల్వడెన్. 135

సీ. పలలభుక్తరుణులు ♦ కలుషశాతకృపాణ
పాణులై వెసబరా ♦ బరులు సేయ
ఫణిసతుల్ నిజఫణా ♦ మణికాంతివిస్ఫుర
త్కరదీపికలు వట్టి ♦ నడుమ రాఁగఁ
గిన్నరకన్యకల్ ♦ గీతచాతురివిపం
చికలువాయించుచుఁ ♦ జెంత నడువ
బర్హిర్ముఖాంగనల్ ♦ భరతవిద్యాప్రౌఢి
నృత్యంబు సలుపుచు ♦ నెదుట మెలఁగఁ
బురపురంధ్రీజనంబు క ♦ ర్పూరపుహార
తులు తళుకుపైఁడిహరివాణ♦ముల నొసంగ

నోజఁ గనుఁగొంచు బలుశేవ♦రాజసరణి
సంతసంబునఁ జనుదేర♦నంత నిచట. 136

క. కరువలికొమరుఁడు రక్కసి
వారవచ్చుటఁ గాంచి వీఁడు ♦ దుర్భరనిశిత
స్మరశరబాధఁ గలంగుచు
సరుదెంచుచునుండె నిచటి ♦ కతిమత్తుండై. 137

గీ. వచ్చి యేమిదురోక్తులు ♦ వదరునో వి
సంగ వలె నంచు విటపిప ♦ ర్ణముల మఱువుఁ
జేసికొనియుండె నంత నా ♦ సీత సరస
కసురపతి చేరవచ్చి యి ♦ ట్లనుచుఁ బలికె. 138

చ. చెలియరో దర్పకుండు వెడ♦సింగిణిఁ దాలిచి తేఁటినారి బె
గ్గలముగ మ్రోయఁజేసి కణఁ♦కన్ విరితూఁపులునాటసేయనే
తలఁకుచు నంత ని న్నభయ♦దానము వేఁడఁగ వచ్చినాఁడ ని
చ్చలముగ నేలికొమ్మునను♦సాయకముల్ దునుమాడిచూపులన్

క. అసువుల నిడుములఁ బడియెడు
జడసరుపై వలపు విడిచి ♦ సరసుఁడ సంప
న్నుఁడ నగునన్నుఁ గలిసినఁ గడుఁ
దోడవులు విడిముడియు నిడుదుఁ♦దోయజనదనా. 140

సీ. అపబుద్ధిఁ దపసినై ♦ యుపవాసములఁ బ్రొద్దు
లెసయించువాఁ డబ్ధి ♦ యెట్లు దాఁటు
దాఁటుఁగాకేమి ప♦స్నభవాద్యభేద్యమై

మెసఁగులంకాపుర ♦ మెట్లు చొచ్చుఁ
జొచ్చుఁగా కేమి వి ♦ స్ఫురదస్త్రశస్త్రస
మేతాసురాళితో ♦ నెట్లు పోరుఁ
బోరుఁగా కేమి వి ♦ స్ఫారవింశతిబాహు
వృత్తిజిహ్వయుడ న ♦ న్నెట్లు గెలుచు
నేల నీ కిట్టిదుర్భ్రాంతి ♦ యెంచుకొనుము
విడువు మనవులఁ గూరలు ♦ గుడుచుహీన
మానవుని మీఁది యడియాస ♦ మానసమున
వినుతతారుణ్యలావణ్య ♦ జనకకన్య. 141

క. నిన్నుఁ గన్నట్టిజనకావ ♦ నీతలేంద్రు
విశ్వవిశ్వంభరాధీశ ♦ విభునిఁ జేతు
రత్నభూషణకనకవ ♦ స్త్రములు నీకు
నిచ్చి భోగింతు నింక న ♦ న్నేలుకొనుము. 142

సీ. క్రీడింపదే శర్వ ♦ రీవల్లభునితోడ
నార్యసన్నుత సురా ♦ చార్యభార్య
భోగింపదే సుధా ♦ భుజ్నాథుతోడ గౌ
తమతాపసోత్తము ♦ ధర్మపత్ని
రమియింపదే వేడ్క ♦ రత్నాకరునితోడ
హరకపర్దాంతర్వి ♦ హారి గంగ
వరియింపదే ఉషా ♦ వరశిరోలంకారు
ఘనబాహుకావని ♦ మునివనితలు

వారలెల్ల మహీపతి ♦ వ్రతలు గారె
సరససౌభాగ్యసౌందర్య ♦ పురుషుఁ గనిన
సంచలింపరె భువినెట్టి ♦ సాధ్వి యైనఁ
జాలు నీనిష్ఠ లేల న ♦ న్నేలు మబల. 143

మ. వనజాతేక్షణ వేయు నేల వినుమా ♦ వాలెంబు మందోదరీ
వనితారత్నము నీకు నెప్పుడును సే ♦ వల్ చేసి నీయాజ్ఞఁ జే
కొని వర్తింపఁగఁ జేసెదన్ మఱియుఁగో ♦ ర్కుల్ నిండి దైవారమ
ద్ఘనలంకాపుర మేలుకొమ్మొసఁగెదం ♦ దథ్యంబుగా నిచ్చుటన్.

తరళ. అనుచుఁ గర్ణకఠోరవాక్యము ♦ లాడినన్ భయచిత్తయై
జనకపుత్త్రిక రామచంద్రుని ♦ జప్రియున్ మదిలోనఁ బే
ర్కొనుచు నొక్కతృణంబు చేతను ♦ గొంచు నడ్డమువట్టియి
ట్లనుచుఁ బల్కె దశాస్యుతో నమి ♦ తార్తిగద్గదకంఠయై.

మత్తకోకిల.

అయ్య నీవు పులస్త్యవంశము ♦ నందుఁ బుట్టినవాఁడ విం
తయ్యయోకులనాశకారణ ♦ మన్యకాంతలవాంఛ నీ
కియ్యెడన్ జన దీశ్వరుండు మ ♦ దీశుఁ డింతకు నీప్రజల్
నెయ్యపుందనయుల్ దలంచిన ♦ నిక్కువం బిది రావణా. 146

మత్తకోకిల.

ఏల ప్రేలెదు నాదుముంగల ♦ నింతపాపపువాక్యముల్
చాలుఁ జాలు భవత్ప్రతాపము ♦ నయ్యన న్నను రామభూ
పాలుఁ డారయకుండఁ దెచ్చిన ♦ పౌరుషం బిఁకఁ జెప్పఁగా

నేల లక్ష్మణుఁడైనఁ జూచిన • నెంత నిన్ను వధింపఁడే. 147

మహాస్రగ్ధర. జనకోర్వీనాథుపుత్త్రిన్ • జలజహితకుల
• స్వామియౌ రాముభార్యన్
ననుసీవర్పించివేఁడన్ • మనుచుఁ గరుణ నె
• న్నంగఁ గాదేనియుం ద
ద్ధనురుద్యద్వామలూరూ • ద్భవశరభయకృ
• త్సర్పముల్ నీయసుస్ప
ర్శనముల్ భక్షించి దైత్య • ప్రకరములను ఘో
• రంబుగా మ్రింగు వెన్కన్. 148

స్రగ్ధర. శ్రీరామున్ లోకనాథున్ • శ్రితజనవరదుం
• జేరి స న్నిచ్చి తమ్ముల్
దారల్ పుత్త్రాప్తబంధుల్ • దళములు గొలువన్
• లంకఁ బాలింపు మీ విం
పారన్ హృద్యంబు కాదే • యసురకులవనం
• బమ్మహేష్వాసుఁ డల్కన్
నారాచవ్రాతగాథా • నలమువలన దం
• దహ్యమానంబు సేయున్. 149

భుజంగప్రయాతము. వివేకంబుతో నేగి • విశ్వేశు వేఁడన్
గ వేగం గృపం బ్రోచుఁ • గాదేని కాకు
త్థ్సవీరాతిఘోరాస్త్ర • సంఘాగ్ని చేతన్
భవత్పట్టణం బెల్ల • భస్మంబు గాదే. 150

అనవుడు రావణుండు కర♦మాగ్రహియై కరవాల మెత్తియ
జ్జనకతనూజ నిప్పు డిదె♦చంపుదు నంచుఁ జనంగ ధాన్యమా
లిని చెయివట్టి యంత మఱ♦లించినఁ గావలివారిఁ జూచి నే
ర్పునసమకూర్పుఁడీనెలఁతఁ♦బొందిక రెన్నెలలోర్తునో యన్యనన్

క. అటకును ఘటనకు నోడఁబడ
కటునిటు నారయుచునున్న ♦ నసురసతుల్ మి
క్కుటముగ మెసవుఁ డటంచుం
గుటిలత వచియించి దనుజ ♦ కుంజరుఁ డరిగెన్. 152

వ. అంత నచటం గావలియున్న పొలసుమెసవుపొలంతు లగ్గోత్రా
పుత్త్రిం దగ్గఱి దిగ్గన నగ్గిరిభేదనారి నెగ్గులాడక తగ్గుగాఁ జూ
డక కవగూడి సుఖలీలలం దేలు మనుచు నయ్యసుర నిగ్గుదే
రినపగ్గె లుగ్గడించి బోధించినఁ బరాఙ్ముఖయై యుంటకుం గో
పించి పెక్కుభంగులం బాధింపం దొడంగిన భూమిజ యేమి
యుం దోఁచక రామలక్ష్మణులం దలంచుచుం గౌసల్యాసుమి
త్రలం బేర్కొనుచుం గటకటం బఱి మిమ్ముం బాసి గాసి కో
ర్చి యేకాకినై యెంతకాలంబు జీవింపుదు ననుచు నేడ్చుచు
న్నతఱి నాదరి నిద్రించుత్రిజట మేల్కని యక్కటకురక్కసు
లం జుఱచుఱం జూచి మీరింక దౌష్ట్యంబుఁ జేయక చాలించి
యియ్యమ్మకు నోసరిలి యుండుఁడుఁ నే నొక్కకలఁగంటి న
ద్విధంబు వినుఁడు. రామచంద్రుండు వానరవాహినీపరివృ
తుండై లంకానగరంబు సొత్తెంచి యశేషదోషాచరులం బి

లంకమూర్చి సపుత్త్రబాంధవంబుగా రావణు సంహరించి లం
కారాజ్యంబు విభీషణునకు నభిషేకంబు గావించి సీతయుం
దానునుం దమ్ముఁడునుం జయజయధ్వను లెసంగఁ బ్లవంగబ
లంబులతోఁ బుష్పకారూఢుండై యయోధ్యాపురంబు ప్రవే
శించి నట్లయ్యె నయ్యైనిమిత్తంబు లెల్ల నరసిన దాశరథికిజయం
బును దశశిరోధికిఁ బరాజయంబునుం దోఁచుచున్నయది. కా
వున సీత జగన్మాత యనియును రఘువరుండు భువనగురుం డ
నియుఁ దలంపవలయు మనల మనుపం జాలుదు రనుచుం
జెప్పిన విని నివ్వెరపడి దనుజవనితలు ధైర్యంబుఁ దక్కి చే
తులు మొగిచికొని నమ్రలై యుండ నంత నజ్జనకనందన
యుం దన్ను రెన్నెలలమీఁద రక్కసులమెక్కుఁ డని యప్ప
క్షిముఖుండు చెప్పినపలుకులు తలంచి శోకించుచు నప్పుడు
దనకు వామాంగంబు లదరిన నది యొకశుభంబుగా నెంచు
కొంచు నూఱడిల్లి యున్నంత. 153

శా. ఉత్సాహంబునఁ గేలుమోడ్చుకొనియు♦య్యుర్వీజముండిగ్గి భా
స్వత్సంతానవరేణ్యకోశల మొగిన్♦వాక్రుచ్చుచున్న న్నభ
స్వత్సూనుం గని సీత దంభకపిగా♦శంకింపఁ దా జానకీ
హృత్సందేహము మాన్పఁ దెల్పఁ దొడఁగెన్♦వృత్తాంతమా
[ద్యంతమున్.154

సీ. సరయూధునీతటాం♦చలమందు సాకేత
పట్టణాధీశుండు♦పక్షిరథుఁడు

వెలయుఁ దత్పుత్త్రులు ♦ నలువు రందగ్రజ
న్ముఁడు రాముఁ డంగనా ♦ నుజసమేతుఁ
డై తండ్రి యానతి ♦ నతిభక్తి దండకా
టవి కేగి యొకట హా ♦ టకకురంగ
మును గాంచి వెసఁ బట్టఁ ♦ జన నంత దశముఖుఁ
డవనిజ ముచ్చిలె ♦ నత్తెఱంగు
ఘనజటాయువువలన సా ♦ కల్యముగ నె
ఱింగి కుంది కబంధోక్తి ♦ రీతిఁ బంపఁ
గడచి శబరిఁ బ్రశంసించి ♦ గొడవ కోర్చి
యవరజుఁడుఁ దాను ఋశ్యమూ ♦ కాద్రిఁ జెంది. 155

ఉ. అర్కజుచెల్మి సేసియుఁ ద ♦ దగ్రజు వాలి వధించి ప్రేముడిన్
మర్కటకోట్ల నల్దెసల ♦ మైథిలిఁ జూడఁగఁ బంప నేను నిన్
బేర్కొనుచున్ మహాంబునిధి ♦ వెల్లున దాఁటితి లంకఁ జొచ్చితిం
గోర్కె ఫలింపమిమ్ముఁ గనుఁ ♦ గొంటి నిజంబుగ నమ్ముమింతయున్.

క. వాతూలసుతుఁడ రాముని
దూతను సుగ్రీవుమంత్రి ♦ ద్రుమచరకులసం
జాతుఁడ హనుమదభిఖ్యుఁడఁ
జేతస్సంశయము వాయఁ ♦ జెప్పితి నీకున్. 157

క. అమ్మా యుంగర మిదె కై
కొమ్మా తగ నానవాలు ♦ కొనివచ్చితి నేఁ
డమ్మానవపతి నిన్ సే

మమ్మా యని యడిగె సేమ ♦ మా నీకిచటఁ. 158

గీ. అనుచు నుంగర మొసఁగఁ గై ♦ కొని మది రఘు
వీరుమాఱుగ నరసి ప ♦ ల్మారు గుందు
చును బరవశాత్మయై నేల ♦ చూలి కేల
నిడుకొనుచు మోహవిభ్రాంతి ♦ నొడివె నిటుల.

శా. హా యేశాన్వయనాథుఁ డార్తినతికా ♦ ర్శ్యంబొందుటన్నిప్రుగ్రి
వేయుంబైకివా కంకణం బయితో భా ♦ వింపంగఁ గార్యంబు కే
ల్పాయుం గానఁగరాదు మద్విభుఁ డిటు ♦ ల్గాదేనియుం బ్రేముడి
న్నాయాపద్దశ మాన్పఁబంపఁడుగదా ♦ నాయొద్దకుఁ ముద్రికా

గీ. అనుచు నతిమోహవిభ్రాంతి ♦ నంగుళీయ
కముఁ బ్రశంసించి పదపడి ♦ కపివరేణ్యు
రాకకు ముదంబు నొంది య ♦ నేకగతులఁ
బ్రస్తుతించిన నప్పుడ ♦ ప్పవనసుతుఁడు. 161

క. తల్లీ! సెల వి మ్మింకను
గల్లోలవతీశుదరిని ♦ గపివరసంఘం
బెల్లమదాగతమునకై
యుల్లము పల్లడిలుచుండు ♦ నొగి వనివిందున్. 162

గీ. నీమనోహరుఁ డైవ శ్రీ ♦ రాముమదికి
నమ్మకము గాఁగ నానవా ♦ లిమ్మటంచు
విన్నపము సేయ నద్దేవి ♦ యన్నగాట
రత్నమున కంత నిజశిరో ♦ రత్నమిచ్చె. 163

ఉ. నాపడుబాధ లాధరణినాథున కేర్పడఁ జెప్పి బేలనై
పాపపుమాట లెంతయును బల్కుఫలం బిటఁ గంటినంచుగా
రావుమఱందికి న్వినిచి ప్రాణము లేగతి నైన రెన్నలల్
నైఁపుదు నంచుఁ దెల్పుమిఁక శైలచరాన్వయవార్ధిచంద్రమా.
మ. అని చింతించుచు నున్నయజ్జనకకన్యం జాల నూఱార్చి క్రి
స్నన సామీరి తదాజ్ఞఁ బూని మదిలో సన్ రాముపాదాబ్జముల్
దనరన్ నిల్పి ప్రయాణకౌతుకమునం దానూరకే పోవ నే
లని యుద్యానవనంబు సొచ్చె దశకంఠాలోకనోత్కంఠుఁడై.
గీ. కుటములు గదల్చి వసపాలకుల నదల్చి
విరులు పడరాల్చి ఫలములు ద్ధురత డుల్చి
గవఁకులు పెగల్చి పసిఁడిమాడువులు గూల్చి
యెదిరిననిశాటులను గెల్చి ధృతిని నిల్చి. 166
గీ. వన మిటుల లూటి గావించి వనచరుండు
తోరణారూఢుఁడై వేల్పుత్రోవ పగుల
నార్చె నత్తఱినచ్చటి యసురసతులు
గాంచి బెగడొంది దశకంఠు కడకుఁ జేరి. 167

మత్తకోకిల.

కోఁతి యొక్కటి వచ్చి భూమిజకున్ హితంబులు సెప్పి యా
నాతిచేత ననుజ్ఞఁ గైకొని నమ్రుఁడై చనుచో భవ
చ్చ్యూతముఖ్యకుజాతజాతసుశోభితోపవనంబు ని
ర్భీతి లూటి యొనర్చె సత్వము పెంపుమీఱఁగ నావుడున్.

గీ. అగ్రహారంబునఁ బంచసే ♦ నాగ్రగులను
సప్తమంత్రితనూజుల ♦ సరగఁ బనిచి
వనచరుని ద్రుంచి రమ్మన ♦ వారనేక
బలముతో వచ్చి యక్కపి ♦ ప్రవరుఁ జూచి. 169

మ. సముకోత్సాహ మెలర్ప నేర్పుమెయిర ♦ తుస్సైన్యనాథుల్ నిశా
తమహాస్త్రప్రకరంబు లేయుచు భుజా ♦ దర్పంబుఁ జూపింప దు
ర్దముఁడై యాహనుమంతుఁ డంతటను సం ♦ రంభంబుతో జం [బుమా
లిముఖేంద్రారులఁ దోరణస్థగదపా ♦ ల్సైసెఁ నిమేషంబునన్.

శా. ఆవార్తల్ హతశేషు లేర్పఱుపదై ♦ త్యాధీశుఁ డాలించి యే
మీ వింతయ్యెడుఁగీశుఁడొక్కఁడనిలో ♦ నింద్రారిసైన్యేశులన్
దేవాభీలుర మంత్రినందనుల మ ♦ ర్దింపంగ సత్యావ్యుఁడే
హా! వాఁడెవ్వఁడొయిట్టివానిఁగనము ♦ న్నంచున్ విషాదించుచున్

శా. అక్షున్ డగ్గఱఁ బిల్చి నీవు చని బా ♦ హాశక్తి యొప్పార నా
వృక్షాటాధముఁ ద్రుంచి రమ్మన నతం ♦ డెంతేని బీరంబుమై
నక్షీణప్రథితాస్త్రశస్త్రనివర ♦ త్నాంచత్పతాకాఘన
త్వాక్షుణ్ణాష్టతురంగయుక్తతపనీ ♦ యస్యందనారూఢుఁడై.

ఉ. ఏగి కఠోరసాయకము ♦ లేసిన నక్కపివీరుఁ డాత్మలోఁ
గ్రాఁగి కొంతంత గానికను ♦ కన్ గదఁ జేకొని తన్నునెన్నెడన్
మూఁగి కలంచు దానవచ ♦ మూపతులం బరిమార్చి వానికిన్
వీఁగక సంగరోత్సుకత ♦ వెన్నడి భగ్నశతాంగుఁ జేసినన్.173

ఉ. అంత సహాయశూన్యుఁడయి ♦ యాసురరాజతనూజుఁ డాహనూ
మంతునిపయిం గరాళముగ ♦ మార్గణముల్ వడినింప వానికా
వంతయుఁ గొంకు లేక వెస ♦ నాతనిఁ బైకొని చిల్వజేసినా
గాంతకుఁ డెత్తుకొంచుఁ జను ♦ నట్లుగ నింగికి సేగెఁ గ్రిమ్మఱన్.

క. ఎప్పటితోరణమునకుం
గుప్పున దిగి తనమగబ్బి ♦ కుసువులసత్వం
బొప్ప నిఱికించి రక్తము
చిప్పిలఁ గేల్గోయి వాని ♦ శిర మడఁచి వెసన్. 175

క. అక్షున్ రక్షస్సేనా
ధ్యక్షున్ సంగ్రామదక్షు ♦ నస్త్రవిచక్షున్
వృక్షాటనహర్యక్షుం
జాక్షణ మక్షుద్రశక్తి ♦ నవనిన్ వైచెన్. 176

వ. అట్లు వైచిన గతప్రాణుండై పడియున్న రావణిం జూచి హత
శేషదోషాచరులు పాఱి దశకంఠోపకంఠంబుఁ జేరి కుంఠితో
త్కంఠులై యక్షునిపాటు నాటించిన. 177

శా. సాహంకారభయంకరభ్రుకుటిధూ ♦ మాంతర్జ్వలద్దృక్షువి
ర్వ్యాహావిర్భవవిస్ఫులింగచయముల్ ♦ రాలంగఁ గ్రవ్యాదసం
దోహంబెల్లవడంకఁ జూచుచును బు ♦ త్త్రా సారె వాక్రుచ్చుచున్
హాహాకారము సేయుచున్ దనుజవం ♦ శాధీశ్వరుం డత్తఱిన్.

క. నాదాయ పధింపమి పవ
నాదాయతభుజ యశోధ ♦ నాదాయాదా

నాదా యోధులలోఁ దగు
నాదా యోధవర మేఘ ♦ నాదా యనుచున్. 179

క. తండ్రి కెరఁగి తన తేజునఁ
దీండ్రించుచుఁ గడిమి మెఱయ ♦ దితిసుతవనికిన్
జండ్రసెక యసఁగఁ గొఱకొఱ
గూండ్రిలుచున్నట్టి ప్లవగ ♦ కుంజరుఁ డాఁకెన్. 180

వ. అట్లు తాఁకి తేఁకువ మీఱ సోఁకుమూఁకలం బురికొలుపుకొ
ని ఘోరనారాచపరంపరలు నిగుడించిన. 181

క. తత్సాయకములకు నభ
స్వత్సూనుఁడు సరకుఁగొనక ♦ సఁగున గిరిభి
జ్జిత్సైన్యముఁ గలఁచెన్ సమ
రోత్సాహ మెలర్ప నసుర ♦ యుద్ధతుఁ డగుచున్. 182

క. దిక్ప్రికముఖనిఖిలాధ్వర
భుక్త్రాసకరంబు గాఁగఁ బూనివెసఁ జతు
ర్వక్త్రాస్త్రమేసె నద్దశ
వక్త్రసుతప్రవరుఁ డలుక ♦ వాయుజుమీఁదన్. 183

క. ఏసిన నప్పుడు తోయరు
హాసనుకృప బంధముక్తుఁ ♦ డై దశముఖుతో
మీసాలఁ గొన్న నుడుగులు
బాసించెద నంచుఁ గట్లు ♦ వడి నట్లుండెన్. 184

వ. అప్పు డయ్యింద్రజిత్తుండు తనబలంబుతో నక్కపివీరుం జుట్టు

కొని. 185

క. పట్టికొని మెడకుఁ గాళ్లకు
గట్టిగఁ దనబండిత్రాళ్లఁ ♦ గట్టించి కడున్
ధట్టించుచుఁ గట్టెదుటం
బెట్టించినఁ దండ్రి గని క ♦ పిప్రవరునితోన్. 186

క. ఎవ్వఁడవు నీవు జనకుం
డెవ్వఁడు నీవంశ మెద్ది ♦ యెవ్వఁడు నీరా
జివ్వన మేటికిఁ బెఱికితి
వెవ్వఁడు ని న్ననిచె నిచటి ♦ కిన్నియుఁ జెపుమా. 187

చ. అనవుడు నాతఁ డిట్లనియె ♦ నాసురరాజ పరాకు లేక నే
వినుము హనూమదాఖ్యుఁడను ♦ వృక్షచరాన్వయుఁడన్ మరు [త్సుతుం
డను రవిసూతికిన్ సచివుఁ ♦ డన్ రఘువీరునిబంటు భూసుతం
గనుఁగొనవచ్చితి న్నెమకి ♦ కాంచితి నిచ్చటఁ గోర్కె మీఱఁగన్.

క. పనివినుచు మఱలి నీద
ర్శనమునకే వనము పెఱికి ♦ రక్షోవరులం
దునుమాడితి నాయెఁగదా
విను మిఁక నొక టుర్వదన్ వి ♦ వేకముతోడన్. 189

గీ. పరసతీవాంఛ పాతక ♦ మరయ మఱియు
జనకకన్య జగన్మాన్య ♦ జనుల కెల్లఁ
దల్లి యగుఁ గాన నీచెడు ♦ తలఁపు లుడిగి

సీత సర్పించి రఘువీరుఁ ♦ జేరి మనుము. 190

క. హాస్యం బని చూడకు పం
చాస్యాస్త్రసనవిభేది ♦ యగుటెఱుఁగవె నై
రస్యము నీకేలా ప
ఙ్క్తిస్యందననందనుండు ♦ తెలియఁగ నరుఁడే. 191

క. హస్త్యశ్వశతాంగభట
స్వస్త్యంచత్ప్రాజ్యరాజ్య ♦ సంపద లిటుఁ బౌ
లస్త్య చెడనేల తీక్ష్ణగ
భస్త్యన్వయదేవి నిచ్చి ♦ బ్రదుకుము సుఖివై. 192

గీ. వలదు వైరంబు జానకీ ♦ వసునితోడఁ
గ్రొవ్వి కొఱవిని దల గోఁకు ♦ కొనఁగ నగునె
వినుము నామాట వైదేహి ♦ వెస నొసంగి
మనుపు మనుము దయాళుండు ♦ మనుజవిభుఁడు. 193

వ. అని యనిలతనయుఁ డల్కు లేక చుల్కనగాఁ బల్కినం గ
నలి దనుజవల్లభుండు దనభటులం జూచి యీ క్రోఁతి రఘునే
తకు దూత నంచు నిర్భీతి నేతెంచి సీతకుం జేతఃప్రీతిగా భా
షించి మాతో నీతీరున వదరం దొడంగెం గావున. 194

క. తలఁ గొట్టి శాంకరికి వెస
బలివెట్టినఁ గాని వీఁడు ♦ బ్రతికిన మీఁదన్
సెలకట్టె లంకలో దను
జులఁ బట్టివధించుజాడఁ ♦ జూచుచు నుండుఁ. 195

గీ. అనుచు నాగ్రహిణియై యున్న ♦ యన్నతోడ
నాదరంబుగఁ బలికెఁ ద ♦ త్సోదరుండు
ధన్యజనభూషణుండు స ♦ ద్భాషణుండు
ద్వేషికులభీషణుండు వి ♦ భీషణుండు. 196

క. దూతం ద్రుంపఁగఁ దగ దతి
పాతక మన దశముఖుండు ♦ ప్లవగులకు మహా
ప్రీతి యగుఁ దోఁకఁ గావున
ఖ్యాతిగ వాలంబుఁ గాల్చి ♦ యనుపుఁ డటన్నన్. 197

క. మూఁకలుగా రాకాసులు
వీఁకఁ జను దెంచి పట్టి ♦ వృక్షచరుని పెం
దోఁకకు నూనెం దడిపిన
కోఁకలు కడవెళ్లఁ జుట్టి ♦ కొన నలిపి వెసన్. 198

గీ. అనల మంటించి తమపుర ♦ మంత ద్రిప్పి
కట్లు విడఁ దీసి పొమ్ము మ ♦ ర్కట యటన్న
నంత నామాట పంటవ ♦ లంతిపట్టి
విని మనంబునఁ దలఁకుచు ♦ ననలుఁ దలఁచి. 199

క. వైశ్వానర యస్మత్ప్రా
ణేశ్వరదూతకు భవత్సు ♦ హృత్పుత్త్రునకున్
విశ్వజగదద్భుతంబుగ
శశ్వచ్ఛీతలుఁడ వగుము ♦ సౌఖ్య మెలర్పన్. 200

క. అని జనకతనయ మనమున

ననలుని వినుతింప నిచట ♦ ననిలజునకుఁ జ
ల్లని హల్లక వల్లరిచా
ద్భ్వన నున్నముదంబు నొంది ♦ పొంగుచు నంతన్. 201

ఉ. గుల్లెగఁ బ్రాఁకి యున్నగర♦గోపురశృంగము లెక్క నిక్కియం
గళ్లకు దాఁటి సౌధముల♦గంతులు వైచి పసిండికొల్వుసా
వళ్ల నటించి యుట్టముల♦వ్రాలి చొకారపుటోడుబిళ్లలం
బ్రుల్లి మహోపకారికలు♦దూరిగృహంబులనిల్చి వెండియున్.

క. ధనధాన్యరత్నభూషణ
ధనురస్త్రాయుధసమగ్ర ♦ ధామంబులు స
ర్వనకేళీగంజాము
జ్జనశాలలు గలయఁ దిరిగి ♦ సంతస మెసఁగన్. 203

క. అనలున కేశాహుతిగా
దనుజపురము నింపఁ జిచ్చుఁ ♦ దరికొల్పిన గొ
బ్బున మండఁజొచ్చె ననురే
శున కెంతయు భావ్యర్థ ♦ సూచక మగుచున్. 204

క. ఆయెడను బౌరు లందఱు
హా! యెక్కడిక్రోఁతి వచ్చె ♦ రా పఙ్క్తిముఖుం
డా యమ్మ సీతఁ దెచ్చుట
నే యింతయ్యెఁగద యింక ♦ నేమగునొకదా. 205

గీ. అనుచు గృహములు విడిచి బ ♦ యల్లువట్టి
రంత దశకంఠుఁ డత్యంత ♦ చింత నగరు

వెడలి కడ నిల్చె నప్పు డా • వృత్తచరుఁడు
సీతఁ గ్రమ్మఱ నరసి సం • ప్రీతి నెరఁగి. 206

గీ. ఆసఁ గొని వార్ధిఁ జిచ్చొచ్చి • పూనికొనిన
లీల నడువీథిఁ జని యుద • గ్లీలఁ జెంది
కంటి వైదేహిఁ రఘువీరు • కాంత ననుచు
నచటికపులకు వినిచె వృ • త్తాంత మంత. 207

మ. కుతుకం బొప్పఁగ నమ్మరుత్తనయుఁ డే • రొక్కించుక స్వరా [ద్భుతమైనా
నతి భూభృచ్చరు లర్కసూనువధుకాం • తారంబు సొత్తెంచి [వాం
ఛితముల్ దీర ఫలాదు లామనిగ భ • క్షింపంగఁ దత్పాలకుం
డతిభీతిన్ గపిసూతి కేర్పఱుపఁ గో • పాశ్చర్యహర్షాత్ముఁడై.

శా. సీతాదర్శనకాతుకోద్ధతిన్ చ • ట్బింపంగఁ గాఁడేని ని
ర్భీతిన్ మద్వన మట్లు సొచ్చెదరె వా • రిన్ వేగ దోతెమ్మనం
జేతఃప్రీతిగ నంత మర్కటభటుల్ • చేరంగ నేతెంచి ప్ర
ఖ్యాతుండైన మరుత్సుతుండు పలికెం • గాకుత్స్థుతో మ్రొక్కు [చున్. 209

శా. కంటిన్ జానకి నీదుకాంతఁ ద్రిజగ • త్కల్యాణి నాయమ్మచే
వింటిం బొంటిమిథఃకథల్ మఱి శిరో • విన్యస్తరత్నంబుచే
కొంటిం గ్రమ్మఱ నానవా లిదియె కై • కొమ్మంచు నర్పింపవా
ల్గంటిం జూచినయట్లు చూచికొనియెం • గాకుత్స్థుఁ డానందియై.

మ. కొని మ్రొక్కించుకసేపు చూచి సతిఁ జే♦ర్కొంచున్ విషా
[దించుచున్
హనుమద్భాషిత మెల్లఁ గల్లయని మో♦హభ్రాంతిఁ బల్కంగఁ జ
య్యన సుగ్రీవుఁడు లక్ష్మణుండు నుముదం♦బారంగ నారార్వనం
తనె వృత్తాంతము దెల్పె సర్వము జగ♦త్ప్రాణాత్మజుం
[డెంతయున్. 211

వ. అటు లనిలతనయసమావేదితసకలవృత్తాంతుండై రఘువరుం
డు లక్ష్మణసుగ్రీవాంజనేయాదులం గూడుకొని ప్రమోదంబు
న నుండె నప్పుడు. 212

శా. అంభోజాసనసంభవాదిమునిలో♦కానీకహృద్యప్రదా
కుంభిక్రవ్యభుగుగ్రజీవనమరు♦ద్గూఘాంఘ్రిరూపాంచితా
జంభారాతిముఖామృతాశనసదా♦సంపూజ్యపాదాంబుజా
కుంభీపాకవిలుంఠనాక్ష్యజగద♦క్షుద్రాభిధానాక్షరా. 213

క. షడ్లపసజసక వృషసా
ప్రమాడ్లాంఛన పీఠనగర ♦ మందిర సరసీ
రుడ్లోచనాస్త్ర రజనీ
రాడ్లోకహితానలాక్ష ♦ ప్రమథాధ్యక్షా. 214

మాలినీవృత్తము. దివిషదవనతోషా ♦ దీపితాంగార్థయోషా
కవిగురునుతభాషా ♦ ఖండితాశేషదోషా
సవనహరణరోషా ♦ సాధుచిత్తాబ్జపూషా
కువలయహితభూషా ♦ కుక్కుటాధీశవేషా.

గద్య:—ఇది శ్రీమత్కుక్కుటేశ్వరానుగ్రహప్రభూతకవిత్వ
వైభవ విశ్వామిత్రగోత్రపవిత్ర వారణాసివంశపారా
వారకైరవమిత్ర విద్వన్నుతచరిత్ర కామయార్య
పుత్త్ర సుకవిజనవిధేయ వేంకటేశ్వరనామ
ధేయ ప్రణీతంబైన రామచంద్రో
పాఖ్యానం బనుమహాప్ర
బంధంబునందుఁ
జతుర్థాశ్వాసము
శ్రీ.

శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీ రామచంద్రోపాఖ్యానము.

## పంచమాశ్వాసము.

శ్రీమద్గిరివరధామా
సామజదానవవిరామ ♦ సన్నుతసుగుణ
స్తోమా సంభృతమిహికా
ధామా కృకవాకురూప ♦ దైవలలామా. 1

వ. అవధరింపు మనంతరకథావిధానంబు. 2

ఉ. వానరవల్లభుండు కపి♦వాహిని సర్వముఁ జూపి వీరలా
దానవనాథసంహరణ♦దక్షులు లోకము లెల్లఁ బుక్కిటం
బూనుబలాఢ్యులింక జయ♦ముం గొనమంచిముహూర్తమిప్పుడే
మానవనాథ లెమ్ము హను♦మంతునిఁ గైకొనువాహనంబుగన్

క. భవదవరజుండు తారా
భవుపై రాఁగలఁ డటన్నఁ ♦ బరమోత్సుకతన్
తివిరి నలనీలశతబలి
గవయగవాక్షానువింద ♦ గజులున్ మఱియున్. 4

క. భరత ప్రజంఘ దధిముఖ

శరభ కుముద మైంద వింద ♦ జంఘు పనస కే
సరిముఖ సేనానాథులు
తరణితనూజాజ్ఞ బాహు ♦ దర్ప మెలర్పన్. 5

క. ముందటను వెనుకఁ గ్రేవల
గ్రందడి నరుదేరఁ బవన ♦ సంభవతారా
నందనుల నెక్కి పజ్జన్
స్యందనసూనులు చనంగ ♦ సంతస మెసఁగన్. 6

సీ. నిర్భరభేరికా ♦ నిర్ఘోషనిర్దళ
త్కకుబంతగజఘటా ♦ కర్ణపుటము
స్ఫుటపదఘట్టనో ♦ ద్ధూతధాత్రీరజః
కర్దమితాభ్రగం ♦ గాఝురంబు
వాలచాలనజాత ♦ వాతాహతోద్ధూత
విభ్రమత్కాంతార ♦ వృక్షచయము
హేలాసముల్లాప ♦ కోలాహలారవా
త్యంతపూరితభూన ♦ భోంతరంబు
యాతువధహేతుగమనకృ ♦ చ్ఛ్రాతిమన్యు
జనితహుంకారభయచల ♦ ద్వనకుభృద్బి
లాంతరవిలీనకంఠీర ♦ వాదిమృగము
నగుచు నడిచెను గపిసైన్య ♦ మధిపుమ్రోల. 7

క. వడి చిత్ర మొప్ప నిటు లది
నడిచి పృథులసహ్యామలయ ♦ నగరాజంబుల్

గడిచి మహేంద్రాద్రీంద్రము
విడిచి రఘువరాజ్ఞ నరిగె • వేలావనికిన్. 8

వ. అవ్విధంబునం జని తద్వనజాతనానావిధమధుమధురఫలాదిక
పరిశమితక్షుత్క్షామం బగువానరబలస్తోమంబు పరివేష్టింపఁ గా
సల్యానందనుండు సలక్ష్మణుండై యొక్కరమ్యప్రదేశంబున
విశ్రమించి యిష్టకథాలాపంబులం బొద్దుపుచ్చుచున్నంత. 9

చ. మనరిపుఁ బజ్జకంటునతి • మన్యతరాముఁడుదుంచునిప్పుడం
చును బలభేది సింధువిభుఁ • జూడఁగ రమ్మనికాన్కగాఁగఁగాం
చనవలయంబు ఘస్ర మను • చారునిచేతను బంపెనో యనం
గను జరమాద్రిచెంతకు జ • గద్ధితబింబము సేరె నయ్యెడన్.

క. సంధ్య దనర్చెను సురపరి
పంథ్యున్నద మణఁచు భువన • పతి కృపఁ దమి ని
ర్వంధ్య మగు ననుచు నెత్తిన
కంధ్యధిపునిమణిపతాక • కాంతియొ యనఁగన్. 11

శా. ఖద్యోతాత్మజముఖ్యవృక్షచరసం • ఘాతంబుతో రాముఁడు
ద్యద్యాదోధి తటస్థుఁ డయ్యె నని పీ • తోత్సాహియై శాంబరీ
విద్యన్ వారలఁ జిక్కుసేయఁ గ్రతుభు • గ్విద్వేషి నీలాంగఫూ
ర్వద్యోసంచరపఙ్క్తు లంపె నను తే • వం బర్వెఁ బెంజీఁకటుల్.

శా. వేలాసంస్థితుఁ డైనరాఘవవిభున్ • వీక్షింప దేవాంగనల్
పౌలోమీధవనీలజాలఖచిత • ప్రాసాదకుడ్యంబులన్
బోలన్ సోరణగండ్లు ద్రవ్వి ముకురం • పుంబిళ్లలందందులన్

వాలాయంబుగ నిల్పిరో యనఁగఁగ • న్పొక్కెఁ దపింద రేకల్.

క. సకలహరిద్వ్యాప్తభయా
నకగాఢధ్వాంతమత్త • నాగాధిపము
స్తకవిన్యస్తామలవ
జ్రకృతాంకుశ మనఁగఁ • జదలశశధరుఁ డొప్పెన్. 14

వ. అంత. 15

క. చారులచే రఘువీరులు
వారిధితీరమునఁ బ్లవగ • వాహినితోడన్
ధీరత డిగి రని విని లం
కారాజు భయానకవ్య • కంపితమతియై. 16

వ. సత్వరంబుగా నొక్కగోపురం బెక్కి. 17

క. వేలారణ్యపరిస్థిత
గోలాంగూలాధినాథ • కోలాహలముల్
వాలెం బాలించి మహాం
దోళితహృదయుఁ డయి గతకు • తూహలవృత్తిన్. 18

వ. సరభసంబుగా సభామండపమునకుం జనుదెంచి. 19

శా. ఆస్థానస్థితమంత్రిబంధుసుతసై • న్యాధీశులం జూచి ధై
ర్యస్థైర్యంబులు మీఱ మీ రరసికా • ర్యాలోచనల్ సంగర
ప్రస్థానంబు దొలంగునట్లుగ రిపుల్ • రాకుండునట్లు న్నితాం
తాస్థం జేయుఁ డటన్న వారలు సము • ద్యద్గర్వసంఛన్నులై.

ఉ. ఉష్ణసుధామయూఖుల ని • జోద్యదనుజ్ఞఁ జరింపఁ జేయ వే

కృష్ణగళాగ మెత్తవె ధనేశుజయింపవె కింకరాళిగా
జిష్ణుముఖామృతాశనులఁ జేయవె యీగతి బాహుసత్వవ
ర్ధిష్ణుఁడ వైననీ కిపుడు దీనత యేటికి రాక్షసేశ్వరా. 21

ఉ. రాఘవు లెంతవారు కపిరా జన నెంతటివాఁడు దక్కకీ
శౌఘము లెంత దానవసుధాశనకిన్నరసిద్ధసాధ్యసం
శ్లాఘనవిక్రమంబులఁ జెలంగెదుమ మ్మనుపన్ భయానకా
మోఘశిలీముఖంబులను ముంతుము ద్రుంతుము చింతు
[మెంతయున్. 22

గీ. అన విభీషణుఁ డపుడు కట్టల్క నిట్టి
వెడఁగునుడువుల రిపులు చేట్పడిరె చాలుఁ
గపి యొకటి వచ్చి పుర మెల్లఁ గాల్చువేళ
నచట నుంటిరి సిగ్గుగా దేమి మీకు. 23

మ. అని వారిం జెడనాడి యగ్రజుమొగంబై వీరవీరోక్తులన్
మనకార్యంబులు చక్కనౌ నెదశకంఠాధర్మవాక్యంబిఁకన్
విను మవ్వానరులున్ రఘుప్రవరులు న్విచ్ఛేయకుండంగ భూ
తనయం గ్రమ్మఱ నిమ్మం బలుకకోం తన్ లేచిపో యెన్ వడిన్.

వ. అంత మఱునాఁడు విభీషణుండు సభామండపంబున సింహాస
నాసీనుండై యున్నయన్నకడకుం జనుదెంచి నమస్కారపూ
ర్వకంబుగాఁ బూర్వగీర్వాణసార్వభౌముసందర్శనంబు గావిం
చి తదభ్యనుజ్ఞఁ గల్పితప్రకీర్ణసువర్ణపీఠికాసముదీర్ణుం డగుకుంభక
ర్ణునకు నతిభక్తి నతి యొనర్చి తత్తదాజ్ఞ నర్హాసనంబునంగూ

ర్పుండై నప్పు డప్పఙ్క్తికంఠుండు కృతోత్కంఠుండై ప్రసం
గవశంబున. 25

క. జిఘ్రుమతి నరుగ శూర్పణ
ఖాఘ్రాణశ్రుతులు దెగుట ♦ ఖరుపాటు రఘు
వ్యాఘ్రూంగనఁ దెచ్చుటయును
శీఘ్రముగా వినిచెఁ బనఁటి ♦ చెవులఁబలియుతోఁ. 26

చ. వినిచినఁ గుంభకర్ణు డతి ♦ విస్మితుఁడై దశకంధరా పరాం
గన నెఁయం దలంచుట య ♦ ఘంబు జగంబున కంబయైనరా
మునిసతిఁ బొందఁగోరుదురె ♦ మున్నుగ దైత్యులసంహరించిని
న్ననిఁదనుమాడఁడేరఘుకు ♦ లాధిపుఁడారయమర్త్యమాత్రుఁడే

క. నిన్నన్న నేమి యున్నది
మున్నన్నలినాసనుండు ♦ మువ్వురుస లిఖిం
చె న్నన్నొసల న్మఱిగా
కున్న న్నీకిట్టిబుద్ధి ♦ యుదయించునొకో. 28

వ. అని పలికి యగ్రజుమొగంబుఁ జూచి తనవచనంబులకుఁ గో
పోద్దీపితహృదయుం డగుట యెఱింగి క్రమ్మఱ నతనికి శ్రవణా
నందంబుగా నిజవిక్రమాటోపం బేర్పడ నిట్లనియె. 29

క. మద్భుజవీర్యము మెఱయ జ
గద్భయదంబుగ రణోర్విఁ ♦ గాకుత్థ్సుల న
త్యద్భుతముగఁ ద్రుంచి ఖరాం
శూద్భవముఖకపుల మెసవి ♦ యొప్పెద బలిమిన్. 30

వ. అని యఖర్వగర్వసంఘన్నుండై మహోత్సాహంబునం బలు
కుచున్నంత. 31

గీ. పసఁటిపేనుల రాకాసి ♦ పలుకు లలుక
నాలకించి విభీషణుం ♦ డలుకు లేక
యూరుచౌవంచ మొగముల ♦ పేరిసోఁకు
మూఁకదొరఁ జూచి పల్కెఁ జీ ♦ కాకు నొంది. 32

క. ప్రముచ్చిలి రఘువరుదేవిం
దెచ్చినయటఁ గోలె పీటఁ ♦ దీఱని దోసఁగుల్
విచ్చలవిడిఁ బుట్టెం జుమి
చెచ్చెర నపరాధి ననును ♦ శీలము వెలయన్. 33

గీ. మానవతి నిమ్ము యతఁడన ♦ మానబలుఁడు
మానవేశుండు సత్కృపా ♦ మానసుండు
మాననీయుండు నీయను ♦ మాన మేల
మానఁ దగు వైర మాలింపు ♦ మా సమోక్తి. 34

క. ఈకరణి నివుడు వేఁడిన
నేకీడును రాము మీఁద ♦ నిటకు మిగిలినన్
వీఁకం జెయిసెకఁ జెందిన
నాకులు చెమ్మన్నరీతి ♦ యమరారాతీ. 35

ఉ. తోఁకను జుట్టువెట్టికొని ♦ తోయధిలోపలఁ బెక్కుమార్లు నిఁకా
వీఁకను ముంచినట్టిహరి ♦ వీరుసురేంద్రతనూజుఁ దుర్రించి యా
చీఁకటిగొంగపట్టెఁ గపి ♦ సేనకు రాజును జేసెఁ గాన బల్

తేఁకువ రాముతోడఁ బగఁ ♦ దెచ్చుకొనం దగదంచుఁ జెప్పినన్.

వ. ఇంద్రజిత్తుం డప్పుడు లాంగూలసంఘట్టనసముద్భూతక్రోధ ప్రపూరితాంతరంగముక్తకంచుకకరాళకాలవ్యాళ భూత్కా రంబుపోలికను హుంకారంబు సేయుచు విభీషణుం జూచి ప రిభవవ్యాహారంబుల నిట్లనియె. 37

ఉ. పందవు గాన నీవిటు వి♦పక్షులు దక్షు లటంచుఁ బల్కె మ
మ్మందఱుఁదూలనాడినభ♦యం బెదఁ బుట్టునె పోర మున్ను సం
క్రందనుఁ గెల్చినట్టియతి♦గాఢభుజాబలశాలి నైననా
ముందర మర్త్యులంగపిస♦మూహములం గొనియాడఁ బాడియే.

క. ఇంటిబలంబును దెగడుచు
నొంటమివారలను బొగడు ♦ చుంటయు వింటే
కంటిమి యిటుఁ గుసి గుద్దలి
నంటిన వనమొల్లఁ జెఱుచు ♦ నంటకు గుతిగాన్. 39

మ. అని దైత్యాధిపునగ్రసూతి పరిభా♦వాలాపముల్ పల్కె నం
తనె దేవాంతక శోణితాక్ష వికటో♦న్మత్తప్రహ స్తాసిరో
మ నికుంభాది సురారిసైన్యపతు లా♦త్మస్వామికిం బ్రీతిగాఁ
గినుకం బల్కె రట న్విభీషణు నధి♦క్షేపోక్తు లొక్కుమ్మడిన్.

మత్తకోకిల.

ముజ్జగంబులు గెల్చె వాసవు♦మోసపుచ్చె దురంబులో
గుజ్జువేలుపుఁదండ్రి కెల్లగు♦కొండ యెత్తెను జాలువా
బొజ్జసామికొలంబునందునఁ ♦ బుట్టినట్టిసురారితో

నొజ్జరీతిని బజ్జఁ జేరి దు♦రోక్తులాడఁగఁ బాడియే. 41

వ. అనిన నవ్విభీషణుండు. 42

ఉ. నాన యొకింత లేక తగు♦ నా నయశాలులయట్లు పల్కఁగా
నాన యటున్న దీపతికి♦నానదు వీనులయందు మున్నె నే
నానలినాననన్ మరల♦నానరనాథున కిమ్మటన్న నా
నానతరక్షు వేఁదుఱుత♦నాన నలంతిగఁ జూడఁబాడియే. 43

మ. అని సైన్యేశుల ధిక్కరించి దనుజా♦ధ్యక్షుం బరీక్షించి రా
మనృపాలాగ్రణిసత్వ మీ వెఱుఁగవే♦మారీచుఁ జక్కాడె శూ
ర్పణఖన్ మున్నె విరూపిఁ జేసె ఖరుఁ బో♦రంగిటణంగించెఁగా
విను మట్లే చెడనేల ప్రోచునిను ను♦ర్వీపుత్రి నర్పించినన్.

క. శిష్టజనరక్షకుండును
దుష్టధ్వంసకుఁడు గానఁ ♦ దొలుతను నీదు
శ్చేష్టలు విడిచియు రామున
కిష్టముగా సీత నొసఁగు ♦ మిటుగా కున్నన్. 45

ఉ. వేఁడివెలుంగువంగడపు♦వీరునివి ల్కడలిం జనించు పె
న్వాఁడిలకోరి గాలిచెలి♦వావిరి రక్కసిమ్రాఁకుమూఁకతోఁ
గూడినలంక యన్ వెడఁద♦కోన దహింపకయున్న యక్కటా!
వేఁడుము మామకోక్తి విని♦వేరము మానుమునీవునావుడున్.

క. ఇచ్ఛ గలదేని మదిని భ
వచ్చరణమునందుఁ బొగడ ♦ వలెఁ గాక సభన్
దుచ్ఛోక్తు లేల ప్రేలెదు

మచ్ఛక్తి యెఱుంగలేవు ♦ మతకరి వగుటన్. 47

క. పొంగుచు వెంగళివలె నా
ముంగల రఘుపుంగవులను ♦ మురియుచుఁ బల్కా
రుం గొనియాడెద విఁక నా
కుం గూడదు నోరుమూసి ♦ కొనుము సహింపన్. 48

వ. అనిన విభీషణుండు. 49

ఉ. నే నిపు డెన్నిభంగులను ♦ నీ కిటు తెల్పినఁ జీమకుట్టిన
ట్లైన ను గాక యుండె నిఁక ♦ నారఘువీరునిశాతఘోరబా
ణానలకీలలన్ మిడుతయట్లు ♦ లడంగఁగ నీకుఁ దోయురు
ద్యోని లిఖించెఁ బూర్వకృత ♦ యోగము తప్పునె యెట్టివారికిన్.

వ. అని హితోక్తులు పెక్కుభంగులం బోధించినం బరాఙ్ముఖుం
డగుటకుం గోపించి. 51

సీ. వెండియు నిట్లను ♦ వివిధభూషణమణి
ప్రకరముల్ కాన్కలు ♦ పట్టి నీవు
మనఁగఁ గోరితివేని ♦ మహిసుత నర్పించి
విశ్వేశు రఘువీరు ♦ వేఁడుకొనుము
నావుడుఁ బఙ్క్తికం ♦ ధరుఁ డాగ్రహోగ్రుఁడై
మెఱుఁగారుకరవాల ♦ మొఱను బెఱికి
కేలఁ గీలించుచు ♦ క్షితి తల్లడిల్లంగ
దిగ్గన గద్దియ ♦ డిగ్గ నుఱికి
త్రోచి పడఁద్రోచి కొఱకొఱఁ ♦ జూచి యిచట

లేచిపొ మ్మింకఁ బ్రాణముల్ • గాచికొనుచు
ననిన నివ్వెరపడి వాని • యపరిమితనృ
శంసతకుఁ జాలఁ జింతించి • చనఁ దలంచి. 52

శా. అన్నాలోకహితాన్వయేశ్వరునిబా•హాశక్తిసామాన్యమే
యన్నా! యెన్నివిధంబులన్నమిదుపా•యంబేయపాయంబునీ
కన్నా! కూడ దటన్న నాఫలము ల•భ్యంబయ్యె నీచెల్మి సే
య న్నాకుం బని లేదటంచు నునిజా•ప్తామాత్యసంయుక్తుఁడై.

పంచచామరము.

విభీషణుం డహంకరించి • వేది డిగ్గి నిల్చి యా
సభాసదుల్ వినంగ నగ్ర • జన్ముతో ననెన్ జగ
త్ప్రభున్ శరణ్యునిన్ దయాంబు • రాశి భక్తవత్సలున్
బ్రభాకరాన్వయేశు రామ • భద్రుఁ గొల్వ నేగెదన్. 54

క. అని డిగ్గున సభ వెల్వడి
చని జననికి విన్నవించి • జనయిత్రిని పీ
డ్కొని వేగమె గగనపథం
బున నరుదేరంగఁ దపన • పుత్త్రుం డచటన్. 55

క. కని వారిఁ బత్త్రికంఠుఁడు
పనిచినదూత లని తలఁచి • ప్లవగభటులకున్
గినుకం జూపి వధింపుం
డని పలుక విభీషణుఁడు భ • యాతురుఁ డగుచున్. 56

చ. వనచరవీరులార దశ•వక్త్రునకుం దగ నీతి చెప్పఁ బో

యునఁ గడు నల్గి తన్నె వినుఁ◆డింక విభీషణుఁడన్ సురారి కే
ననుజుఁడఁ గాన భీరుఁడ మ◆హాత్ముశరణ్యుని విశ్వవంద్యుఁ బా
వను రఘువీరునిం గొలువ ◆ వచ్చితిఁ దెల్పరె? నన్నుఁ గావరే?

మానినీవృత్తము.

నావుడు భాస్కరనందనముఖ్యులు◆నమ్మకయా రఘునాథునితో
భావమునం దలఁపంగ నిజంబు వి◆పన్నుఁడు గాఁడతిపాపులు మా
యావులు దానవు లాదరణంబున◆కర్హులు గా రన నయ్యెడ న
ప్పావని యాతఁడు భక్తుఁడె యంచు నృ◆పాలున కేర్పఱుపం
[గృపతోన్. 58

ఉ. వీఁడె విభీషణుండు వడి◆నీడకుఁ దోడ్కొని రండు భీరుఁడై
వేఁడినఁ బ్రోవకుంట తగ◆వే మఱి యాతఁడె కాదు నెమ్మదిన్
సూఁడు దలంతు నే శరణుఁ◆జొచ్చిన రావణునైనఁ బ్రోచెదన్
వాఁడి యడంగి పోవుమని◆నన్ రఘువంశ్యులు ప్రోవ రేతగన్.

వ. అని పలుకు రఘువరు పలుకుల కపరిమితానందంబు నొంది. 60

క. విద్వక తెచ్చిన సరసీ
రుడ్విభుతనయాదికపివ ◆ రుల్ వేగ తురా
షాడ్వైరిసోదరున్ గ్రహ
రాడ్వంశ్యునిమ్రోల నిలుపఁ ◆ బ్రమదం బొదవన్. 61

వ. రఘువీరునకు సాష్టాంగదండప్రణామం బాచరించి విభీషణుం
డిట్లనియె. 62

ఉ. దేవ భవత్కటాక్షశుభ◆దృష్టికిఁ బాత్రుఁడనైతి నెంతయుం

దావకపాదపద్మముల ♦ దర్శన మబ్బెఁ గృతార్థి నింక నీ
సేవకుఁ గాఁగఁ బ్రోవు మనఁ ♦ జిత్తమునన్ ముదమందినీవిఁకన్
రావణువిక్రమంబు నను ♦ రవ్రిజదర్పము తెల్పవే యనన్. 63

మ. సమరాభీలునిఁ బఙ్క్తికంఠుఁ దెలుపన్ ♦ శక్యంబె తత్సోదరుం
డమితోద్యద్భుజదర్పశాలి ఘటక ♦ ర్ణాఖ్యుం డజేయుండు వి
క్రమసంపూర్ణుఁడు మేఘనాదుఁ డనిదు ♦ ర్వారుండు సేనాధిప
ప్రముఖుం డైనప్రహస్తు గెల్వఁగలరే ♦ బ్రహ్మాదులాలంబునన్.

క. తక్కినరక్కసిగములం
జక్కలదొరదారి తేరి ♦ చూడఁగలఁడె? నీ
కొక్కనికిఁ గాక యొరులకుఁ
జక్కాడఁగ నిక్కువముగ ♦ శక్యమె యనినన్. 65

క. పాలించెద నినుఁ జెలిగా
నేలించెద లంక కీవె ♦ యేలిక గాఁగన్
గాలించెదఁ గనుఁబ్రాషినఁ
గూలించెద వాని దనుజ ♦ కోటులతోడన్. 66

గీ. అని విభీషణుఁ జేపట్టి ♦ యనుజుఁ జూచి
భ్రాతృలంకాపురీరాజ్య ♦ పదవి కితని
నోసర నభిషిక్తు వెసఁజేయు ♦ మనిన నటులె
చేసె సురదుందుభులు మింట ♦ మ్రోసె నంత. 67

గీ. ప్రొద్దుకొమరుండు కరువలి ♦ ముద్దుపట్టి
యును విభీషణుననుమతిఁ ♦ గొని రఘూద్వ

హుని సరిద్వరలంఘనం • బునకుఁ బ్రీతి
వార్ధిఁ బ్రార్థింపవలె నన్నఁ • బార్థివుండు. 68

వ. రమణీయం బగు నొక్కవాలుకాతలంబున దర్భశయనంబున సముద్రప్రార్థనాయత్తచిత్తుండై నితాంతనిష్ఠ నుండె నంత లంకాపట్టణంబున శార్దూలుం డనువేగువాఁ డొక్కరుండు వచ్చి వానరవాహిని కలయం గనుంగొని చని దనుజవల్లభుని సందర్శనంబు యథోచితవిధిఁ గావించి విభీషణుండు యాతుధానరాజ్యాధినాథుండగుటయు దైత్యసంహారంబు సేయుదు నని రామచంద్రుండు ప్రతిజ్ఞ సేయుటయు సుగ్రీవాంగదప్రముఖవలీముఖసైన్యంబు సమరసన్నద్ధంబై యుండుటయు మొదలగుసమస్తవృత్తాంతంబు విన్నవింప నతికుపితుండై కొంతతడవు విచారించి భేదోపాయంబు దలంచి యొక్కదూతం బిలిచి యిట్లనియె. 69

మ. శుక నీ వేగి వృథా విరోధ మిటులో • సుగ్రీవ మారాజుతో
నొకమర్త్యార్థముఁ గూడి నీకుఁ దగునే • యూహించిరమ్మన్నులం
కకుఁ దోఁబుట్టువు గావె రావణునకుం • గాదేని కిష్కింధ క
ర్కకులాధీశునిఁ బాసి పొమ్మనుము స • ఖ్యంబేని నా మారుగాఁ.

క. కాదేనియు లంకాపుట
భేదన మగచరులు నరులు • భేదింపంగా
రా దిఁకఁ జంపెద మను మీ
మీఁదటి పని తెలుఁగుఁ గాంతు • మిక్కిలిమైనన్. 71

గీ. అన శుకుండు కీరమై చని ♦ యగచరేశుఁ
గాంచి రావణుఁ డన్నవా ♦ క్యములు వినిచి
మఱల రవిజాజ్ఞ మర్కటుల్ ♦ పఱచి వానిఁ
బట్టి కట్టల్కఁ గొట్టిన ♦ నిట్టు లనియె. 72

క. పడ మొత్తి రయా రామా
వడిఁ గరుణం జూచి వీరి ♦ వల దని నన్నున్
విడిపింపుము దూత ననన్
గడఁకన్ విడిపించి చనుము ♦ క్రన్నన ననినన్. 73

క. గగనపథంబున కుద్ధతి
నెగసి నిలిచి రవిజుఁ జూచి ♦ యే మనవలె మా
దుగచౌవంచ మొగంబుల
మగనికి మార్త్యాటఁ జెప్పుమా ♦ చనెద ననన్. 74

మ. సయిదోడైనను వాలిఁబోలుననుమీ ♦ క్ష్మాపుత్త్రికం దెచ్చుటన్
వ్యయ మొందున్ దనుజాళి నిక్క మనుమీ ♦ యాదోధి
[లంఘించి వ
న్నియమీఱన్ వెసలంకఁ గెల్తుమనుమీ ♦ నీవింకఁబోపొమ్మనన్
రయమారం జని తెల్పెనంతయుసురా ♦ రాతీశుతో నంతటన్.

పంచచామరము.

జనాధినాథుఁ డట్లు దర్భ ♦ శయ్యపై మహోగ్రతన్
వినమ్రతయుంబు నిష్ఠనుండి ♦ తేరి చూచి యంతకున్
ధునీశుఁ డప్రసన్నుఁడయ్యె ♦ ధూర్తుఁ డౌట మచ్ఛరా

ననంబుఁ దెమ్ము వీనిఁద్రుళ్లు ♦ సంహరింతు లక్ష్మణా! 76

మ. అని విల్లందుక యెక్కు వెట్టి చటుల♦జ్యావల్లికోద్భూతభీ
ష్మనినాదార్భటి విష్టపత్రయము కం♦పంబొందఁ బేరల్కతో
ననలాస్త్రాదిమహోగ్రమార్గణము లే♦యన్ సింధుమధ్యస్థజం
తునికాయంబులు చూర్ణమై జలధి తో♦డ్తోమండఁగాఁ జొ
[చ్చినన్.77

గీ. అగ్రజుని జూచి లక్ష్మణుం ♦ డనియె దేవ!
యింతయాగ్రహమున కితఁ ♦ డెంతవాఁడు
నీకృపకుఁ బాత్రుఁ డదియును ♦ గాక మనకు
హితుఁడు భృత్యుఁడు కరుణింప ♦ వే మహాత్మ! 78

వ. అని సుమిత్రాపుత్త్రుండు పెక్కువిధంబులం బ్రార్థించినం
గౌసల్యానందనుండు. 79

క. అప్పటికి శాంతి నొందక
గుప్పన బ్రహ్మాస్త్రమందు ♦ గొని యరిఁ బోయన్
దప్పెను దరణీందుగతుల్
గప్పెను దమ మవని వడఁకెఁ ♦ గదలెఁ గులగిరుల్. 80

గీ. అప్పు డతిభీతి జహ్ను క ♦ న్యాదిపుణ్య
నదులతో మేనఁ దూఁటులు ♦ వొడల రక్త
ధార లొలుకంగఁ గేల్దోయిఁ ♦ దద్ద మొగిచి
వార్ధి యేతెంచె నారఘు ♦ స్వామికడకు. 81

క. ఏతెంచి రాముపాదా

జ్ఞాతంబుల కొలిగి మ్రొక్కి ♦ సమ్యగ్భక్తిన్
బ్రీతి వొడమ సామోక్తుల
నాతతదైన్యంబు దోఁప ♦ నతఁ డిట్లనియెన్. 82

గీ. దేవ యొకకొంతఁ [illegible] మ ♦ థించి తేని
నాదుపట్టిని నీ కిచ్చి ♦ నాఁటినుండి
కడుపులోఁ బెట్టుకొంటివి ♦ గాదె మున్ను
మిమ్ము మఱతునె నేను ఋ ♦ మింపు మీఁకను. 83

క. శ్రీరామచంద్ర నీకుఁ గు
మారిక యగుఁగాదె నాదు ♦ మానిని యీభా
గీరథిని జూచి నైనను
గూరిమి మనుపఁగదె కినుక ♦ కుం బాత్రుఁడనే. 84

చ. కొఱకొఱ మాని నాపయిని ♦ గొబ్బున నీనలునిన్ నగాళిచేఁ
బఱపుగ గట్టు కట్టుటకుఁ ♦ బంపవె యీవెనుముల్కి వేగను
క్కఱుగఁగ దృశ్యగుల్మముస ♦ నస్మదరుల్ గల రెంచి వారిపైఁ
బఱపి వధింపవే యన నృ ♦ పాలకుఁ డట్టులె చల్పి పిమ్మటన్.

క. వినుమానికంబుపట్టిని
గనుఁగొని నీ వింక గట్టు ♦ కట్టును నలుఁడి
వ్వననిధి చెప్పినకరణిన్
వనచరులను బనుపు గిరులు ♦ వడిఁ దెచ్చుటకున్. 86

క. నావుడు మద మందుచు రా
జీవాప్తసుతుండు ప్లవగ ♦ సేనాధిపులన్

రావించి మీఁరు సేతువు
గావింపఁగఁ దరులు గిరులు ♦ కడుఁ దెమ్మనుడున్. 87

గీ. జాంబవద్గంధవహపుత్త్ర ♦ శరభనీల
దధిముఖాంగదగంధమా ♦ దనసుషేణ
మైందకేసరివిందాను ♦ విందముఖ్య
భూధరాటనపృతనాధి ♦ నాథు లపుడు. 88

ఉ. లెక్కకు మిక్కిలయ్యెడువ ♦ లీముఖకోటులఁగూడియార్పులన్
జుక్కలత్రోవ వ్రిక్కటిల ♦ క్షోణిచలింపఁగదిక్కులన్నియున్
గ్రక్కున నొక్కపెట్టుగను ♦ గ్రమ్ముక నుక్కున వేఱువేఱ నొ
క్కొక్కఁడు పెక్కుకొండలొక ♦ యుర్విధరంబున నేకకీశులున్.

ఉ. తోఁకలఁ జుట్టుచుం దలల ♦ దొంతులు వెట్టుచు నొక్కఁ డొ[క్కొగిన్
గూఁకలు వైచుచున్ నడుమ ♦ గొబ్బునగుబ్బలులందిపుచ్చుచున్
దేఁకువ మీఱ నొక్కపెనుఁ దిప్పఁ బెకల్చుచునూఁచిచూచి బ
ల్డాకను మ్రోఁకు లెల్లఁ బడ ♦ లాగుచు మూఁపులఁ బెట్టి [మోయుచున్. 90

ఉ. తెచ్చిన నత్తఱి న్నలుఁడు ♦ తేరి కనుంగొని రాఘవేశ్వరుం
డిచ్చినయాజ్ఞఁ గైకొని ధు ♦ నీశుననుజ్ఞను విశ్వకర్మకున్
హెచ్చిన భక్తి మ్రొక్కి మఱి ♦ యీప్సితదేవతలన్ గణేశువా
కుఱిచ్చి నమోనమోయనుచు ♦ గొబ్బునగుబ్బలి వైచెనంబుధిన్

క. వేఱియు రసాతలమునకుం

బోయి వెసం దేలి జలధిఁ ♦ బొడకట్టెఁ దదీ
యాయతసత్త్వమునకు నో
హో యని కపు లెల్లనార్చి ♦ రుత్సుకత దగన్. 92

మ. పిదపన్ ధారణిలోనఁ గల్గినమహీ ♦ భృత్సాలపాషాణముల్
పదులున్నూఱులు వేలులక్షలును వా♦లాయంబువాలంబులన్
బదహస్తంబులమూఁపులన్ శిరములన్ ♦ బంధించికీశౌఘముల్
మదమొప్పన్ వెసఁదెచ్చియీయవలకే♦లండాకయింగైకొనన్

సీ. పృథులశీతనగంబు ♦ పెకలించి తెచ్చినఁ
బగలు దీఱనివణం ♦ కగు నటంచు
హాటకాహార్యంబు ♦ మీటించి తెచ్చిన
లేఖకోటుల కిమ్ము ♦ లే దటంచుఁ
గైలాసశైలంబుఁ ♦ గదలించి తెచ్చిన
భూతేశుఁ డుగ్రతఁ ♦ బూను నంచు
మందరగ్రావంబు ♦ బంధించి తెచ్చినఁ
దొలుతరీతి మథింపఁ ♦ గల దటంచుఁ
గడమకులగోత్రచరితముల్ ♦ గణనగొనక
నుదయచరమగిరీంద్రముల్ ♦ మొదలవిడిచి
మఱియుఁ గలకొండ లెల్ల నే ♦ మఱక తెచ్చి
నలున కొప్పించి నేతువా ♦ నర్చి రపుడు. 94

క. పదునాలు గిరువదా ఱేఁ
బది పదియామడలు గాఁగ ♦ బంధించిరి స

మ్మదమున నూఱామడయును
వదలక నలుదివసములకు ♦ వరుసం బ్లవగుల్. 59

ఉ. అంత నలుండు రాఘవున ♦ కంతయుఁ దెల్పిన నీలుఁ జూచి నీ
వెంతయు సేన సేతువుప ♦ యిన్ నడిపింపు మటంచుఁ జెప్పియు
న్నొంతకు నెక్కె తాఁ గదలె ♦ నంగదుపై ననుజుండు రావెసం
జెంత విభీషణార్కజులు ♦ సేనలముంగల నేగ నయ్యెడన్. 96

సీ. ధృతి విచ్చు మతి వచ్చు ♦ సతిఁ దెచ్చుఁ బతి కిచ్చు
నల ముచ్చ్రయని మెచ్చుఁ ♦ బలుకువారుఁ
దగు కింక నొగిలంక ♦ సొగ సింక జిగి గ్రుంక
నగువంక నిజ మింక ♦ ననెడువారు
మనగండు పెనుదండు ♦ దనుజుండు గని యొండు
పని మెండుకొనకుండు ♦ ననెడువారుఁ
దొలివేలుపులపోలు ♦ పుల నేలుఖలశీలు
నిలు గూలు నని మేలుఁ ♦ బలుకువారు
గట్టుగ గట్టెడుతటిఁ గొన్ని ♦ గట్లు మునిఁగెఁ
దెత్తు మిత్తటి ననుచుఁ బం ♦ దెములు వైచి
నుదధి గుభెలు గుభేల్లున ♦ నుఱికి యోల
లాడుచుండెడువారు నై ♦ రద్రిచరులు. 97

క. ఈరీతిం గౌతూహల
మారన్ వారాశిమీఁద ♦ నవనీభృత్సం
చారచమూపులు మూఁపుల

వారిధి నెగఁబొంగఁ జనిరి ♦ వసుధేశ్వరుతోన్. 98

వ. ఇట్లు ఖర్వగర్వపూర్వకంబుగాఁ బూర్వగీర్వాణసార్వభౌమునధి
క్షేపించుచుఁ దనవెంట నరుదెంచువానరవాహినిం గలయం
గనుంగొనుచు నత్యంతసంతోషంబునం జని చని రఘువరుండు

క. ఆలోకించెను దాలర
సాలతమాలామ్లసరళ ♦ సాలాదిమహా
సాలావృతాబ్ధిదక్షిణ
వేలాభ్యర్ణోజ్జ్వలత్సు ♦ వేలాచలమున్. 100

ఉ. కాంచి తదీయశృంగకట♦కంబుల సైన్యము నిల్వఁగా నియో
గించి రఘూద్వహుండు తటఁ♦గీశులుగొల్వఁగనుండెనంతరా
త్రించరనాథుఁ డావిధ మె♦ఱింగి యమాత్యులఁ జూచి కా
[ర్యమున్
మించెను వానరుల్ నరులు♦నీరధిఁ గట్టిరి వింటిరే పురే! 101

చ. అనవుడు మేఘనాదుఁడు మ♦హాగ్రహుఁడై రజతాద్రి నెత్తి శ్రీ
దునిఁ గడకొత్తి నిర్జరులఁ♦దోలి పురందరు ధిక్కరించి త
క్కినదిగధీశులం గెలిచి♦కీర్తిఁ జెలంగిననీకు నింత ని
మ్మనమునఁ జింత యేటికిఁ గు♦మారులుమంత్రులుసేనగల్గఁగన్

చ. ఇది మనకెంతలాఘవ మ♦హీనపరాక్రమ ము నన్నుఁ బంపినన్
జదిపెద మర్త్యులం బ్లవగ♦సైన్యములన్ వెస నన్న నంత బ
ల్లిదుఁడు ప్రహస్తుఁ డిప్పలుకు♦లే తగు నంచు నజేంద్రము
[ఖ్యులున్

దుదినను నైనగెల్చెదరె • తుత్రించెడమంతయుఁ జింతయేటికిన్.

గీ. అన మహోదరుఁ డాగ్రహం • బున దశాస్యుఁ
గని రఘూద్వహు ననిఁ గెల్వ • మనెడుబుద్ధి
లేల క్రమ్మఱ నయ్యమ్మ • నిమ్మటన్నఁ
జెంత వినుచున్న యతికాయుఁ • డంతలోన. 104

ఉ. ఏల వృథావిరోధము సు • రేశ్వర సామముతోడ రామభూ
పాలున కిప్పు డప్పుడమి • పట్టిని గ్రమ్మఱ నిచ్చి పుచ్చుటే
మేలగుఁగాక యిట్లు చెడు • మేరతలంపు జయంబు గాదు నీ
వాలము చేసి గెల్తునన • నాతఁడు కేవలమర్త్యమాత్రుఁడే.

శా. ఇక్ష్వాకాన్వయపత్నిచాపదళనో • త్కృష్టోగ్రదోస్సారు న
య్యిక్ష్వాక్వన్వయు నల్పుఁగాఁదలఁచినీ • వెంతేనియున్ శాంబరీ
భిక్షాకారము పూని జానకిని ని • ర్భీకుండవై తెచ్చి త
ద్యోగ్యాక్ష్వేళంబు భుజింపఁ గోరుటచుమీ • యూహింపు మా
[త్మం గదున్. 106

క. సీతను గ్రమ్మఱ రాము
క్ష్మాతలపతి కిచ్చి నీవు • మనుమన నీదు
ర్నీతి విడ దే మహో చెడు
హేతువుగాఁబోలు నింక • నే నే మందున్. 107

క. చెప్పితిని బిడాలమునకు
ముప్పున నడినెత్తి పైఁ జ • మురువడుటచుమీ
నిప్పు లొడిఁ గట్టుకొను టగుఁ

దప్పదు నామాట వినుము ♦ దానవనాథా! 108

క. అన నలిగి దనుజపతి గొ
బ్బున శుకసారణులఁ బిలిచి ♦ భూపతిపంతం
బును గపిసైన్యము వెంపును
వననిధి దాఁటినవిధంబు ♦ వారిబలంబుల్.  109

సీ. వలనొప్పఁ గైతన ♦ వనచరరూపముల్
ధరియించి మీ రతి ♦ త్వరితగతిని
గపిసేన సొత్తెంచి ♦ కలయ నిరీక్షించి
ప్రత్యయ మొంచి కా ♦ ర్యము తలంచి
క్రమ్మఱఁ జనుదెంచి ♦ కలరూపు వినిపించి
తివిరి మాయక్కుఱఁ ♦ దీర్పఁ దనినఁ
బనివిని వా రట్లు ♦ పరికించుచుండంగ
నంతటఁబజ్జ్యుకం ♦ తానుజుండు
గాంచి మిథ్యాప్లవంగమా ♦ కారు లైన
రావణునిదూత లనుచు నే ♦ ర్పాటొనర్చి
పట్టి కట్టల్కు ధట్టించి ♦ కట్టి రాము
నెదుటఁ బెట్టించి యాచంద ♦ మెఱుఁగఁ జేసె.  110

గీ. అంత నాదూత లతిభయ ♦ స్వాంతు లగుచుఁ
గేల్మోగిచి దేవ! మారాజు ♦ కీశసేన
పెంపుఁ గలయఁగనుంగొనఁ ♦ బంపె; నేము
వేగువారము కరుణింప ♦ వే మహాత్మ!  111

చ. అన విని నవ్వి రాముఁడు దయార్ద్రత విడిపించి దశాననానుజ
న్మునిఁ గని వీరి కిక్కపిచమూస్థితిసర్వము నిచ్చ దీరఁగాఁ
గనుఁగొనఁ జేసి వేగ దశకంఠున కంత నెఱుంగఁ జేయఁగాఁ
బనుపు మటన్న నట్లనుపఁ బారి దశాస్యునిఁ జేరి నమ్రులై.

సీ. దేవేంద్రభీకర సావధానుండవై
యాలింపుమయ్య నీ యాజ్ఞఁ బడసి
కపటశాఖామృగా కారముల్ ధరియించి
యాసేనఁ గలయంగ నరయుచున్న
తఱిని విభీషణుఁ డెఱిఁగి రఘూద్వహు
మ్రోలఁ బెట్టింపఁ గృ పాళుఁ డగుచు
సమ్మహావీరుండు మమ్ము విడిచి పంప
వచ్చితి మంతయు నిచ్చఁదీర
మున్నె కన్గొంటి మది నీకు విన్నవింతు
మస్త్రకౌశలమునను బా హాబలమున
నధికదయ రామునకు సాటి యైనశూరుఁ
డవనిఁ గనరాఁడు లక్ష్మణుం డంతవాఁడు. 113

గీ. తపనసుతుఁ డమేయ దర్పోజ్జ్వలుఁడు వానిఁ
దెలుపనేల నీల నలసుషేణ
జాంబవత్సమీర సంభవాంగదమైంద
ముఖులు ప్రళయరుద్ర మూర్తు లనిని. 114

క. దశదశయోజనదీర్ఘము

దశయోజనవిశ్రుతముగఁ ♦ దగ సేతువుఁ గ
ట్టి శిఖరిచరసైన్యం బదె
కుశధి తరించియు సువేల ♦ కుధరముఁ జెందెన్. 115

గీ. తద్బలము రాఘవార్యమో ♦ ద్భవవిభీష
ణాభిరక్షిత మగుచు సు ♦ రాసురాదు
లకు నజేయంబు గాన బా ♦ నకి నొసంగి
మనుము పగ వల దనవుడుఁ ♦ గినుక సతఁడు. 116

క. మిక్కిలి పొడ వగుసౌధం
బెక్కియు సారణుని బిలిచి ♦ యీకపిబలమం
దొక్కొక్కని పేర్వేరం
జక్కఁగఁ జెప్పు మన నవె ద ♦ శగ్రీవునితోన్. 117

సీ. సాలసంచరసైన్య ♦ పాలుండు విక్రమ
శీలుఁ డాభీలుండు ♦ నీలుఁ డతఁడు
సంగరాభంగప్ల ♦ వంగమసంగుఁడై
పొంగుచుండెడునతం ♦ డంగదుండు
కులశైలధీరుండు ♦ కలనదుర్వారుండు
జలధిఁ గట్టినవాఁడు ♦ నలుఁ డతండు
కందువల్ పలుకుచు ♦ విందులు గొలువ నా
నందించుపోటరి ♦ మైందుఁ డతఁడు
శ్వేతుఁ డాతండు లోకవి ♦ ఖ్యాతబలుఁడు
దధిముఖుఁ డతండు రణరంగ ♦ మథితరిపుఁడు

కుముదుఁ డాతండు విమతాబ్జ ♦ కుముదహితుఁడు
పనసుఁ డాతండు కంటివే ♦ దనుజనాథ! 118

చ. అతఁడుఘనుండు,రంభుఁడతఁ, ♦డాతఁడు కేసరి, గంధమాదనుం
డతఁడు, గజుం డతండు, మఱి ♦ యాతఁడు వింధుఁ, డతండు [విక్రముం
డతఁడు గదుం, డతండు బలుఁ, డాతఁడు జంఘుఁ, డతండు [ధూమ్రుఁ, డ
ల్లతఁ డనువిందుఁ,డాతఁడుగ ♦ వాక్షుఁడు కంటెనిశాచరాగ్రణీ.

గీ. వినుతగవయుప్రజంఘులు ♦ వేగదర్శి
శతవలిసుషేణశరభులు ♦ పృతనతోడఁ
గాలు ద్రవ్వుచున్నారు ♦ కయ్యమునకు
వారిఁ జూచితె రాక్షస ♦ వంశనాథ! 120

క. ముల్లోకంబుల శూరుల
కెల్లను ముల్లనఁగఁ గోటి ♦ యెలుఁగులు గొలువన్
బల్లిదుఁడై తగు నాతఁడు
భల్లూకవల్లభుఁడు కంటె ♦ పఙ్క్తిగ్రీవా! 121

మ. దనుజాధీశ్వరవానరప్రతతితో ♦ దర్పంబుతో నొప్పుచున్
మునులంకాపురిఁగాల్చియక్షుననిలోఁ ♦ బోకార్చి యొక్కండ గా
వనధిం దాఁటినసత్వశాలి రణదు ♦ ర్వారుండు శ్రీరామచం
ద్రునకున్ నమ్మినబంటు దంటహనుమం ♦ తుండాతనిం జూచితే.

శా. వాలిం గూలఁగఁ జేసి రాఘవుని చే ♦ వాలెంబు కిష్కింధకుం

బోలం దానుగఁబట్టభద్రుఁడయియాస్ఫోటించుచుఁ లంకపై
గోలాంగూలబలంబుతోఁ దొగరుచూ ద్కుల్ సూచునా
[తమ్మిరా
చూలిఁ మేటిబలిం గనుంగొనుమయా సుగ్రీవుఁడిఁ రావణా!

సీ. గాధేయఘనమంత్ర ♦ గాథాప్రబోధన
తత్పరుం డసక్ర ♦ స్నమత్సరుండు
కుండలిమండనో ♦ ద్దండధనుర్దండ
ఖండనుం డమరారి ♦ దండనుండు
వాతాపిజీమూత ♦ వాతర్షిలబ్ధాస్త్ర
జాలకుం డాశ్రిత ♦ పాలకుండు
లేఖనాథకుమార ♦ శాఖామృగేశాబ్జ
సింధురుం డురుకీర్తి ♦ బంధురుండు
సశరకోదండఖలచతు ♦ ర్దశసహస్ర
రాక్షసాధ్యక్షఖరదైత్య ♦ శిక్షకుండు
నందితార్యుండు దశరథ ♦ నందనుండు
రాముఁ డాతఁడు కంటె సు ♦ త్రామభీమ. 124

తే.గీ. కాయ మొక్కటె బంగారు ♦ చాయగాని
శౌర్యగాంభీర్యధైర్యసౌం ♦ దర్యమహిమ
నన్న కెన యగు నాచెంత ♦ నున్నయట్టి
లక్ష్మణాఖ్యుఁ డతండు పౌ ♦ లస్త్యకంటె. 125

గీ. లంకమర్మంబుఁ దెలుపుచు ♦ శంక లేక

మును రఘూద్వహుకారుణ్య ♦ మునఁ జెలంగి
దైత్యరాజ్యాధినాథుఁడై ♦ తనరినట్టి
మనవిభీషణుఁ గంటివె ♦ దనుజనాథ! 126

సీ. ప్రళయదావాగ్నిపి ♦ ల్లలుమనో వేగులు
కల్పాంతరుద్రులు ♦ కామరూపు
లుదుటుబంగరుచాయ ♦ నొప్పనొప్పులకుప్ప
లాలముల్ గెలిచిన ♦ వాలుమగలు
సంవర్తసమయభీ ♦ షణదండధారులు
పగతురసమయింప ♦ బ్రహ్మకాయు
లక్షీణభుజసత్వ ♦ లసహాయశూరులు
నిర్జరవిమతుల ♦ నెత్తిపిడుగు
లుక్కుతునుకలు కడు వన్నె ♦ కెక్కువారు
మేటిమల్లులు మీఱిన ♦ పోటుబంట్లు
దిట్ట లైనట్టియలప్రొద్దు ♦ పట్టిమూల
బలమువారలు గంటివె ♦ పక్షికంఠ! 127

గీ. అనుచు నున్నతెఱం గెల్ల ♦ వినిచి మఱియు
నిట్టు లనె వారితోఁ బోర ♦ నెంతవాఁడ
వీవు మనఁగఁ దలంచితి ♦ వేని పుడమి
పట్టి నిమ్మన్న గినుక నా ♦ పక్షిముఖుఁడు. 128

గీ. కోఁతిరూపులఁ గని జంకి ♦ కులము దక్క
వారిఁ గైవార మొనరించి ♦ భూరిబలుని

నన్ను నిందించి పలుకుట ♦ తిన్నయింటి
కఱదలంచుట యన్నట్టు ♦ లయ్యెఁజుమ్ము. 129
గీ. అరయ నింటికి జ్యేష్ఠయుఁ ♦ బొరుగు కెపుడు
శ్రీమహాలక్ష్మి యనుమాట ♦ సిద్ధమయ్యె
నహహా! యిట లేచి పొమ్మావ ♦ టంచుఁ బలికి
మఱియుఁ దగువారిచే వారి ♦ మర్మ మెల్ల. 130
క. విని కనలి దనుజవీరులఁ
గని మీాసైన్యములతోడఁ ♦ గదనంబునకుం
జనఁ బయనంబై యుండుం
డని యంతఃపురికిఁ జని ర ♦ హస్యము గాఁగన్. 131
క. విద్యుజ్జిహ్వునిఁ గైతవ
విద్యన్ నృపశిరము విల్లు ♦ వెసఁ జేసి యశో
కోద్యానమునకుఁ దెమ్మని
సద్యఃకాలమున నటకుఁ ♦ జన నుత్సుకుఁడై. 132
సీ. ముందెట్టులో యని ♦ సందియ మందుచుఁ
బందరీతిఁ గడింది ♦ డిందుపడుచు
విందులనందఱుఁ ♦ బొందుగావించుచు
నిందుమౌళిపదార ♦ విందములకు
డెందంబులోఁ జాల ♦ వందనం బొసరించు
చందంద మెలఁగుచు ♦ నెందుఁ బొడమ
సందడికులుకుచుఁ ♦ జిందరవందరఁ

పొందుచుఁ గొఱగాని ♦ కొండలంబు
కందళింపఁగఁ గడు నిరా ♦ నందుఁ డగుచుఁ
దుందుడుకుఁ జెంది నూటికిఁ ♦ గ్రిందుఁ గనుచు
మందగతి సేగి పతిఁ బాసి ♦ కుందుపుడమి
కందుఁ గని పల్కె నిక్కపుఁ ♦ జందమునను. 133

ఉ. మైథిలి వింటె రాఘవుఁడు♦మర్కటకోటులతో సువేలధా
త్రీధరమందు నుండఁగను♦దేఁకువ సోకుఁడుమూఁక లెల్ల నా
యోధనమందు వానరుల♦నోర్వఁబ్రహస్తుఁడు రాముఁ ద్రుంచె నీ
నాథుధనుశ్శిరంబు లవె♦నమ్మికకుం గనుమన్న సత్తికిన్.134

గీ. వాఁ డటులు దెచ్చినట్టి దాన ♦ వప్రభుండు
ధరణిసుతమ్రోలఁ బెట్టింపఁ ♦ దద్ధనుశ్శి
రములు గని మూర్ఛచే ధాత్రి ♦ వ్రాలి కొంత
తడవునకు లేచి విలపింపఁ ♦ దొడఁగె నిట్లు. 135

క. నీగురుపాదరజస్సం
యోగంబునఁ గడుఁ జెలంగు ♦ చుండుశిరం బి
చ్చో గరిమ చెడి యసురచే
నీగతి రేణువుల బ్రుంగి ♦ యిటు లుండెఁగదే! 136

ఉ. వాలిని గూల్చి సత్కరుణ♦వానరరాజ్యము సూర్యసూతికిన్
శ్రీలు చెలంగునట్లొసఁగెఁ♦బ్రేమ ననున్ వెదకంగ మేటికీ
శాలి సమస్తదిక్కులకు♦నంపె నటంచును జెప్పెఁగాదె వా
తూలతనూజుఁడంతయును♦దొల్లియుఁ గేగతి సైఁతునక్కటా!

ఉ. సంశయము లిచ్చునీవన ల◆సత్యము లయ్యెను ధాత్రిగోత్రభి
త్సంయుతనిర్జరాళికి న◆సాధ్యుఁడ వందురు తుచ్ఛదైత్యుచే
సంయుగమందుఁ జేవ చెడి◆చచ్చుటకే విధి నీకు వచ్చె వా
చంయమయజ్ఞవిఘ్నకర◆సంహరణా ఖరకంఠలుంఠనా. 138

వ. అని యనేకవిధంబుల నవధి లేనియవిధి నధిగమింప విధివిధం బంబోలు ననుచు శోకించుజనకతనయం గనుంగొని సీతా యింక రఘువరుమీఁదియడియాస వీడుకొని సేఁదైన నాడెంబుగా వేడుకం గవఁగూడి క్రీడించుట పాడి యా ననుచుఁ బలుకుచున్నదశాస్యుం జూచి యోరి క్రూరాత్మా దారుణోరగంబును గంఠహారంబుగా ధరియింపం గోరెదుతీరున దురాలాపంబు లేల ప్రేలెదు చాలుఁజాలు నింతికన్న నీకరవాలంబున నన్ను ఖండతుండంబులుగాఁ జెండుట నీకుఁ బుణ్యంబగు నంచు దుఃఖించుచున్నంత నొక్కసణిహారి యేతెంచి వింశతిబాహు నీక్షించి దేవా ప్రహస్తుం డతిత్వరితగతి నిమ్ముం దోడ్కొని రమ్మని పుత్తెంచె నని బెదరి బెదరి పలికినం బఙ్క్తికంధరుండును నుదరిపడి మది వెఱపు దొర మఱుఁగుచు బిరబిర నరుగుచున్నంత నిక్కడ దద్ధనుశ్శిరంబు లదృశ్యంబు లయ్యె నప్పుడు. 139

క. అత్తఱిఁ గరసి మహీసుత
తత్తఱిలక సరమ వచ్చి◆తల్లీ యిది దై
త్యోత్తంసుమాయ యని త

ద్వృత్తాంత మంత దెలిపి ♦ దృఢముగఁ బలికెన్. 140

ఉ. నీవిభుఁ డాసువేల ధర♦ణీధరమం దనుజుండు కీశసై
న్యావళి గొల్వ నుండెను ద♦శాస్యువధించుట కేగుదెంచు ని
చ్చోఁ విజయంబుఁ గైకొని వి♦శుద్ధచరిత్రను నిన్ను యోధ్య కి
చ్ఛావిధిఁ గొంచుఁ బోవును వి♦చారము మానుము చూచి
[వచ్చితిన్. 141

గీ. అని సరమ సీత నోదార్చి ♦ నంత నిచట
రావణుండు ప్రహస్తుచే ♦ రామవిభుని
కతలు విని కుంది తనచమూ ♦ పతుల నెల్ల
యుద్ధసన్నద్ధు లగుఁ డన ♦ నొక్క మొగిని. 142

క. దిగ్భిత్తులు వగులఁగ స
మ్యగ్భేరీశంఖకాహ ♦ ళారవము సమి
త్ప్రాగ్భద్రిసరణికై మఘ
భుగ్భయదము గాఁగ దనుజ ♦ పురి విన నయ్యెన్. 143

గీ. అంత మంత్రుల రావించి ♦ యందు నొక్క
వృద్ధసచివునిఁ గని యింక ♦ బుద్ధి యెట్లు
లేమయా తాత! మాతామ ♦ హా! మహాత్మ!
మహితగుణవంత! ధీ ♦ మంత! మాల్యవంత! 144

క. తాతవు, నయశాస్త్రములకు
ధాతవు, బహురాజకార్య ♦ ధర్మార్థపరి
జ్ఞాతవు, రాక్షసవంశ

త్రాతవు, మదభీప్సితార్థ • దాతవు తలఁపఁగ. 146

చ. అన విని మాల్యవంతుఁ డసు • రాధిపుఁ గన్గొని దేవ నీవెఱుం
గనినయశాస్త్రముల్ గలవె • కార్యవిచారము లింక వేరె క
ల్గునె జగదంబ సీతను త్రి • లోకశరణ్యుఁడు భక్తవత్సలుం
డనుపమశౌర్యశాలి యగు • నారఘురామున కిచ్చుటే సుమీ.

సీ. గాధినందనమహా • క్రతువిఘ్నకరనృశం
సాసురగర్వసం • హారకుండు
చిరతరోపలరూప • ధరమహానివరదార
దారుణైనఃపుంజ • దారకుండు
ద్విరదపూర్వాసుపర్వ • పరిపంథిమహనీయ
చాపనిర్భేదభు • జాబలుండు
కృతవీర్యతనయాంస • కృంతనోగ్రకుఠార
భృచ్ఛ్లాఘ్యఘనధను • ర్వేదవిదుఁడు
పితృనిదేశప్రవర్తనో • ద్ధతగుణుండు
ఘటభవాదేశితాశుగ • కౌశలుండు
సమరరంగాహతాఖిల • శాత్రవుండు
తలఁప సామాన్యుఁడే రఘూ • ద్వహవిభుండు. 147

క. రక్షోధిప! శ్రీరాముని
సాక్షాద్విష్ణుఁడుగ సీత • జలనిధిసుతగా
వీక్షింపుము దెట్లనఁ బ్రి
త్యక్ష ముదధిఁ గట్టి దాఁటు • సన్నుతలక్షణమే. 148

శా. వేధోదితవరంబు లియ్యెడ వృథా ♦ వీర్యంబులో విద్విష
ద్వేధాక్రాంతము లయ్యె నర్థములు భా♦వింపంగ నెంతేభవ
ద్బాధాముక్తమఘాంశులై దివిజు ల♦బ్జాతాక్షు వేడ న్నిను
న్సాధింపన్ రఘునందనుండయిరమా♦నాథుండువుట్టెంజుమీ.

సీ. అసదుగానిపనంటి ♦ నెసరెక్కువగఁబెట్టి
వెనుచిచ్చు దరికొల్పి ♦ మునుకొనంగఁ
గళపెళ నుడికెడు ♦ కణమెుందుఁ గైకొని
పదనుచూడక వార్చు ♦ పాటివిడిచి
చిమడఁ బెట్టినయోగి ♦ రిము మఱి బిరుసుకు
రానియ ట్లయ్యె నే ♦ ర్పటుతు వినుము
చెల్లెలిమాటలు ♦ చెవియొగ్గి వినుట మా
రీచోక్తిఁ గనరుగాఁ ♦ జూచుకొనుట
మాయచే సీతఁ దెచ్చుట ♦ వాయుసుతుని
తోఁకఁ గాల్చుట తమ్మునిఁ ♦ దొలఁగిపోవ
నిచ్చుట నృపాలుతో సంధి ♦ కెనయకుంట
తఱి మిగిలె నింక జయ మెట్లు ♦ దనుజనాథ! 150

శా. గర్వం బేటికి మర్త్యులుం గపులు సం♦గ్రామోర్వి నెంతేభవ
ద్దోర్వీర్యం బణఁగించి త్రుంచెదరు నీ ♦ దుర్నీతి పోనాడి యా
గీర్వాణుల్ వినుతింప రామునకు భ♦క్తిన్ సీత నర్పించి సన్
సర్వజ్ఞుం డగుటం గృప న్మనుచు నై♦త్యోకుండు నేఁజెప్పితిన్.

గీ. అనుచు నయమార్గమునఁ జెప్పి ♦ అతని వెంగము

పొసఁగమిం గాని క్రమ్మఱఁ బొసఁగఁబలికె
వృద్ధదశఁ జెందె యిది మంచి బుద్ధి యగునొ
కాదొ నీచిత్త మెట్లొ యా గతియ శుభము. 152

శా. తాతా రమ్మని చేరఁ బిల్చుటనొ యీ ధర్మార్థ మేర్పాటుగా
మాతోఁ గొంకక చెప్ప నాఁగితివి నీ మంత్రాంగ మిట్లుండెఁబో
సీతం బుత్తునె మర్త్యులం గపుల నాజిం గీటణంగింతు నా
చేతోవృత్తి యెఱుంగ వింక నిట భాషింపంగ నీ కేటికిన్.

వ. అని సచివునిం గసటునం గసరి వైచి యసురవరుండు సమరోత్సుకుండై నిజభుజావిక్రమతిరస్కృతకులిశహస్తుం డగు ప్రహస్తుఁ బూర్వద్వారంబునను మహోదరమహాపార్శ్వులఁ గీనాశదిశాద్వారంబునను నింద్రజిత్తుఁ బశ్చిమద్వారంబునను సదుమ విరూపాక్షునిం గట్టడ చేసి శుకసారణులుం దాను నుత్తరద్వారంబున నుండుటకు నిశ్చయించుకొని యంత నంతఃపురంబునకుం జని కుధరశిఖరపరివృతవిద్యోతమానవిద్యుల్లతాన్వితసజలనీలాంబుదంబు చందంబున నొక్క సముత్తుంగగోపురవిరాజితసువర్ణపీఠికాసమాసీనుండై వానరసేనావలోకనాసక్తి నుండె నంత నిచ్చట విభీషణుండు తత్ప్రవర్తనంబు వార్తాహరులవలనఁ దెలిసి రఘూద్వహునకు విన్నవించిన మన్నించి సుగ్రీవాంగదాంజనేయాదికతిపయపరిజనంబులును దశాననానుజన్ముండును దోడు రా సువేలాచలాగ్రంబున కెక్కి లంకాపురీపరీక్షాసముత్సుకుండై కౌసల్యానందనుండు విభీషణుం బి

లిచి యాతుధానరాజధానీవృత్తాంతం బంతయుఁ జెట తెల్లం
బుగాఁ దెలుపు మనిన వినయవినమితశరీరుండై చేతులు మో
గుచుకొని యిట్లనియె. 154

మ. త్రిజగత్ప్రాగ్వరదివ్యసుందరము నీ॥ శేజాసనాఖండలా
ద్యజరాభేద్యము హేమరత్నఖచితో॥ద్యత్సౌధసంబాధముఁ
గజగంధర్వశతాంగవీరభటసం॥ఘాతావృతంబుఁ సమ
స్తజనాభీలము లంక యన్పురము చి॥త్రంబయ్యెడుంజూచితే.

క. ఇరువదివే లశ్వంబులు
మఱియుం బదివేలు మేలు॥ మదగజములు ము
య్యిరువదివేలరథంబులు
గరగరికలు లక్షభటులు॥ గవఁకుల నుఁడుఁ. 156

చ. అరుదుగ షష్టిలక్షలు బలాఢ్యులు॥మూలబలంబు వారలొ
దొరలు లయాంతకప్రతిమ॥దుస్సహమూర్తులువన్నె కెక్కువా
రిరువదివేలసైన్యపతు॥లెన్నికశూరులు లక్షపుత్త్రికుల్
పరఁగుదు రప్పురిం దదధి॥పాలుని వైభవ మిట్లు చొప్పడుఁ.

మ. తనుయష్టిస్ఫుటమేచకద్యుతులతోఁ॥దచ్ఛీర్షకోటీరగుం
భనరత్నాంశువు లెంతయుఁ మెఱసి భూ॥మధ్యాంతచం
[చద్విమా
తనఖద్యోతవిజృంభణంబుగతి ను॥ద్యద్దీప్తిఁ జెల్వారఁగాఁ
గనుపట్టుఁ దశకంఠుఁ డాడ నతనిం॥గంటే ఖరధ్వంసనా!

గీ. అని విభీషణుఁ డెఱిఁగింప॥నచట నున్న

యట్టిసుగ్రీవుఁ డసురేశు ♦ సరసి వాని
నైభవంబున కిటు రఘూ ♦ ద్వహునివ్యథకుఁ
బొగిలి యిటె పీనిపోఁడిమిఁ ♦ బొగుతు ననుచు. 159

ఉ. మత్తగజంబుపైకి హరి ♦ మాణవకం బవలోకనంబుచే
నెత్తినయుల్కతో నుఱికి ♦ హెచ్చినబల్మిని నొంచుమాడ్కి దై
త్యోత్తముపైకి బిట్టెగసి ♦ యోరి దురాత్మ పొసంగ నిట్టులో
లత్తుక నీ కటంచును ద ♦ ల ల్పదియుం బగులంగఁ దన్నినన్.

క. ఆలీలఁ దన్న దబదిబ
గూలెం దశదివ్యహేమ ♦ కోటీరంబుల్
రాలెం జలజల మగరాల్
సోలెన్ వడి దిమ్మ దిరిగి ♦ సురరిపుఁడంతన్. 161

సీ. నీ వెవ్వరంటి వే ♦ నియుఁ బఙ్క్తికంధర
విను మేను సుగ్రీవుఁ ♦ డనుప్లవంగ
రాజ్యాధినాథుఁడఁ ♦ బ్రబలత నిను వార్ధి
ముంచినవాలి త ♦ మ్ముఁడనుకలన
వీరులఁ బదునాల్గు ♦ వేలరాకాసులఁ
జదిపినరఘువరు ♦ మొదలిబంట
నని పల్కి యోరి దు ♦ రాత్మ నీవున్నెము
వమ్మయ్యె ఘనవైభ ♦ వమ్ము లెల్లఁ
దగవు విడఁజిమ్ముకొన నీకుఁ ♦ దగవుసుమ్ము
నీదుపినతమ్ముఁ డెదుటనొమ్ము ♦ మీఁదికమ్ము

పడఁడలీకమ్ము చడకిలఁ ♦ బడకె లెమ్ము
కలస కిటు రమ్ము వదలెనే ♦ తలలడిమ్ము. 162

వ. అప్పుడు. 163

శా. ఉగ్రుండై వడిలేచి కన్గొని దశా♦స్యుం డట్టహాసంబునన్
సుగ్రీవుం గరమొత్తి నెత్తి చరువన్ ♦ ఘూర్ణిల్లుచుం దోసఁ బ
ట్టి గ్రీవాస్యములందు నెత్తురులు జొ♦త్తిల్లం బడన్ మొత్తినన్
దృగ్రాజిన్ మిణుఁగుర్లు బిట్టెగయుడై ♦ దైత్యేశుండు దాఁకెన్ ధృతిన్.

వ. అప్పుడు. 165

క. పదరక చెదరక బెదరక
గదియుచుఁ గంఠీరవంబు ♦ కంఠీరవమున్
గదసంబు సేయు పగిదిని
వదలక సుగ్రీవపఙ్క్తి ♦ వదనులు కసిమిన్. 166

శా. వీరావేశము మీఱఁ జీకుచును బృ♦థ్వీన్ సోలుచున్ లేచి పే
మారుం దాఁకుచుఁ దన్నుచుం బొడుచుచున్ ♦ మర్మంబు లం [టంగ లా
వారం గ్రుద్దుచు నొంచుచున్ విజయమ♦న్యోన్యంబపేక్షించుచున్
ధీరత్వంబునఁ బోరుచున్నతఱి నై♦తేయుల్ విజృంభించుచున్.

క. ఇతఁడఁట సుగ్రీవుండఁట
పతియఁట కోఁతులకు రాము ♦ బంటఁట వీనిం
జతసమునఁ బట్టి గట్టిగ
వెతఁబెట్టినఁ గొట్టుఁబడదె ♦ వేలమ్మెల్లన్. 168

క. అని కపియుతతిఁ దటాలునఁ
జెనఁటులతోఁ దడవుపోరఁ ♦ జెల్లదు నేవ
చ్చినపని యయ్యెను జనియెద
నని తరలి సువేలశిఖరి ♦ కరిగి వినయుతన్. 169

క. ఒడయుని చరణంబులపైఁ
బడినం గౌఁగిటను జేర్చి ♦ భానుసుతా యు
క్కఁడ విటు చనఁదగునే యని
బడలిక విడ గారవించి ♦ పలికెం బ్రేమన్. 170

క. వనచరనాయక నీ విం
కను మర్కటకోట్ల లంక ♦ గవఁకులచుట్టుం
బనువుము ముట్టడి వెట్టఁగ
ననుచు నటు లొనర్చె రాఘు ♦ వాజ్ఞావశుఁడై. 171

వ. అప్పుడు రామచంద్రుండు రాజధర్మపరిజ్ఞానుండును లోకవ్య
వహారలక్షణుండును సర్వభూతహితవ్యాపారుండును దయా
పరుండునుం గావున నంగదుం బిలిచి లంకానగరంబునకుం
జని రావణునితో నకారణవైరం బేల బేలవై చెనుగునడవడి
విడువక గొడవఁ బడి చెడుట మేలు గాదని బడిబడి నొడివి క
డువడి రమ్మనుచుం జెప్పిపంపిన. 172

ఉ. పంపిన నంగదుం డసుర♦పాలకుఁ జూడఁగ వేగ మేగి వీ
క్షింపుచు వాని కేర్పడ వ♦చించె జగజ్జనభీకరా ! యి టా
లింపుము నిక్క నిక్కక ని♦లింపులు మెచ్చఁగఁ జెప్పుమంచున

న్నంపి విరాధభేది యది॥యంతయు నీ వెవ రంటివేనియున్.

ఉ. వాలమునందుఁ జుట్టుకొని॥వారిధులన్ నిను ముంచినట్టియ
వ్వాలితనూజుఁడన్ దనుజ॥వర్గములం బదునాల్గువేలఁ బే
రాలములోనఁ గూలిచి ఖ॥ రానురుఁ ద్రుంచినయట్టిరామభూ
పాలునిబంట సంగదుఁడఁ॥ బక్షిముఖాయిఁక నాలకింపుమా.

సీ. నీతాత ధాతయై ॥ నిఖిలజగత్సృష్టి
కార్యధూర్వహతాంశ ॥ కర్త యయ్యె
నీయయ్య యెయ్యెడ ॥ నిరవద్యబహుతపో
నిష్ఠాగరిష్ఠుఁడై ॥ నెగడె జగతి
నీయన్న యెన్నఁగ ॥ నిగమాశ్వమిత్రితఁ
బాయనిసిరుల ది ॥ క్పతి యగుటఁ గనియె
నీతమ్ముఁ డిమ్ముఁగ ॥ సీతామనోహరు
కరుణ లంకానాయ ॥ కత భజించె
నౌర యిటు చెప్పఁదగిననీ ॥ వారిలోనఁ
బెరుకగుచు నుంటి మొఱకవై ॥ బిరుసు దొఱఁగి
తెఱ వెఱుంగుట మనుట నీ ॥ కెఱుఁగఁబడదె
పాపచింతామహోత్కంఠ ॥ పక్షికంఠ. 175

ఉ. క్రించుఁదనంబు మాని పఱి॥కింపుము పక్షిరథాత్మజుండు వే
యంచులవాలుఁబూనుదొర॥యంచుఁ దలంపుమిలాతనూజశ్రీ
యంచు భజింపు మీవె గతి॥యంచుఁదదంఘ్రిలఁ వ్రాలిసీతన
ర్పించికృతాపరాధి నిఁకఁ॥బెంచుమటంచును రాము వేఁడుమీ.

మ. విను మారావణ రాఘవుండు కలఁడే ♦ విల్లమ్ములుం బూని ని
ల్చిన నీ వెంతటివాఁడ వారయఁగ న ♦ జ్జేజేలతోఁ గూడ న
న్ననవాలంటినదంటకంటుదొరవై ♦ నం జూడశక్యంబె మూఁ
వనజాతాననుఁ డిచ్చినట్టివరముల్ ♦ వమ్మౌఁజుమీ నీ కిటన్.

గీ. పేర్మి మున్నిడె లంక వి ♦ భీషణునకు
వేఁడరా దిది నీవు వి ♦ వేకి వగుచుఁ
దప్పు చేసితి వని మహీ ♦ తనయ నిచ్చి
యడిగిన నొసంగు నీకయో ♦ ధ్యాపురంబు. 178

గీ. అఖిలలోకకర్త ♦ యగురఘూద్వహునితోఁ
గదనమునకు నీవు ♦ గడగు టరయ
నిన్నుఁ గట్టుత్రాళ్లు ♦ నీవె కోరిక మీఱఁ
దెచ్చుకొనుట సుమ్ము ♦ దితిజ యనుఁడు. 179

మ. అపు డామాటల కుల్కి దానవకులా ♦ ధ్యక్షుండురక్తాక్షుఁడై
కపినిం గట్టుఁ డటన్న నల్వురసురల్ ♦ గర్జించుచుం బైఁబడం
గుపితుండై హరి వారికంఠములలాం ♦ గూలంబు బంధించి నే
రుపుమీఱన్ వడిఁద్రిప్పికొట్టినసురా ♦ రుల్ గూలిరొక్కుమ్మడిన్.

వ. అంత నయ్యంగదుండు. 181

గీ. వీటఁ బొడ వగునొకమేడ ♦ విఱిచి తెచ్చి
వానిమకుటంబులను వాఁడు ♦ దానఁ గూల
వైచి నీకర్మ మిట్టుల ♦ వ్రాసె నింక
ననుభవింపు మటంచు ద ♦ శాస్యు విడిచి. 182

చ. దినకరవంశ్యపాలి కరు♦దెంచి నమస్కృతిఁ జేసి దేవ నే
విను మన నొల్లఁ డాఖలుఁడు♦ వేమఱుఁ జెప్పితినన్న నంగదున్
మునుకొని మెచ్చి రక్కసుల♦మూఁకలత్రుళ్లడఁగింపుఁడింక నం
చును బలుకన్ వెసం బ్లవగ♦శూరులుపొంగి చెలంగి యుంతటన్.
ఉ. కట్టలుకం గరంబులను♦గట్టులు చెట్టులకట్ట లూని క
న్పట్టినదిట్టరక్కసులఁ♦బట్టుఁడు కట్టుఁడు కొట్టుఁ డంచు న
ప్పట్టున మెల్ల చుట్టుకొని♦పట్టుగ రట్టడి నొక్కపెట్టుగా
ముట్టడి వెట్ట దైత్యకుల♦ ముఖ్యుఁడు బిట్టు దలంకియుట్లనున్.
శా. విన్నారా కపిసేనఁ గూడుకొని పృ♦థ్వీనాయకుం డాజికిన్
సన్నద్ధుం డయి వచ్చి చుట్టుకొని యెన్♦ సైన్యేశులారా సమి
త్సన్నాహంబున నేగి వానిఁ గలనం♦జక్కాడి రండంచు ను
త్పన్నక్రోధమనస్కుఁడై ప్రధనయా♦త్రాభేరి వేయించినన్.
మ. వనధుల్ ఘూర్ణిలె మేరుమందరగుహాల్♦వాపోయె బ్రహ్మాండభాం
డనికాయంబులు మ్రోసె నాకసము బీ♦టల్వాసె క్షోభించె భీ
తి నిలింపౌఘము దిక్కరుల్ బెదరె ధా♦త్రీచక్ర మల్లాడెఁ ద
ద్ఘనకూజద్రణభేరికాభయదభాం♦కారైకనాదార్భటిన్. 186
ఉ. ఆసమయంబునందుఁ గరు♦లశ్వములున్ రథముల్ పదాతులున్
మీసరమైనదర్పమున♦మేదురమై వెడలం దదీయఘో
రాసహపాదఘట్టనకు♦నాఁగక ధారుణి నింగి కేగెనో
గాసిలి గుండమై యనఁగఁ♦గానఁగ నయ్యెఁ బరాగ మయ్యెడన్.
గీ. అట్లు వెడలి తత్సైన్య మ♦ త్యద్భుతముగ

ముద్గరాసిగదాకుంత ♦ ముసలపరశు
చక్రతోమరపరిఘాది ♦ సాధనములు
పూని భీకరముగ వచ్చి ♦ పొదువ నపుడు. 188

గీ. తరులు గిరులు శిలలు ♦ తమమీఁద వానరుల్
గురియ వాని నెల్ల ♦ గుండసేయ
నంత నుభయబలము ♦ లలుకమైఁ దలపడి
చిదిమి పొడిచి వ్రేసి ♦ చించి మఱియు. 189

క. ఇతరేతరవిజయేచ్ఛా
మతిచే నాదైత్యబలము ♦ మర్కటబలముఁ
బ్రతిలేనిబీర మొప్పఁగ
వితతముగాఁ బోరుచున్న ♦ వేళం గడిమిన్. 190

క. కరుల మహీధరములచే
హరులం గ్రావములచేత ♦ స్యందనచయముల్
ధరణీరుహాములచేతను
గరమరుదుగ మోఁది పిదపఁ ♦ గపివరు లెల్లన్. 191

సీ. మది నుప్పతిల్లిన ♦ మర్షితవాలంబు
లుప్పరం బంటఁగఁ ♦ ద్రిప్పికొనుచు
నిడుదలై గదలకై ♦ వడిఁ బొల్చుమ్రాఁకులు
మొదలంటఁ బెకలించి ♦ మోచికొనుచుఁ
జెండ్లాడుగతి గబ్బి ♦ గుండ్లు కేల్గవ నెత్తి
యెగురవైచుచు వేగ ♦ మగుడఁ గొనుచుఁ

దబ్బిబ్బుపడి లోకు ♦ లబ్బురంపడ నొక్క
పెట్టున బొబ్బలు ♦ పెట్టికొనుచుఁ
బఙ్క్తిరథతనూజు ♦ పాఱిపుగల్గుట నుబ్బి
పఙ్క్తికంఠుసైన్య ♦ పతుల నెల్లఁ
బిల్చి సల్చి యొల్చి ♦ మల్చి కూల్చి యదల్చి
పట్టి కట్టి కొట్టి ♦ మట్టి రపుడు. 192

క. చెల్లాచెదురుగ దానవ
మల్లులు కడు నుక్కుఁ దక్కి ♦ మఱిచెడి పాఱన్
విల్లెత్తి వారి నిశిచర
వల్లభసుతుఁ డురక భయము ♦ వాపి మఱల్చెన్. 193

క. ఆరీతి మఱల్చినునా
సీరజిదాజ్ఞను సమస్త ♦ సేనాధిపతుల్
ధీరత బారుల్కుఁ డిరిచి
దారుణముగఁ నార్చి రమిత ♦ దర్పోజ్జ్వలులై. 194

వ. ఆసమయంబున. 195

చ. దినకరవంశనాథఘన ♦ దివ్యశరాసనఘోరటంకృతుల్
వనచరసింహనాదముల ♦ వారితదైత్యచమూరవంబు వెం
పెనయ మదేభవాహరథ ♦ బృంహితహేషితనేమిఘట్టన
స్వనములు శంఖభేరిపణ ♦ వధ్వను లెల్లెడ మ్రోసె బిట్టుగన్.

వ. ఇవ్విధంబున నుభయబలంబులు నతిభయదంబుగాఁ గోలాహలధ్వనులు చెలంగ నుప్పొంగుచున్నయవసరంబున. 197

సీ. కపిరాజతనయుఁ డ • సప్రవవంశపతిసూను
నర్కజుండు ప్రహస్తు • ననిలసుతుఁడు
జంబుమాలిఁ బయోజ • సంభవపుత్త్రుండు
మకరాక్షు రఘువంశ • మండనుఁడు
సుప్తఘ్ను ననలధ్వ • జునియజ్ఞకోపుని
రశ్మికేతుని నల్వు • రను సుమిత్ర
కొడుకు విరూపాక్షుఁ • గుముదుఁ డకంపను
గదుఁడు మహానాదు • గజుఁడు మఱియు
రావణావరజుండు మి • త్రఘ్ను వేగ
దర్శి [illegible] విశ్వకర్మనం • దనుఁడు తపను
వినుతుఁ డతికాయు జంఘుఁడు • వికటుఁ బిలిచి
ద్వంద్వయుద్ధంబు సేయంగఁ • దాఁకుటయును. 198

మ. శతపత్త్రేక్షణమిత్ర శాసితసుమా • స్త్రా శిష్టలోకావన
వ్రత శీతాంశువతంస శుభ్రరుచిగా • త్రా శూర్పకర్ణానిశా
ర్చిత శేషాహిపభూష శైలగృహ శో • చిష్కేశవక్త్రాభివం
దిత శౌర్యాగ్రహాఖండితద్విరదదై • తేయాంగకా శంకరా.

క. అతియశూలాగ్రహావి
ర్భుతకవిస్ఫారహేతి • రాజిముహున్ముం
ధుతగణవితతఘృతాంధక
రక్షోసృక్స్రవణభుజగ • రాజాభరణా. 200

స్రగ్విణీవృత్తము.

యక్షరాణ్ణందితా • యాగభుగ్వందితా
శిక్షితేభాసురా • శిష్టలోకావనా
పక్షిపాశ్వాంబకా • భాస్కరేంద్వంబకా
దక్షకన్యాపతీ • తామ్రచూడాకృతీ. 201

గద్య:—ఇది శ్రీమత్కుక్కుటేశ్వరానుగ్రహసమ్భూతకవిత్వ
వైభవ విశ్వామిత్రగోత్రపవిత్ర వారణాసివంశపారా
వారకైరవమిత్ర విద్వన్నుతచరిత్ర కామయార్య
పుత్త్ర సుకవిజనవిధేయ వేంకటేశ్వరనామ
ధేయ ప్రణీతంబైన రామచంద్రో
పాఖ్యానం బనుమహాప్ర
బంధంబునందుఁ
బంచమాశ్వాసము

శ్రీ.

శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీరామచంద్రోపాఖ్యానము.

## షష్ఠాశ్వాసము.

శ్రీదశసుతాసంగా
యాదోధినిషంగ రవిహి • మాంశురథాంగా
వేదాభంగతురంగా
పాదాయుధరూపలింగ • భవ్యాపాంగా. 1

వ. అవధరింపు మనంతరకథావిధానం బెట్లు జోడుగై తలపడి పె
ద్దయుం ప్రొద్దు పోరాడుసమయంబున. 2

ఉ. అంగదుఁ డింద్రజిత్తుసుర • థాశ్వములం దెగటార్చి సూతుఁ బృ
థ్వీం గడుఁ ద్రెళ్లనేసి వెస • వృక్షము చేతను వానిఁ దూలనే
యాగఁ బ్రజంఘు నుబ్బణఁచె • నాతడి పోటరిజంబుమాలి నీ
గ్రుంగఁగఁ జేసె వాయుజుఁడు • కోర్కె విభీషణుఁడంతలోపలన్.

శా. మిత్రఘ్నుం జదివెన్ నలుండు తపను • స్మోటించె సౌమిత్రియ
ర్ధాత్రేయాస్త్రము చేఁగలంచెను విరూ • పాక్షున్ రఘుస్వామియుం
జిత్రం బొప్పఁగ నగ్నికేతుముఖులం • జేట్పాటు నొందించె నా
మిత్రప్రోక్షభవుఁడు సంబరి హస్తుఁ బొరిచెం • బెల్లార్చి మూర్ఛిల్లఁగన్.

గీ. జాంబవంతుఁడు మకరాక్షుఁ ♦ జదిపె భిన్న
గజుఁడు తూఁటాడెఁ గుముదుఁ డ ♦ కంపనునిఁ జ
దిమెను ధూమ్రుండు కుంభుని ♦ తేజ మడఁచెఁ
గేసరియును ధూమ్రాక్షుని ♦ గీటడంచె. 5

క. పనసుండు నరాంతకుపైఁ
గినిసెను శరభుండు త్రిశిరు ♦ గీటడఁచెను ; పై
కొనియె వృషభుండు నారణు
వినతుం డతికాయుఁ బొడిచె ♦ వీరరసమునన్. 6

మ. హరివీరుల్ మఱికొందఱయ్యెడను బా♦హాశక్తి వాహంబులం
గరులం దేరుల దైత్యులం బొడుచుచున్♦ ఖండించుచుం గ్రు
[ద్ధుచుం
గరఘాతంబులనొంచుచుం జిదుముచుం♦ గంపంబునొందింపఁగా
సురవైరుల్ గడు నొక్కపెట్టుగ శర♦స్తోమంబుచేఁ గప్పినన్.

ఉ. మర్కటవీరు లద్దనుజ♦మార్గణజాలము లెల్లఁ ద్రుంచుచుం
గర్కశశైలసాలములు♦ గ్రావములుం గొని మోఁదుచుం జయో
దర్కముఁ గోరి పోరుతఱి♦ దానవవీరులు రేయిఁ గోరఁగా
నర్కుఁడు పశ్చిమాబ్ధికి ర♦యంబున నేగెను గ్రమ్మెఁ జీఁకటుల్.

గీ. అపుడు రావణి పురికేగి ♦ యనలు వేల్చి
తత్కృపసువర్ణహాయరథ ♦ ధన్వసాయ
కములు గైకొని క్రమ్మఱఁ ♦ గదనధరణి
కరుగుదెంచెను విక్రమం ♦ బచ్చుపడఁగ. 9

క. ఆరీతి వచ్చి దానవ
నీరదుఁడు రాఘవులు కపులు ♦ వెఱఁగందంగా
వారక గురియించె మృషా
నీరదములవలన ఘోర ♦ నిశితాస్త్రంబుల్. 10

ఉ. ఆనిశితాస్త్రముల్ రఘుకు♦లాఢ్యుఁడు దివ్యశిలీముఖంబులన్
దో నడఁగించి రక్కసులఁ♦ద్రుంపఁగఁజొచ్చిననల్కనొందియా
దానవనాథనందనుఁడు♦దారుణభంగి మహాంధకారముం
గా నొనరించి సాయకని♦కాయము లేసె నపారసత్త్వుఁడై. 11

వ. మఱియు నొక్కదిక్కునం దళుక్కునం బొడసూపుచు నొక్కవంక ధనుష్టంకారంబు సేయుచు నొక్కచక్కిఁ బిడుగులవడువున బెడిదంపుటంపగములు వైచి ప్లవంగపుంగవుల రూపుమాపుచు నొక్కక్రేవ నదృశ్యుండై రామలక్ష్మణుల నిశాతఘోరనారాచజాలంబుల మర్మంబు లంట నొంచుచు బహుప్రకారంబుల మాఱిమసంగినట్లు సమయించుచున్న నందఱు నుం జేయునది లేక నిశ్చేష్టులై తేఱి చూడరాకయుండు నప్పు డయ్యపారగాఢాంధకారంబున నారఘువీరుం డత్యంతదైన్యంబున నోహో సుగ్రీవా! మనవా రందఱు లెస్సగా నున్నవారుగదా! విభీషణుం డెచ్చట నున్నవాఁ డనిన నట్లన విభీషణుం డెదుటం బొడకట్టి దేవా! మహానుభావా! ఏమి కార్యం బనవుడుఁ గౌసల్యానందనుండు విభీషణా! వీఁ డెవ్వండు? క్రొవ్వు నివ్వటిల్ల దవ్వుదవ్వున నుండి చివ్వచివ్వన నన్ను

నొవ్వఁ జేయుచున్నవాఁ డనుటయు రావణానుజుండు రామచంద్రా! వీఁ డింద్రజిత్తుం డనువాఁ డగ్నివరగర్వంబున నంతరిక్షంబున నంతర్ధానుండై ఘోరంబు లగునారాచంబు లేయుచున్నవాఁడు గావున వీని నతిప్రయత్నంబున సాధింపవలయు ననుచు వినిపించిన విని కాకుత్స్థవీరుండు మహాహంకారంబున నాపురందరారినందను ననేకదివ్యాస్త్రంబులు వింట సంధించి కంటికిం గానరాకుంట మింటి కేయం దొడంగిన నవి యమ్మాయావారిదంబుల భేదించి వానిమేను దాఁకిన నాసోఁకుమూఁకలయేలికకొమరుండు వారనిపేరంబు మీఱఁ జేరలుక నలుగడలం దానయై ఘూర్ణిల్లుచు భువనభయంకరంబు లగుశరపరంపరలు వఱపిన. 12

సీ. పదములుం చిదురులై ♦ బెదరిపోయెడువారు
మోకాళ్లుదునియలై ♦ మ్రొగ్గువారు
దొడలును నొడలు బ ♦ ల్విడిఁ దూలఁబడువారు
నడుములు విఱిగి చే ♦ ట్పడెడువారు
భుజములు తెగిపడి ♦ గజిబిజి యగువారు
వక్షముల్ వగిలిన ♦ వ్రాలువారు
కుంఠితకంఠులై ♦ కూలిక్రుమ్మరువారు
శిరములు వ్రయ్యలై ♦ పొరలువారు
ఘ్రాణసంశూన్యులై మదిఁ ♦ గ్రాఁగువారు
రిక్తకర్ణతఁ గడిఁది ఘూ ♦ ర్ణిలెడువారు

నయిరి యవ్వీరవరుశరా ♦ హతిరణోర్వి
వీరు వా గన కయ్యెగ ♦ చారభటులు. 13

గీ. ఇట్లు వానరవాహిని ♦ యేపు మాపి
రాఘవులఁ దీవ్రఘోరనా ♦ రాచపీడ్య
మానులుగఁ జేయ నెంతయు ♦ దీనదశకు
వచ్చి నిశ్చేష్టులై కడు ♦ వంత నొందె. 14

క. ఉల్లం బవియఁగ రఘుకుల
వల్లభుఁ డాపద్గభీర ♦ వారధిలోనన్
వి ల్లూఁతగ నిలువంబడి
తల్లడపడుచుండఁ జూచి ♦ తమ్ముఁడు వలికెన్. 15

మ. మనకై వచ్చి యనేకవానరులు రా♦మా యిచ్చటంజచ్చుట
ల్చను నే లంకయు దైత్యమైయొనరఁగాఁ♦జక్కాడెదంగాక యో
ర్తు నెబ్రహ్మాస్త్రము వైచియన్న నరయుం♦దోషంబు వెక్కండ్రనో
క్కనికై తున్చుట పాడియే యనుచు నై♦క్ష్వాకుండు వా
[రించుచున్.

గీ. అంగదర్క్షభశరభగ ♦ జాంజనేయ
ముఖుల నీక్షించి యాదైత్యు ♦ మురియదంపుఁ
దనిన వారలు వినువీథిఁ ♦ జని తదీయ
ఘోరశరహతులై నేలఁ ♦ గూలి రంత. 17

గీ. ఉరగశర మరి నమరిచి ♦ యుఱక నసుర
యన్నదమ్ములపై నేయఁ ♦ బన్నగములు

దవ్వులఁగొని కాళ్లుకేళ్లు మ ♦ ధ్యములు కంఠ
ములును బంధించెఁ గాకుత్స్థ ♦ కులతిలకుల. 18

శా. అంతన్ వానరరాడ్విభీషణులు బా ♦ ష్పాసారమొల్కన్ మదిన్
సంతాపించుచు రామలక్ష్మణుల రా ♦ జశ్రేష్ఠులం జూచి వాఁ
డెంతే వీరల మోసపుచ్చెనుగదే ♦ యింకెట్టులో యంచు శ్రీ
కాంతుం డేకలఁడంచు ధైర్యమున వీఁ ♦ కం దండు కాపాడఁగన్.

చ. ఫణిశరబద్ధులై ధరణి ♦ పైఁబడి మూర్ఛిలి యున్న రామల
క్ష్మణులను జూచి నిక్కముగఁ ♦ జచ్చిరటంచును శక్రభేది రా
వణునకుఁ బోయి తెల్పవిని ♦ వాఁడు జయధ్వనులొప్ప మందిరాం
గణమున కేగి యంత జన ♦ కప్రభుపుత్త్రిఁ దలంచి చెచ్చెరన్.

మ. త్రిజటం బిల్చి సురేంద్రభేది యనిఁ బృ ♦ థ్వీనాథులం జంపె భూ
మిజకున్ వారలఁ జూపి యింక నను జే ♦ ల్మిం గైకొనం జేయుమం
చు జగత్కంటకుఁడంపఁ బుష్పకముపై ♦ శోకార్తయై యున్న ధా
త్రిజ నెక్కించుక పోయి వారిరుపురం ♦ దెల్లంబుగాఁ జూపినన్.

గీ. చూచి యుల్లము ఝల్లన ♦ సొమ్మసిలి యొ
కింత తడవునకును లేచి ♦ యంతయుం ది
రకొనఁ గనుఁగొని యమ్ముద్ద ♦ రాలు మిగులఁ
జింతిలుచు నాత్మఁ దహతహఁ ♦ జెంది యపుడు. 22

గీ. హా! రఘూద్వహా! హా నాథ! హా మహాత్మ!
నేర మెంచక ననుఁ గన్ను ♦ లారఁ దేఱి
చూడవే నాఁడు నిను మాయ ♦ లేడి కనుపు

ఫలముఁ గుడిచితి నపరాధి • నలుక దగునె? 23

మ. అకటా! నాకొఱ కీప్లవంగములచే • నంభోధి గట్టించి యీ
సకలామర్త్యవిపక్షులన్ రణములోఁ • జక్కాడి నీవిట్లు నేఁ
డొకదైత్యాధము చేతఁ జక్కువడితే • యోనాథ! యోరామ నే
నిఁక నేరీతి సహింతునో రఘువరా! • యిక్ష్వాకువంశాగ్రణీ!

శా. హా! సూర్యాన్వయనాథ! యీపలుక యో • ధ్యన్విన్న నీతల్లి యా
కౌసల్యాసతి ప్రాణముల్ నిలుపునే • గాసిల్లదే యాసుమి
త్రాసాధ్వీమణి తల్లడించ వెసుహృ • ద్వ్రాతంబు లొక్కుమ్మడిన్
వ్రాసెంగా మన కింత కైకపగ కే • జన్ దైవ మీరీతిగన్. 25

వ. అని దుఃఖించుచు లక్ష్మణుం జూచి. 26

చ. అనఁ దగ నట్టిమాట లపు • డాడితి నజ్ఞత నిన్నుఁ దత్ఫలం
బనుభవ మయ్యె నా కిచట • నప్పటినేరము లెంచ కియ్యెడన్
ననుఁ గను విచ్చి చూడఁగదె • నాయెడలన్ దయ లేదె నేనునీ
తనుననుఁగన్నతండ్రి! ఘన • ధార్మిక! ముద్దుమఱంది! లక్ష్మణా!

గీ. అనుచు విలపింపఁ ద్రిజట భూ • తనయఁ జూచి
తల్లి నీనాథుఁ డగురఘు • వల్లభుండు
జీవితుం డింక వేఱొక్క • చింత విడువు
మనుచు సౌమిత్రి సప్రాణుఁ • డరయు మిపుడు. 28

క. కాకుండినఁ గపిసేనా
నీకం బీతెల్వి నుండు • నే ప్రృతనేశుల్
కాకుత్థ్సులదరి నుండుదు

రే కల దిఁక నొకటి వినుము ♦ పృథ్వీతనయా! 29

గీ. పుణ్యసతులకుఁ గాని యీ ♦ పుష్పకంబు
కదల దిది దీనిమర్మంబు ♦ గాన మదిని
నమ్ము మనుచు నశోకవ ♦ నమ్మునందు
నాప్తతను జెప్పి వసిడించె ♦ నంత నిచట. 30

క. శ్రీరామచంద్రుఁ డంతయు
ధారుణిఫణిపాశబద్ధ ♦ తనుఁడై దండిన్
గారియుఁ బడియెడుతమ్ముని
ధీరతఁ గన్గొని యొకింత ♦ తెలివిం బలికెన్. 31

చ. దశరథుమాటఁ గాఁగ ననుఁ ♦ దప్పకభక్తిని గొల్చుచుండి క
ర్కశవనవాస మొందె సమ ♦ రంబున దైత్యులసంహరించి దు
ర్దశ నొకటుచ్చుచేఁ దుదిని ♦ బ్రాణము గోల్పడితేని నేను దు
ర్యశముఁ గోర్చి నిర్వహించి ♦ హామున నేరుతునే సహోదరా!

శా. ఈవీరాగ్రణి మత్సహోదరుఁడు దే ♦ వేంద్రారిచే నొచ్చె నా
కానైదేహి యిఁకేల నాతను పిఁకే ♦ లా కుత్స కెట్లోర్తు సు
గ్రీవా వానరసేనఁ గూడుకొని పో ♦ కిష్కింధ కింకేల యా
యీపుంబొమ్ము విభీషణాయసృతమ ♦ య్యెన్నా దుపల్కులెయ్యాడన్

వ. అని రఘువరుండు సహోదరుంగూర్చి విలపించుచున్న విభీష
ణుండు. 34

గీ. అపుడ గదఁదాల్చి వరుస దం ♦ డరసికొనుచుఁ
డసగఁ గనుఁగొని శక్రశ్రే ♦ దిదెము యటంచుఁ

గవులు పదుగులు పెట్టఁగం ♦ కకుఁడు నే వి
భీషణుఁడ నిలుమంచుఁ ♦ బిలుచుకొనుచు. 35

చ. జనపతిచెంత నున్న రవి♦సంభవుఁ డగ్గఱఁ జేరి యాసయా
యని విడువం బనేమి యన♦సంగదుఁ డిట్లనియెన్ విభీషణా
మన మిపు డేరఘూద్వహుల♦మానక రక్ష యొనర్చుచున్న వే
గిన దశకంఠుఁ దత్సుతుల♦గీటణఁగింపఁగ వచ్చు మెచ్చుగన్.

గీ. అనుచుఁ బల్కు సుషేణుఁ డి ♦ ట్లనియె మును సు
రాసురాహవమున నిట్టు ♦ లైన నపుడు
గురుఁడు సంజీవిచేఁ బ్రోచె ♦ సురలఁ గాన
మనమగుం జెవ్వరైనన ♦ మందగతిని. 37

వ. అవక్రవిక్రముం డగువాఁ డేగి యం దౌషధలత లరసి తెచ్చి
న సర్వంబు శుభం బగు ననుచుం జెప్పిన నిం దట్టివాఁడెవ్వం
డు గలండో యని దం డంతయు వితర్కించుచు గుసగుసలఁ
బోవునవసరంబున నాసరసిజాసనసంభవుం డగుజాంబవంతుం
డు ప్రసంగవశంబుగా వనౌకసు లెల్ల వినంగ నిట్లనియె. 38

సీ. రామభద్రార్కజ ♦ పరిణయనిదానంబు
భుజసత్త్వలంఘితాం ♦ భోనిధానుఁ
డచలరాజతనూజ ♦ రచితసపర్యుండు
లంకిణీదర్పాపి ♦ లద్విజిహ్వుఁ
డవనీసుతాయాస ♦ హరణజీవాతువు
దనుజేశ్వరాశోక ♦ వనకుఠార

మకరక్షోధ్యక్షు ♦ శిక్షణదక్షుండు
బ్రహ్మాస్త్రబంధని ♦ ర్గళితధన్యుఁ
డహితలంకాపురీదాహ ♦ దహనమూర్తి
రామకార్యవిధానధు ♦ రంధరుండు
నాహవావనిసంహృత ♦ యాతుధానుఁ
డహహ ! సామాన్యుఁడే గంధ ♦ వహసుతుండు. 39

వ. అని వినుతించునవసరంబున. 40

క. నారదుఁడు సతతగానవి
శారదుఁడు తనూస్రవిజిత ♦ శారదవిలస
న్నారదుఁ డరుదెంచెం గ
న్నారఁ దుడుకున్ నృపాలు ♦ నారయుకోర్కెన్. 41

క. వచ్చి కని రామచంద్రున
కిచ్చఁ బ్రదక్షిణముఁ జేసి ♦ యీభుజగంబుల్
విచ్చలవిడి విడి చనియెడుఁ
జెచ్చెర నీ తేజి గరుడుఁ ♦ జీరుము చేరన్. 42

క. అని విన్నవించి నారద
ముని చనియెను రాఘవుండు ♦ మోదముతో నా
వినతాతనయుని వినయితఁ
దనమనమునఁ దలఁచుకొనినఁ ♦ దత్క్షణమాత్రన్. 43

క. తామ్రగరుదంచితుఁడు ఖగ
సమ్రాణ్మణి బాహుసత్త్వ ♦ సంపన్నుండున్

గ్రమనఖరుండు గరుడుఁడు
పగ్రముండై వచ్చి నిలిచి • నం గని భీతిన్. 44

క. ముడిచెం దలలుం దోఁకలు
కుడిచెం గడుఁ గోడు కోల్లు • కుతలాధిపులన్
విడిచెం బదపదమనుచున్
నడిచెన్ వడి వచోటు వాసి • నాగము లెల్లన్. 45

ఉ. అప్పుడు వైనతేయగరు•దంచలవాయుసుధారసాప్తిచే
నొప్పుగఁ బోర నీల్గిన వ•నౌకసు లెల్లను లేచి రా నృపుల్
దెప్పిలి రంత రాముఁడు బి•లేశయశాత్రవ! ప్రోచితౌ మమున్
మెప్పుల కేమి మజ్జనకు•నిం గనురీతిగఁ జూచెద న్నినున్. 46

చ. అన వినతాతనూభవుఁడు•హర్షసమగ్రమనస్కుఁడై నృపా
లుని గని దేవ నీవఖిల•లోకవిభుండవు గావె నేను బం
టనుగదె యిట్లనం దగునె•నాకు ననుజ్ఞ యొసంగుమంచు పే
డ్కొని చనె నంతఁబద్మహితుఁ•డుంగనన య్యెనఖండదీధితిన్.

వ. అత్తఱి నత్తెరుచరవరు లసురపురంబుఁ గ్రమ్మఱం జుట్టుముట్టి సింహనాదంబులు చెలఁగ దగ్గున లగ్గలు పట్టి దనుజభటుల ఘట్టింపం దొడంగిన. 48

మ. అపు డారావము రావణుండు విని య•త్యాశ్చర్యుఁడై రాఘవుల్
గవుఁబుం గ్రమ్మఱ నెట్టులో బ్రతికిరే•కా నాక జేయుల్ గదే
రిపులం గెల్వఁగ లే నటన్న తఱి వా•రిం బోరఁ జక్కాడి దై
త్యపురిన్ నన్గొని యూపవత్తునని ధూ•మ్రాక్షుండు తామ్రాక్షుఁడై

క. చతురంగబలయుతుండై
దితిజుం డేతేరఁ గపులు ♦ తేఁకువఁ బృతనా
తతి దునిమిన నంత మరు
త్సుతుఁ డొకపెనుఁగొండ వైచి ♦ ద్రుంచెన్ వానిన్. 50

గీ. అపుడు హతశేషు లేగి ధూ ♦ మ్రాక్షుపాటు
వినిచిన దశాస్యుఁ డతిరోష ♦ వివశుఁ డగుచు
వజ్రదంష్ట్రుని యోగింప ♦ వచ్చె వాఁ డ
పారసైన్యముతో నుద ♦ గ్ద్వారమునను. 51

శా. ఆరీతిం జనుదెంచి వానరుల నా♦నాస్త్రప్రహారంబులం
గారింపం గడివీరు లాబలము స్రు♦క్కంజేసినం బీరమే
పారం గేలను వజ్రదంష్ట్రుఁ డడిదం♦బంకింపఁగా నంతటం
దారేయుం డది లాగికొంచు నఱికె♦న్వానిన్ నిమేషంబునన్.

క. ఆవార్తలు దశముఖునకు
దేవారులు కొందఱేగి ♦ తెలిపిన విని కో
పావేశుఁడై యకంపను
నావైరులఁ ద్రుంచిరమ్ము ♦ టన్నన్ వచ్చెన్. 53

క. వచ్చినయకంపనుని గని
దచ్చి కడలు పగుల నార్చి ♦ దాఁకి నగముచేఁ
జెచ్చెర వధించి వానిం
బుచ్చెన్ యమపురికిఁ బవన ♦ పుత్త్రుం డంతన్. 54

వ. హతశేషదోషాచరులవలన నకంపనునిపాటు విని రావణుండు

మ. కుటిలభ్రూకుటిదుర్నిరీక్షవిలస • త్క్రోధాత్ముఁడై నీవు ము
ర్కటకోటిం బరిమార్చి రమ్మని మహా • కాయున్ని యోగించినం
దిటమొప్పంజతురంగసైన్యయుతుఁడై • దిక్కుల్ చలింపన్ విశం
కటఘంటారవ మొప్పఁ దేరుపయివే • గం బెక్కి యుగ్రాకృతిన్

గీ. రుధిరపవనాశనులు దుర్ధ • రుండు కాల
కల్పగతమాయులును ధూమ • కాలదంష్ట్ర
వజ్రనాభులు ననుమంత్రి • వరులు తమ్ముఁ
డగుమహానాదుఁడును గొల్వ • నరుగునపుడు. 57

క. పెక్కుమహోత్పాతంబులు
నక్కజముగఁ దోఁచుచుండ • నవి దైత్యవరుల్
లెక్కగొనక నలుదిక్కులు
పిక్కటిలం బేర్చి యార్చి • పెలుచం గదియన్. 58

ఉ. దోఃకలితాద్రికూటముల • తోఁ గపివీరులు పెల్లుగాఁగ్రుధాం
తఃకరణంబు లొప్ప వడి • దానవసేనలగండడంపఁ జ
త్కుఃకలుపాసిశూలపర • శుప్రముఖాయుధపాణులై నరాం
ధకులవీరు లాగ్రహము • నం గదనం బొనరించుచుండఁగన్.

శా. అంత్రం బంటఁగఁ గర్ణముల్ పెఱికి బా • హాశక్తి యొప్పారఁ ద
న్మంత్రివ్రాతములం బ్లవంగులు వధిం • పన్ ధీరతన్ గ్రవ్యభు
క్సంత్రాసంబుగ వాలిపుత్త్రుఁడు మహా • కాయున్ మహానాదుదు
ర్యంత్రంబుల్ గొనసాగనీక చదిపెన్ • రక్షోవరుల్ భీతిలన్.

శా. ఆమాటల్ విని రావణుం డదరిహా • హాకారముం జేయుచున్

మోముల్ వంచియు బాష్పధార లొలుకన్ ♦ శోకించి యొ [క్కింత ధై
ర్యామర్షంబులతోఁ బ్రహస్తుఁ గని సే♦నక్కుంభకర్ణుండు ను
త్త్రామద్వేషియుఁగుంభుఁడీవు వెలిగాఁ♦బ్రత్యర్థులం ద్రుంచుతు శే

ఉ. కావున నీవు మద్రిపుని♦గం డడఁగింపుము లెమ్ము చెచ్చెరన్
నావుడుఁ దూర్యనాదములు♦సల్లడపం జెలఁగన్ ద్రిభాగసే
నావృతుఁడై స్వమంత్రియుతుఁ♦డై బలుఁదేరిగ వచ్చె నాజికిన్
రావణుఁడీతఁ డేమొ యని♦రాఘవు లద్భుతమందఁజూడఁగన్

వ. అట్లు వచ్చి ప్లవంగపుంగవులం జుట్టుముట్టి కట్టల్క నొక్కపె
ట్టునఁ బట్టి సాసిగదాఖడ్గకుంతప్రాసపరశుపరిఘాదివివిధాయు
ధంబులు వరపి పరిమార్పం దొడంగిన మోహరించి సంరంభ
విజృంభితులై. 63

ఉ. పర్వతపాదపాయుధు ల♦పారబలాన్వితు లాప్లవంగముల్
దోర్విజయం బెసంగ సుర♦దుర్వారదసేనల నేపణంచి గం
ధర్వమదావళోన్నతర♦థంబుల నుగ్గుగఁ జేయుచుండినన్
బూర్వసుపర్వ లుగ్రముగఁ♦బూనికఁ బీనుఁగుపెంటఁ జేసినన్,

గీ. తవిలి ద్వివిదుఁడు వడి నరాం♦తకుని దుర్ము
ఖుఁడు సమున్నతుఁ దారుఁడు ♦ కుంభహానుని
గదు మహానాదు జాంబవం♦తుఁడును గూల్చి
రంతఁ గొండలు పటచి ర♦య్యనికిఁ దొలఁగి. 65

వ. అప్పుడు. 66

క. తనమంత్రివరులు పడుటయు
దనుజులు పారుటయుఁ జూచి • దారుణపటహ
ధ్వను లులియంగఁ బ్రహస్తుం
డని సేయఁగడంగి క్రోధ • మగ్గలమందన్. 67

శా. వచ్చెన్ భీతిఁ దొలంగి పారుదనుజ • వ్రాతంబులం గ్రమ్మఱం
దెచ్చెం జివ్వకు విక్రమం బెసఁగ మ • ర్దించెం గపిశ్రేణులన్
మెచ్చెన్ డెక్కొని మెక్కి జన్యభుజుఁడా • నిం డారుపౌరత్రతిన్
జచ్చెన్ నీలకరాళహస్తపతిత • క్ష్మాభృత్తుచేఁ జూర్ణమై. 68

శా. అంతన్ రావణుఁ డవ్విధంబు విని సై • న్యాధీశుఁ డింద్రాదిది
క్కాంతారాతి ప్రహస్తుఁ డాలమున వీఁ • కం గ్రోతిచేఁ జచ్చెనే
యొంతయ్యెన్ దన కింకరాముననిలో • నేఁ ద్రుంతుఁగాకం చుదు
ర్దాంతక్రోధనిమగ్నుఁడై ప్రధనయా • త్రాభేరి వ్రేయించినన్.

క. దిక్కుల్ తూలెన్ నగముల
ముక్కల్ రాలెన్ ధరిత్రి • మ్రొగ్గె నభంబున్
వ్రక్కల్ వాసెం దివిఁ గ్రతు
భుక్కుల్ సోలిరి తదీయ • భూరిధ్వనిచేన్. 70

శా. బుగ్గల్ తగ్గనివారిబుగ్గలగతిం • బొంగారఁ జూడం గడున్
జగ్గై తూఁడులతోడఁ బొవ్వదుపయో • జప్రక్రియన్ పాన్పువున్
హిగ్గాలెల్ వెనువాతలన్ నిలిపి మో • యింపన్ సురారుల్ వడిన్
మొగ్గెం దిగ్గజముల్ తదారవదళ • చ్ఛ్రోత్రంబులై బల్విడిన్.

ఉ. అత్తఱి మత్తవారణము • లశ్వములున్ రథముల్ పదాతులున్

మొత్తములై యమాత్యులు చ♦మూపతినందనముఖ్యమర్త్యప్రభు
కృత్యము లెల్ల నత్తఱి యిరు♦చక్కియలందునఁ గొల్చుచుండఁగా
నుత్తరపుందువారమున♦హాంబని తేరొక టెక్కి టెక్కఁగన్.

సీ. జంభారిపిభపకా♦సారసాంద్రాతప
శిఖియశఃకౌముదీ♦చిత్రకిరణ
దండభృద్దోర్గర్వ♦చండాంశుజీమూత
యాతుధానప్రతా♦పాభ్రవాత
పాథోధిరాణ్మోద♦పవనకుంభీనస
పవమానబలగూఢ♦పదగయూర
శ్రీదసంపన్మహా♦శిఖశరదవసర
యీశరోషశరత్కు♦శేశయహిమ
రాక్షసేశ్వర సురభీక♦రా దశాస్య
స్వామి దేవ పరాకు హె♦చ్చరిక యనుచు
బిరుదుఁబాటలనెల్లను♦బేరుకొనుచు
వందిమాగధు లిరుకేల♦లందు నడువ. 73

సీ. పృథులనిర్ఝరసమి♦ద్ఝరీపరంపర (భయంకర)
భాంకార మభ్రంబు♦పగులఁజేయ
స్ఫుటనినదత్సము♦ద్భటపటహాభీల
ఘాంకారమబ్జజాం♦డములు నిండ
ముఖగంధవహముహు♦ర్ముఖరితాబ్ధికరాళ
భుంకార మెదురను♦బోరుకొనఁగఁ

చాటపకోదండ ♦ బద్ధమౌర్వీలతా
టంకారమరిరాజి ♦ జంకువఱుప
గండు మీఱియుఁ దండోప ♦ తండముగను
దండు దండిగ దండను ♦ ద్దండచండ
భండనోద్ధతిఁ జనుదేర ♦ దండనాథ
మండలము గొల్వ దానవా ♦ ఖండలుండు. 74

క. పురపుణ్యసతులు మంగళ
కర మగుహారతులు పట్టఁ ♦ గైకొనుచుఁ బ్రభా
కరకులనాథజిగీషం
గరము రుమగఁ బురము వెడలెఁ ♦ గదనోన్ముఖుఁడై. 75

వ. అప్పుడు. 76

క. పిడుగులు రథములపైఁ బడె
వడి నెత్తురువాన గురిసె ♦ వారిద మొసరన్
సుడిగాలి వీచె వఱదులు
కడుఁ గూసెన్ వానికాత్మఁ ♦ గలఁగక వచ్చెన్. 77

ఉ. వచ్చుచునున్న వాసిఘన ♦ వైభవ మారసి రాఘవుండు లో
నచ్చెరువంది చెల్మికియల ♦ ఘోర విభీషణుఁ బిల్చి విక్రమం
బచ్చుపడంగ సైన్యయుతుఁ ♦ డై చనుదెంచెను జివ్వకెవ్వఁడో
చెచ్చెర వానిశౌర్యకుల ♦ శీలవిశేషముఁ దెల్పవే యనన్. 78

గీ. అనిఁ బ్రహస్తుఁడు వచ్చుట ♦ విని దశాస్యుఁ
డాతురుఁడు మాతులవధాభి ♦ భూతమురభి

మానమానసుఁడై కల • సేనతోడ
వచ్చె నని సేయ నట నున్న • వారి వినుము. 79

ఉ. మేచకనీరదంబు నుప • మింపఁగఁ జాలెడుదేహ మొప్పఁ దా
రాచల మెత్తినట్టిసుభు•జావళి చెన్నలరార రత్నభూ
షాచయ మాతపత్రములు • చామరముల్ విలసిల్లఁగాఁ దమి
స్రాచరవంశనాథుఁ డగు • రావణుఁ డాతఁడుసుమ్ము రాఘవా!

సీ. వార లందఱు సమ్ముఖ • వర్తులైన
దొరలు సేనాధిపతు లమా • త్యులు కుమారు
లు పరిచారులు బాంధవు • లు మఱి మూల
బలమును మ్మది కనుఁగొంటె • పార్థివేంద్ర! 81

వ. అనిన విని తేఱిచూచి విస్మితుండై రఘువీరుండు. 82

క. ఆపుత్త్రికు లాభాగ్యం
బాపుర మాసైన్య మామ • హాతేజ మహో
పాపుఁడయి చెఱుచుఁకొనెఁ గా
కీపృథివిస్థలి యితండ • యేలం దగఁడే. 83

మ. అని సౌమిత్రియుఁ దానునుంగడఁగి • దివ్యాస్త్రప్రధానాజిసా
ధనముల్ పెక్కఁగఁ బూనియున్నతఱి దై • త్యస్వామియాత్మీయసే
నను నిల్వ న్నియమించి తాను గపిసే•నందోలఁగాఁ జొచ్చినం
గినుకన్ వానిపయిన్ మహీధరమును • గ్రీవుండువైచెన్ ధృతిన్

వ. అప్పుడు దశకంధరుండు. 85

ఉ. తోడన దాని నస్త్రములఁ • దూలఁగఁ జేసి శరాసనంబునన్

వాఁడి శరం బమర్చియు ది♦వాకరపుత్త్రుని వైవమూర్ఛిలెన్
వేఁడిమి నంత నద్రిచర♦వీరులు కొందఱు వచ్చి తాఁకినన్
వాఁడవు దుర్గబాణములు♦వైచి కలంచెను వారినయ్యెడన్.

వ. సుమిత్రాపుత్త్రుండు రామచంద్రు నవలోకించి. 87

గీ. అసురవరుఁ ద్రుంతు నా కాజ్ఞ ♦ యొసఁగు మనఁగఁ
ఘోర మున్న ముక్కాఁకలఁ ♦ దేరినాతఁ
డేమరక నీవు నని సేయు ♦ మీ యటన్న
యుద్ధసన్నద్ధుఁడై చను ♦ చుండ నపుడు. 88

క. అతని కిష్టముగాఁ జని
వాతూలసుతుండు పక్షి ♦ వక్త్రున కనియెన్
దైతేయనాథ రణమున
కేతెంచితి నీవటోయి ♦ యింతయ్యెఁగదా ! 89

గీ. గృహము లారామములు పున ♦ స్సృష్టి యయ్యె
నా ? కుశలమా కులమ్ము ప ♦ రాకు వచ్చె
నా ? భవత్పుత్త్రినిష్ఠుఁ జ ♦ క్కాడినట్టి
వాఁడ ; హనుమంతుఁ డనునట్టి ♦ వాఁడ వినుము. 90

మ. అనుచున్ దక్షిణహస్త మెత్తి ముము స♦ర్వాశాధిపాలాదిదే
వనికాయంబు నలంచితి న్నను జయిం♦పన్లేరొరు ల్నాక మ
ఘనముష్టింగొనుమన్న వాయుతనయుం♦ దైత్యేశ్వరుండల్కఁజో
ప్పునఁ గేలం బొడుపంగఁ గన్నుఁగవ కెం♦పుల్ మీఱఁ దా
[నయ్యెడన్.91]

చ. వడి నరదంబుపై కెగసి ♦ వాసవవైరియురంబుదాఁక కే
ల్దొడరిచిపట్టి గ్రుద్దిన బొ ♦ ఘుక్కున నెత్తురు గ్రక్కి తేరిపైఁ
బెడతల గాఁగ మూర్ఛను గు ♦ భేల్లునఁ గూలి యొకింతసేపులో
వడఁబడఁబోయి లేచి పిద ♦ పన్ హనుమంతునిజూచియిట్లనున్.

క. ఔరా ! నీపోటునకు స
మీరసుతా ! మెచ్చితిం జు ♦ మీ యన ఛీ నీ
వీరీతి బ్రతికి మెచ్చినఁ
బౌరుషమే నాకు సిగ్గు ♦ పడుచుంటిఁగదా ! 93

గీ. అనుచు నిడె యొక్కపోటు గొ ♦ మ్మనిన వాఁడు
నెగసిపడి యుగ్రుఁడై వక్షు ♦ మగులఁ బవన
పుత్త్రుఁ బిడికిటఁ బొడిచిన ♦ ధాత్రిమీఁద
బోరగిలఁబడి మూర్ఛను ♦ బొందె నపుడు. 94

మ. దనుజాధీశుఁడు నీలుపైఁ గవిసెనం ♦ తన్ వాయుసూనుండు లే
చి నగాటాధిపుఁ జెంత నిల్చె నట నా ♦ జిన్ నీలుఁడాపఙ్క్తివ
క్త్రునిపైఁ బాదపజాల మేయ దశకం ♦ ఠుఁడన్నిటిం ద్రుంచియ
స్త్రనికాయంబులుకిన్కవైవ దిశలం ♦ టంబెల్లుగానార్చుచున్.

గీ. నీలుఁ డల్పాంగుఁడై దైత్య ♦ పాలు తేరి
పై కుఱికి నెత్తి పడమొత్తి ♦ పడగ విఱిచి
నోరువడి నొక్కి ముక్కొక్కి ♦ నుదురు ఱక్కి
గొడుగు విడఁజించి పిడికిఁటఁ ♦ బొడిచె మెడల. 96

వ. అప్పు డప్పఙ్క్తికంధరుండు దెప్పరంబుగా నుప్పతిల్లుకోపంబు

న నిట్లనియె. 97

క. నీలా నీలా వెలుఁగుదు
నేలా యీలీల మెలఁగ • నెక్కువగుదువే
నీలో నాలోచింపుము
చాలం జికిలింతయేపు • సామ్యముగాదే. 98

క. అనుచు ననలాశుగముఁ గై
కొని కొఱకొఱ నేయ మూర్ఛఁ • గొని పడియె వడిఁ
దను జేశుఁ డంత సౌమి
త్రిని బిలుచుచు నురువణించెఁ • దీవ్రస్ఫురణ్.

గీ. ఇట్టు లురవణించి • యేడమ్ములను సుమి
త్రాతనూజు నేయ • నాతఁ డలుకఁ
బెక్కుసాయకముల • రక్కసిదొర నేయ
స్రుక్క కతఁడు మఱియు • నుక్కు మిగిలి. 100

క. కనకోదరదత్తాశుగ
మున నాసౌమిత్రి నొంప • మూర్ఛాలసుఁడై
కినుక వడి లేచి రావణు
ధమవు నఱికి తిగశరములు • తనువున నేయణ్. 101

గీ. ఉలికి చతురాస్యదత్తమ • హోగ్రశక్తిఁ
నేలఁ గీలించి యిదె నిన్ను • గీటడంచు
నంచు సౌమిత్రి నేసిన • నతఁడు దాని
చే మహీస్థలి వ్రాలి మూ • ర్ఛిల్లె నపుడు. 102

గీ. దశముఖుఁడు తేరు డిగి సుమి ♦ త్రాతనూజుఁ
గొన దుమికి విష్ణుతేజమం ♦ దునికిఁ జేసి
కేలఁ గదలింపఁ జాలక ♦ శూలికొండ
కన్న బరువయ్యె నహహ! నా ♦ కరములకును. 103

వ. అనుచుం జేతులు నులుపుకొనుచుం జేయునది లేక విశాకు పడి యుండ నత్తఱిమరుత్తనయుండు బిరబిర నరుదెంచి యసురవరుని వీక్షించి. 104

గీ. తొలఁగరోరిదురాత్మ నీ ♦ త్రుళ్లు త్రుంగ
నంచుఁ జెయ్యూఁచి గ్రుద్ది రా ♦ మానుజన్ము
నెత్తుకొని భక్తిఁ జని యార ♦ ఘూత్తమునిస
రస వెసను డించె; నయ్యెడ ♦ నసురవరుఁడు. 105

ఉ. పావనిగ్రుద్దునం బుడమి ♦ పైఁ బడి నెత్తురు గ్రక్క లేచి ధై
ర్యావహుఁడై వెసన్ రథము ♦ నందు వసించికడంగెఁబోరికిన్
భూవిభుఁ డంతటం బవన ♦ పుత్త్రునిమూఁపున నెక్కి గ్రక్కునన్
రావణుఁ ద్రుంతు నింకఁ గల ♦ నన్ విధిశంకరులడ్డువచ్చినన్.

మ. అని మార్వీరవటంకృతుల్ చెలఁగ దై ♦ త్యాధిశునీక్షించియో
రి నృశంసా! యిఁక నెందుఁ బోయెదవు గా ♦ రింతున్ నినుం [బోరిలో
మును నీవా రగునాఖరాదులబలెన్ ♦ మోసంబునం బొందెదీ
వనినన్ రాము నలంతిగాఁ దలఁచి కో ♦ పావేశుఁడై యిట్లనున్

సీ. చెనఁటినిరాబారి ♦ మినుకులు పచరించి

నడుదారిఁ బడఁతుక ♦ మడిపినట్టి
జగములఁ బొగడిక ♦ నెగడినతిగకంటి
దొరఁబల్లిదపువిల్లు ♦ విఱిచినట్టి
మన్నింపఁదగియున్న ♦ జన్నిగట్టడుగులు
కుమతివై తెగవ్రేయ ♦ దుమికినట్టి
యిచ్చ నాకిలిఁ జేర ♦ వచ్చినమాత్రి రా
కాసిముక్కుం జెవుల్ ♦ గోసినట్టి
దోనకారిని నినుఁ గట్టి ♦ గాసి వెట్టి
యీసురారులతమి మీఱి ♦ నీసు దీఱఁ
బాసిపోనీక కలనకు ♦ డాసి భీక
రాసి ఖండింతు వన్నెయు ♦ వాసి గాంతు. 108

సీ. ఫలమూలముల మెక్కి ♦ మెలఁగఁగ వని గాదు
దారుణాయోధన ♦ ధరణిగాని
మురియుచు వాలింప ♦ మునులపల్కులుగావు
రణభేరికారవా ♦ ర్భటులుగాని
దృషదింధనముల బం ♦ ధింప సింధువు గాదు
అమిత్రదైతేయసే ♦ నాబ్ధిగాని
మఱువుగా వధియింప ♦ మర్కటపతి గాఁడు
జనభయంకరదశా ♦ ననుఁడుగాని
యొచిరి కదనంబు సేయ నీ ♦ వెంతవాఁడ
వరయ నలినాననగాశు ♦ గానబల

శాసనుల కైన నిలువంగ ♦ శక్య మగునె
వనికిఁ గ్రమ్మఱఁ గాకుత్స్థ ♦ చనుము చనుము. 109

వ. అని యనేకప్రకారంబులం దిరస్కారపూర్వకంబుగా వీరా లాపంబు లాడుచుం దాడిసేయుచు నారిగ్రమోయించుచుం గ ర్వ్యంబునకుఁ బిఱుతివియక దవానలంబు చేరంబోవుచు మి ట్టిమిట్టిపడుమిడుతవడువున మిడిసిపడుచుఁ గడలేనిగడిలపుఁగడి మి యడర నప్పు డప్పుడమియోడయని పైం బెట్టిదంపుటంపగ ములు నింపిన. 110

ఉ. అంతరఘూద్వహుండుమది♦నల్కఁ గనుంగవఁగెంపులొల్కవి ల్లెంతయు నెక్కువెట్టి నిశి♦తేషుపరంపర నింపి కూలిచెఁ యంత్రపతాకచక్రకవ♦చాశ్వములన్ మఱియుం గిరీటపుం బంతులు డుల్చి యర్ధశశి♦బాణము వైచి కడంగి వెండియున్

గీ. భిదురసదృశమైన ♦ బెడిదంపుటమ్ముచేఁ
బోరఁ దూల నేయఁ ♦ బోఁడి మడఁగి
కొమ్మ లెల్ల నఱికి ♦ కొనిపోవ నిల్చిన
మోడుపగిది నుండె ♦ మోము వంచి. 112

గీ. అపుడు రాముఁ డసుర ♦ నరసి యోరావణ
యెంతయువిధి వచ్చె ♦ నింటి కరుగు
మెల్లి వత్తు గాని ♦ యిఁకనీవు బవరము
సేయలేవు తూలి ♦ పోయినావు. 113

వ. అని పరమకృపాళుండైన నృపాలుండు పలికినం బరాభవ

ఖిన్నుండై. 114

క. ఆరక్కసిదొర గ్రక్కున
వేఱొక్కని యరదమెక్కి • వీటికి మరలెన్
శ్రీరాముఁడు చని తమ్ముని
గారవమున సేదదేర్చెఁ • గౌతుకం మలరన్. 115

వ. నీలుఁడు నంతకుమున్న సేదదేరి సేదదేరుచు రఘువీరుం జేరి
యుండె. 116

క. అప్పుడు కపులొకకొందఱు
గుప్పున నరదంబు చుట్టు • కొని నవ్వుచు నీ
కొప్పునె యిటు చన నప్పటి
తప్పట లెటువోయె నోరి • దానవ చెపుమా. 117

గీ. అనిన మాఱ్మాట లేక దుః • ఖాంబురాశి
మునుఁగుచును దేలుచును బురం • బునకుఁ బోయి
నగరివాకిట నరదంబు • డిగి యమాత్య
పరివృతుండయి కొలువుండె • పఙ్క్తిముఖుఁడు. 118

ఉ. కొండొకసేపు చింతిలి య • కుంఠితవిక్రమశాలి కుంభక
ర్ణుండు మదీయసోదరుఁ డ • మానభుజాబలుఁ డింద్రభీకరుం
డుండఁగఁ జింత యేల యతఁ • డుక్కడఁగింపఁడె శత్రులన్ వడిన్
లెండు చనుండు మీరతని • లేపుఁడు పాపుఁడు నిద్రయంతయున్.

వ. అని పనుప యూపాక్షాదిరాక్షసవీరు లసంఖ్యభక్ష్యభోజ్యాది
బహుపదార్థంబులు గొని చని తదీయశయ్యాగృహద్వారం

టు చేరంబోయి. 120

ఉ. ఆసయంబునందుఁ బల•లాశులు గొందఱు తద్భయంకరో
చ్ఛ్వాసనమీర మొత్తిపడ•నైచిన ముక్కులు ముక్కలై కడున్
గాసిలువారు పక్కియెము•కల్ నడుముల్ సడునెత్తి వ్రక్కలై
పాసినవారు కాళ్లుపడి•ప్రాఁకెడువారలు నైరి చూడఁగన్. 121

క. క్రమ్మఱఁ గొందఱు నిశ్వా
సమ్మునఁ దద్బలము సొచ్చి • శవముల వెంటన్
నెమ్మి వెడలి తలదెస వెసఁ
గ్రమ్మి యినుపగుదెలఁ గ్రుమ్మి • కదలకయున్నన్. 122

క. కళపెళ నుడికెడు తైలము
బలితపుఁబనఁటులను దెచ్చి • పలుమరు వీన్వీ
నుల నిండఁబోసి ముకుబారి
యలు మూయ నొకింత తెలివి • నలవు గొలుపఁగన్. 123

మత్తకోకిల. వారి నారసి నన్ను లేపిన•వార్త దెల్పెఁదు దేవతా
వైరిపీనిదేశలంఘన•వర్తనోత్సుకులై సునా
సీరముఖ్యహరిద్వరుల్ సుర•సేనతో మనలంకపైఁ
బోరొనర్పఁగ వచ్చిరా మఱి•భూరివిక్రమశాలులై.

ఉత్సాహము.

అనిన యాతుధాను లెల్ల • నల్లనల్లన కరజీ
వనజయుగము దోయిలించి • వరుస నిలిచి వార్ధిఁ గ
ట్టినది మొదలుగాఁగ నాగ•డియువఱకు రఘూద్వహుం

దును గపులును బొనరిచినప • నులు వచింప దీనుఁడై. 125

పంచచామరము.

అహో యహోధిపాత్మజా • ద్యహార్యసంచరావళీ
సహాయతన్ సమగ్రబాహు • శక్తిబద్ధవార్ధియై
మహామహోగ్రుఁడై తమూకు • మారికావిభుండు నా
గ్రహించి విగ్రహంబు సేయు • కచ్చ లంకఁ జొచ్చెనే. 126

తరళ. అనిమిషేంద్రముఖామరావళి • కాత్మహర్షము పుట్టఁగా
వనచరేంద్రులు పాదపాద్రులు • వైచి వార్ధిని గట్టఁగా
మనుజఘస్మరచక్రవర్తికి • మర్త్యుచే నని గిట్టఁగా
వనజపీఠి లలాటపట్టిక • వ్రాసె నట్టన గట్టిగాన్. 127

తోటకవృత్తము.

అని యెంతయుఁ జింతిలి • యప్పుడు తెం
పున లేచి పసాదము • మున్నుగ మె
క్కని శాంతము వెల్వడెఁ • గేసరి మేల్
కని కందర వెల్వడు • కైవడిగాన్. 128

గీ. అటులు వెల్వడి సర్వాంగ • హాంతరితమ
మానదండస్థితిఁ దనర్చు • మనుజఘస్మ
రాధిపానుజుఁ గాంచిభ • యాత్ము లగుచుఁ
బఱచి రక్షోభటావలుపలి • ప్లవగభటులు. 129

గీ. అంత ఘటకర్ణుఁ డలుకఁ ద • శాస్యుకడకుఁ
జని యథోచితవిధి గాంచి • సరగఁ దత్ప్రి

బోధితాఖిలవృత్తాంతుఁ ♦ డై ధనేశ్వ
రావరజుదుర్ణయంబున ♦ కాత్మఁ దలఁకి. 130

చ. వినయము దోఁపఁగాఁ బలికె ♦ వేమరు రావణుఁ జూచి దేవనే
మును రఘువీరుతోడఁ బగ ♦ మోసము వచ్చునటంచుఁ దెల్పనే
జనకతనూజఁ దెచ్చుటను ♦ జచ్చుట నిక్కువ మంటిఁగాదె ని
న్ననఁ బనియేమి కాల మిపు ♦ డందఱకున్ సమకూరెనీగతిన్.

ఉ. భూమిజ యాదిలక్ష్మి రఘు ♦ పుంగవుఁ డామురవైరి వానర
స్తోమము దేవతాగణము ♦ దుర్భయవృత్తిఁ జరింపనీ కయో
సేమముగాదు నారదుని ♦ చే మునువింటి యథార్థమింతయున్
సామముతో మహీసుత నొ ♦ సంగుము మేలగు నెన్నిభంగులన్

మ. అనినన్ బఙ్క్తిశిరోధి క్రోధమున నా ♦ హా చాలు నిర్భీతి ని
ట్లనుటన్ నీవు విభీషణున్ మిగిలిన ♦ ట్లై తోఁచెఁగా నిమ్ముభూ
తనయారాములు శ్రీమురారు లగుచే ♦ తథ్యంబు పంకేరుహా
సనుఁ డెల్లేరికి వ్రాసెనో యదియన ♦ శ్యంబున్ లభించుంగదా.

క. అనఁ బనఁటిచెవులరక్కసి
మనమునఁ బరితాప మేల ♦ మన్నించి నన్
బ[illegible]దినఁ జని రఘువీరుల
సనేఁ దునిమెదఁ గపులఁ దినెద ♦ నాఁకలి దీఱన్. 134

మ. అని హర్షం బొదువంగఁ బల్కి దశకం ♦ ఠానుజ్ఞచే భేరికం
ఖనినాదంబు సెలంగ వారణతురం ♦ గంబుల్ రథంబుల్ భటుల్
దనుఁగొల్వంగఁ గరాళశూలముశ కే ♦ లంబూనిదివ్యాస్త్రముల్

గాని యేతెఱఁగ వానిఁ గన్గొని ప్లవం♦గుల్ పాఱఁగాఁ జొచ్చినన్

గీ. అపుడు నరవరావిభునిరాముఁ ♦ డరసి యిటులు
పుడమి కాకసమున కొప్ప ♦ పొడవుగలుఁగు
వాఁడు వీఁ డెవ్వఁ డన్న రా ♦ వణునితమ్ముఁ
డగ్రజుఁడు నాకుఁ గుంభక ♦ ర్ణాహ్వయుండు. 137

చ. ఇతఁడు జనించినప్పుడు మ♦హింగలజంతుల మ్రింగఁ జొచ్చినన్
శతసవనుం డెఱింగి తన♦శస్త్రము వైచిన లెక్కసేయకే
సితకరిదంతముల్ పెఱికి♦ చేకొలఁదిన్ బడమోఁది జంభభి
ద్ధృతిఁ దూలఁగింప ధాత కడిఁ♦దిన్ శపియించె నుదగ్రకోపుఁడై;

గీ. దాన నీతఁడు నిద్రించు ♦ ద్రుమానుపగిది
నాఱునెలలకు లేచి యా ♦ హారము గొను
విజయుఁ డగునొక్కనాఁడు నా ♦ వేళ నైన
బలిమి మేల్కొన మృతి యని ♦ యజుఁడు పలికె. 138

క. అన నివ్వెఱపడి వానిం
గనుఁగొనుచుండఁగ నంతఁ ♦ గదియఁగ నేతెం
చినకుంభకర్ణుపై న
వ్వనచరు లురుతరులు గిరులు ♦ వైచిన నవియున్. 139

ఉ. ఆతని రొమ్ముఁ దాఁకఁ బొడి♦యై చనఁ గ్రమ్మఱఁ బాదపాద్రిసం
ఘాతము లొక్కపెట్టుగను♦ గప్పిన వానిని నుగ్గుఁ జేసి వె
న్వాతను వానరావళిని♦ వైచిన గొబ్బున ముక్కలాఁగలం
జాతుఁడి మీఱి వెన్వడ ని♦ శాచరవీరుఁడు గాంచి యుగ్రుఁడై

గీ. దండుపైఁ బడి కడువడి ♦ రెండుచేతు
లను బొదివి పట్టివానరు ♦ లను గరంబు
నులిమి ముద్దలు గావించి ♦ పెలుచ వదన
నుషిరమున వైచి త్రింగఁగాఁ ♦ జొచ్చె నపుడు. 141

గీ. పెనుమలలు వైచి పడమోఁది ♦ కినుక వొదల
ద్వివిదహనుమద్గజగవాక్ష ♦ గవయముఖ్య
కపివరులు వానిమేనెల్లఁ ♦ గలయఁ బ్రాఁకి
కఱచి ముక్కలులాగఁ జి ♦ కాకునొంది. 142

క. ఝూళించి మేని నెంతకుఁ
దూలక క్రమ్ముకొని నొంచు ♦ ద్రుమచరవరులన్
గాలన్ నేలం జమరుచుఁ
గేలం బడమోఁది మిగుల ♦ గీటణఁగించెన్. 143

ఉ. ముక్కులు ముక్కలై వెతల ♦ ముక్కుచు మూల్గుచు నెల్గు [లొప్పఁగాఁ
బ్రక్కలు వ్రక్కలై పొలుసు ♦ బల్విడి వెల్వడ వాతనెత్తురుల్
గ్రక్కఁగ గ్రక్కుచున్ దలలు ♦ గంట్లయిబంట్లగు రక్కసుల్ నగన్
జెక్కులు చెక్కలై కపులు ♦ చిక్కిరి పొక్కిరి కొందఱందులన్.

క. ఉఱుగ నిటు లసుర వెఱవక
తఱుఁగని బీరమునఁ బోఱఁ ♦ దరిమినఁ గని యు
త్తఱి ఖరకిరణునికొమరుఁడు
కొఱకొఱ నొకతరువు పెఱికి ♦ కొని మఱి చఱచెన్. 145

క. రక్కసిదొరపై వైచిన
మిక్కిలికోపమున మనసు ♦ మొందుకొన హవి
ర్భుక్కీల లడరుశూలము
గ్రక్కున సుగ్రీవునేయఁ ♦ గని యనిలజుఁడున్. 148

గీ. ఉఱక నడ్డము చని దాని ♦ నొడిసిపట్టి
బిట్టులావొప్ప మోఁకాలఁ ♦ బట్టివిఱువఁ
గనలి ఘటకర్ణుఁ డర్కజుఁ ♦ గదిసి మోఁది
వివశుఁ డగువానిఁ గొని తన ♦ వీటి కరిగె. 149

గీ. కపు లపుడు కుందఁ బావని ♦ గాంచి పల్కె
వెఱవ నేటికి యాదైత్యు ♦ వికృతరూపుఁ
జేసి యిదెవచ్చెఁ గాకున్న ♦ నే సురారిఁ
దునిమి మనదొర విడిపించు ♦ కొనన యనుచు. 149

చ. అటు తనమూఁపుపై నిడుచు ♦ నయ్యమరారి చనంగపీంద్రుఁడం
తటఁ దెలివొంది యేమొకొ వి ♦ తాకగుచున్న దియెందునుండి నే
నెఱు చనుచున్న వాఁడనొకొ ♦ యెక్కడివాఁ డితఁ డన్యుఁ [డొక్క మ
ర్కటబల మిందు లేదు ఘట ♦ కర్ణుఁడు నన్నిట కెట్లు తెచ్చెనో.

క. అవుఁగాక వీని నిదె త
క్కువపఱిచెద ననుచు వాని ♦ గూబల కంటం
జెవు లెక్కలాగి పెనుము
క్కు విడఁగొఱికికొని బలీము ♦ ఖుల్ పెల్లార్వన్. 150

క. కడువడి నరుదెంచి ముదం
బడరఁగ రఘుపతికి మ్రొక్కి ♦ నయ్యెడ దనుజుం
డడుగడుగునఁ దనపోఁడిమి
చెడుట కుడికి తడవు మిడికి ♦ చిడిముడిపడుచున్. 151

చ. మునుపటు చెల్లెలుం జెవులు ♦ ముక్కును బోయినలజ్జ బ్రుంగియుం
డను రఘువీరులం గలన ♦ నేఁ బరిమార్చెద నంచు వచ్చి నేఁ
డినసుతుచేత భంగపడి ♦ యీవికృతాకృతితో నిశాచరేం
ద్రునికడ కేఁగరా దని గి ♦ లుక్కునఁ దామగుడెంబు రంబునన్

చ. మగుడి బలంబు గూడుకొని ♦ మచ్చర మొచ్చఁగ నచ్చి పోరిలో
నగచరులన్ నిశాచరుల ♦ నందఱఁ గన్పడువారి నెల్ల మ్రిం
గఁగఁ దలపడ్డ వానరులు ♦ గసిలి రాఘవుమఱువు సొచ్చినన్
మగఁటిమి మీఱ లక్ష్మణుఁడు ♦ మార్కొనె నద్దశకంఠుసోదరున్.

సీ. సప్తబాణములవ ♦ క్షము గాడనేసెను
రాముఁ డంతటను నా ♦ రాచసమితిఁ
బౌలస్త్యు నెమ్మనఁ ♦ గీలింప వాఁ డవి
సరకుసేయక నద్రి ♦ చరుల మ్రింగ
నపుడు గదాధరుఁ ♦ డై విభీషణుఁ డరు
దేరఁ గూరిమి మీఱఁ ♦ దేఱిచూచి
తమ్ముఁడ కాకుత్స్థు ♦ దయ లంకసన్మార్గ
మున నేలు మరయుంగ ♦ దనుజవంశ
కారణుండ వనినఁ ♦ గరములు మోడ్చి యా

తండు పల్కె రావ ♦ ణుఁడు సేయు
దుర్ణయమున మిమ్ముఁ ♦ దోలఁగంగవలసె నే
నేమి సేతు నంచు ♦ మోము వంచి. 154

క. శోకింపఁగ నోదారిచి
రాకాసులఱేఁడు వనచ ♦ రగ్రామణులం
జేకొని మ్రింగఁ దొడంగిన
వ్యాకులపడి రాముఁ డరసి ♦ యతిశోకమునన్. 155

క. మఱి యైంద్రాస్త్రంబులఁ ద
త్కరములు దునుమంగ నవియు ♦ ధారుణిఁ గూలెన్
దనుచరులు వాని క్రిందం
నరముసుసుగ నొరిగి విఱిగి ♦ కడచిరి పోరన్. 156

గీ. మఱియు నర్ధచంద్ర ♦ మార్గణంబుల రెంట
రెండుకాళు లుత్త ♦ రించి లోన
నలుక నుగ్రతీవ్ర ♦ యామ్యసాయక మేసి
వానిశిరము డొల్ల ♦ వైచె నంత. 157

తరళ. తదనురోరుశిరంబు తూలి వి ♦ తాకుగాఁ జని తత్పురీ
సదనగోపురచంద్రశాలలు ♦ సాలముల్ ధరఁగూలఁగాఁ
గదిసి వార్ధి గుభిల్లునం బడెఁ ♦ గాండముల్ విడఁజిమ్ము బు
ద్బుదచయుం బెనఁగంగ దిక్కుల ♦ భూరిరావము నిండఁగాన్.

వ. అప్పుడు. 159

గీ. పుష్పవృష్టి కురిసె ♦ బుధదుందుభులు మింట

మ్రోసె నవనభుజులు ♦ మోద మంది
రచ్చరలు చెలంగి ♦ యాడిరి పాడిరి
కిన్నరులు శుభపరి ♦ సన్నఫణితి. 160

వ. అంతఁ బజ్రకంధరుండు హతశేషదోషాచరులవలనఁ దద్వృత్తాంతం బంతయుఁ దెలిసి దురంతచింతాక్రాంతుండై నిజానుజభుజాబలపరాక్రమంబులు దలంచికొని విలపించుచుఁ గటకటా యనుచు వేమారు దైవంబుఁ దూఱుచుం గృష్ణసారంబులు వ్యాఘ్రంబుల మ్రింగుభంగి మనుజులు దనుజులం జదుపుట యయ్యె నేమనంగల దిట్టివిపరీతంబులు పుట్టందొడంగె నింక నెట్టగునో యనుచు నత్యంతదైన్యంబున నిట్లనియె. 161

క. ఆలింపమిఁ జెడితిని నీ
యాలోచనమును విభీష ♦ ణా యకటా నేఁ
డాలమునఁ గుంభకర్ణుఁడు
గూలెఁగదా యనుచు మదిని ♦ గుమ్మరుచుండెన్. 162

చ. త్రిశిరుఁడు వజ్రకంఠ యిటు ♦ దీనతపాఁడియె నీ వనిన్ ధను
ర్విశిఖము లూనినన్ నిలుతు ♦ రే బలభిన్ముఖులైనబ్రహ్మాద
త్తశరశరాసనంబులు ర ♦ థంబును గల్గిన నన్నుఁ బంపినన్
దశరథసూనులం గపివి ♦ తానములం బరిమార్చివచ్చెదన్. 163

క. అన నతికాయుండును దే
వనరాంతకు లగుసటించుఁ ♦ బలుక మహాపా
ర్శ్వుని మఱియు మహోదరుఁ డో

డనిచి కుమారుల నుతించి ♦ యాతఁడు వనుపన్. 164

గీ. ఉత్తమోన్మత్తహస్తి మ ♦ హోదరుండు
సధికజవసత్త్వహయము న ♦ రాంతకుండు
కడమ నల్వురు ఘనశతాం ♦ గముల నెక్కి
బలసివచ్చిరి చతురంగ ♦ బలముతోడ. 165

ఉ. వచ్చి మహోద్ధతిం గదియ ♦ వానరవాహిని యార్చి పేర్చుచుం
దచ్చతురంగసేన వసు ♦ ధాధరసాలశిలావితానముల్
చెచ్చెర వైచి గీటడఁగఁ ♦ జేయ నరాంతకుఁ డంత నెంతయున్
మచ్చర మెచ్చ సప్తశత ♦ మర్కటులం బరిమార్చి వెండియున్.

మ. తనపై నేయుమహాద్రిపాదపశిలల్ ♦ తప్పించుకొంచున్ సగా
టునులన్ నుగ్గుగఁ జేయ వాలిసుతుఁడం ♦ తన్ వానివేతాఁకియు
ల్కను దైత్యా యిదె నిన్నుఁ గూల్తు నని పె ♦ న్నావొప్పఁ
[జెయ్యూఁచి గు
ద్దిన ధాత్రిం బడి చచ్చెఁ గింజుకొనిపా ♦ ర్జిక్కిగ్రివిసాశ్వంబుగన్.

గీ. కుపితులై యంత దేవాంత ♦ కుఁడు త్రిశిరుఁడు
మఱి మహోదరుఁడును దాఁక ♦ మఘవపౌత్త్రుఁ
డనఘుఁ డుగ్రత దేవాంత ♦ కునిఁ దటుకునఁ
గదిసి గ్రుద్దిన నెత్తురుఁ ♦ గ్రక్కుకొనుచు. 168

క. వడి నంగదుఁ బరిఘముతోఁ
బొడువం గని పవనసుతుఁడు ♦ భూరిక్రోధం
బడరఁగ నద్దేవాంతకు

మఱిపి మహోదరుఁడు నీలు ♦ మూర్కొన నంతన్. 169

క. నగ మొకటి పెఱికి వైచిన
నగజంబుగ నెత్తి పగిలి ♦ చచ్చెం గినుకన్
దిగతలలవాఁడు గనుఁగొని
పొగులుచు శితశరము లనిల ♦ పుత్త్రుని వైచెన్. 170

క. అతఁడు చలింపక యొకప
ర్వత మేయన్ వాఁడు నఱుక ♦ రథమున కత్యు
ద్ధతగతి లంఘించి వెసన్
ధృతియుతుఁడై పవనసుతుఁడు ♦ త్రిశిరుం జంపెన్. 171

క. గద నంతమహాపార్శ్వుఁడు
మదమొప్పఁగ వృషభు నేయ ♦ మహి వ్రాలి దిటం
బెద నొదవ లేచి యగ్గద
యుదలిచి లాగికొని మోఁది ♦ యూతనిఁ జదిపెన్. 172

క. ఆయెడ నసురులు పాఱం
బోయిన మఱలించి నారి ♦ భూరిధ్వనిగా
మ్రోయించుచు నతికాయుం
డాయుగ చరసేన నలుక ♦ నడఁచెను విఱుగన్. 173

వ. అప్పుడు. 174

ఉ. వేఁడివెలుంగు వంగడపు♦వీరుఁడు గాంచి విభీషణా యహో
వీఁడె మహోగ్రుఁడై కపుల♦వీఁగఁగఁ జేయుచునున్నవాఁడు ఎ
వ్వాఁ డన రాఘవా యసుర♦వల్లభసూతివలంతి మేటివి

గొంటు లేక కలంక ♦ నుంటఁగాక
పుంటిమీఁదను దద్ద ♦ మూంటితోలోనంట
గంటువెట్టెడు రీతి ♦ బంటుతుటఁము
వింటి కొరగెఁ బోర ♦ నంటయుఁ గొల్వలో
వింట యయ్యో నీఁకేమి ♦ దంటతనము
ఇంటివాఁ డొరుతోడ ♦ నంటుఁగావించుట
కంటెఁ గష్టంబు వే ♦ యింటఁ గలదె
తొంటిదశ గెంటి యంగద ♦ దంటుకట్టఁ
గంటివారలు బలసి న ♦ ట్టింట నిలిచి
వెంటఁ దగిలిన ధైర్యము ♦ కుంటు వొడిచి
రొంటిగొలుపడె వెఱపు ను ♦ క్కంటికైన. 184

సీ. శౌర్యశ్రీకంబు త ♦ ద్దయు హజారమునఁ బ
ల్మరు నొనర్పరుగదా ♦ మరుదబలలు
తెలుపుటెల్లులఁ గడా ♦ నిలుగుడంబులు గూర్చి
చెలిమిఁ బట్టరుగదా ♦ చిలువచెలులు
వ్యజనముల్ తపనీయ ♦ వలయఝణత్కార
మలర వీవరుగదా ♦ యక్షసతులు
హారతుల్ చెలువంపు ♦ హరివాణముల నించి
పొసఁగఁ దీర్పరుగదా ♦ పురతరుణులు
కప్పురపుటాకుమడుపులు ♦ కౌతుకంబు
వఱల నందియ్యకుగద కి ♦ న్నరవనితలు

కటకటా చూడఁజూడంగఁ • గరుణ విడిచి
గోడువఁ జెందించె దైవంబు • నుడుగులేల. 185

వ. అనుచు ననవధివ్యథాపాథోధినిమగ్నుండై దశశిరోధినిధికృతం బెట్టిబుధులకు నధిగతం బగుట విధిప్రథితంబుగదా యని కొంతతడవు చింతించి యొక్కింతధైర్యం బవలంబించి జితశతక్రతుం డగుసుతు నవలోకించి కుతుకమతి నులించి వర్ధితంబుగా నీ వతిత్వరితగతిఁ జతురంగబలయుతుండవై చతురంతం జని విమతు లగుకుతలపతులఁబ్రుతనతో నిహతులం గావించి రమ్మన నతం డట్లు సమరధరణి కరిగి యొక్కట నిలిచి పౌరుషంబు నారాధించి తత్ప్రసాదంబున బ్రహ్మాస్త్రంబు గైకొని యాకసంబున కెగసి విక్రమం బచ్చుపడంగ ఘూర్ణిల్లుచుండె నంత నాహవోర్వి నిజబలంబు కపిబలంబుతోఁ గొంతతడవు కదనంబు సేసి గాసిలినం గని యసురసురుఁడు సక్రోధమానసుండై యంగదజాంబవద్గజగవయగవాక్షగంధమాదనమైంద ద్వివిదాదివానరసేనానాయకుల సబలంబుగా నొంచి బ్రహ్మాస్త్రంబు ప్రయోగింపఁ దద్బాణపాతంబున. 186

చ. అరయ ససైన్యులై యఱువ • దాఱ్వొకకోటిచమూపులంతఁజ
చ్చిరిమఱియుంగపుల్ నృపతి • సింహులుమూర్ఛమునింగిరంతదా
మరచెలి గ్రుంకె రావణకు • మారుఁడులంకకుఁబోయెఁదద్వ్యథం
బరసి విభీషణుండు పవ • నాత్మజుఁడుం గడు దుఃఖితాత్ములై.

సీ. అమరేంద్రజిన్మార్గ • ణాంధీభవన్నేత్రు

వనరుహాసనపుత్త్రు ♦ ఘనచరిత్రు
రాఘవాజ్ఞాబద్ధుఁ ♦ బ్రజ్ఞాసమృద్ధు మం
త్రౌషధసంసిద్ధు ♦ సమితవృద్ధు
జాంబవంతు నితాంత ♦ సద్భక్తి నొక్కెడ
నారసి డగ్గఱి ♦ యతనికుశల
మడిగిన నీ వెవ్వ ♦ రయ్య యన్న విభీష
ణుఁడ నంచుఁ దనపేరు ♦ నొడివి దాశ
రథులు కపులును మరల మూ ♦ ర్ఛలను దొఱఁగి
మనియొకొ తెఱుం గెఱింగిపు ♦ మనుడు నాంజ
నేయుఁ డెచ్చోట నున్నవాఁ ♦ డో యటన్న
నవుడు పవనజుఁ డేమని ♦ యడుగ నలరి. 188

ఉ. ఓహనుమంత నీవిచట ♦ నుండఁగ మా కిఁకఁ గష్ట మేమయా
యాహవభూమి రాఘవులు ♦ నద్రిచరుల్ పడియున్నవారమా
యూహ దలిర్ప ద్రోణగిరి ♦ కియ్యెడ నేగి మహౌషధుల్ వెసన్
సాహసమొప్పఁ దెచ్చినరు ♦ సన్ బ్రదికింపుము త్రోవఁ జెప్పెదన్

క. ధీరుఁడ వంభోనిధిగం
భీరుఁడ వంహోనితాంత ♦ భీరుఁడ వతులా
చారుఁడ వాశ్రితరక్షా
ధారుఁడ వభియాతిజనవి ♦ దారుఁడ వరయన్. 190

క. ఘనుఁడవు కృతమంత్రారా
ధనుఁడవు జనవినుతకీర్తి ♦ ధనుఁడవు కపిమం

డనుఁడవు రంజితఖరశా
సనుఁడవు సమదపరదిగ్వ ♦ సనుఁడవు తలఁపన్. 191

వ. అని యనేకగతుల వినుతించి ద్రోణగిరిమార్గకథనాధిషణుండై
వెండియు నిట్లనియె 192

సీ. అంజనీనందన ♦ యాలింపు మిచ్చోటుఁ
కదలి యుత్తరముగాఁ ♦ గడిమి నరిగి
హిమవన్నగముఁ గాంచి ♦ హేమకూటముమించి
ఋషభాచలంబు త ♦ రించి హాట
కాహార్యమున కిచ్చి ♦ జోహారు లొనరించి
పన్నగాభరణాద్రి ♦ సన్నుతించి
శృంగవంతం బను ♦ శిఖరీంద్రము భజించి
నీలశైలము వేగ ♦ నిర్గమించి
శ్వేతగిరిఁ బూజలొనరించి ♦ సిరుల నలరు
భూధరంబు లనేకముల్ ♦ పొసఁగు నచట
వానిఁ గని సంతసించి దు ♦ ర్వారశక్తి
లవణవారిధి లంఘించి ♦ తవిలి చనఁగ. 193

సీ. అచట శాకద్వీప ♦ మామీఁద దుగ్ధాబ్ధి
యామ్రోలఁ జంద్రాద్రి ♦ యవలఁగొంత
దూరంబు చన నంత ♦ ద్రోణశైలేంద్రంబు
పొడకట్టు నగ్గిరి ♦ నడరునాలు
గాపథంబులు వాని ♦ కాఖ్యలు దెల్పెద

సంజీవకరణి వి ♦ శల్యకరణి
సంధానకరణియు ♦ సావర్ణ్యకరణియుఁ
దత్ఫలంబులు హరి ♦ త్ప్రభల నలరు
నలరు లరుణంబు లాకులు ♦ దెలుపు నగుచు
దివిజనాయకునాజ్ఞచేఁ ♦ దేజరిల్లు
నట్టిదివ్యౌషధంబులఁ ♦ గట్టి తెచ్చి
మఘవు మన గాద్పుకోమరుఁ డా ♦ తనికి మ్రొక్కె. 194

సీ. చని మందుకొండఁ దె ♦ చ్చినపట్లఁ దత్సమీ
రప్రసారణమున ♦ రణమునందు
సమసినకపిసైన్య ♦ సహితులై రఘువరు
లుసురులు వొందిరో ♦ ప్పెసఁగుమేను
లొనరంగ నిద్ర మే ♦ ల్కని లేచినట్టుల,
యగ్గిరి మఱలంగ ♦ నాతఁ డచ్చో
టను డించి వెసవచ్చెనినుఁడును నుదయించె
హనుమన్మహిమ ♦ మెచ్చి ♦ రమరు లపుడు
రేయిఁ గోరిరి తిరుగ న ♦ ద్రిచరు లది యె
ఱింగి రవిగ్రుంకె నిరు లొప్ప ♦ రక్కసేనఁ గోఁ
జెలఁగి రక్కసిపురిఁ జొచ్చి ♦ చిచ్చువెట్టి
రంత పెనుమంట లాకస ♦ మంటెమంటె. 195

గీ. అట్టిమంటల కులికి ద ♦ శాస్యుఁ డపుడు
పలికెఁ గుంభనికుంభులఁ ♦ బిలిచి శోణి

తాక్షు, యూపాక్షు, మకరాక్షు ♦ నసురవరుఁ బ్ర
జంఘుఁ గంపను ననికి బా ♦ సట యొనర్చి. 196

వ. మీ యట్టి బలపరాక్రమ సంపన్నులు గలిగియు నిట్టిట్టి దురవ
స్థలు పట్టణంబునం బుట్టెంగదా యనుచు విగతధైర్యుండై
పలికిన విని యతనికి మనంబున నానందంబు జనియింపం
గుంభనికుంభు లిట్లనిరి. 197

క. మే మాటక్రిక్రోతుల
నీమాటనె పట్టి తెచ్చి ♦ నీసభ మ్రోలన్
మోమాటము పరికింపక
కామాటపుఁ బనులఁ బెట్టి ♦ కాంతు మిటన్. 198

శా. చెంపల్ వాయఁగఁగొట్టియాదలపయిన్ ♦ జల్లుల్వడన్ మొట్టిగా
రింపన్ వల్వదటంచుఁ గుయ్యిడఁగ వా ♦ రిన్ రాముఁడీక్షించిల
జ్జింపన్ దేరులఁ దాళ్లఁగట్టి దివిజే ♦ జేల్ భీతిలం బారు ల
గ్గింపన్ నీసభ కీడ్చి తెచ్చెదము సు ♦ గ్రీవాదులన్ రావణా.

వ. అనుచు నపరిమితావలేపాలాపంబుల నతని దైన్యంబుశూన్యం
బు గావించి మాన్యులై తదనుజ్ఞ వడసి యాతుధానచమూ
సమేతులై పురంబు నిర్గమించి రణధరణి కేతెంచి జగద్భయ
దంబుగా వలీముఖబలంబుఁ దాఁకి రప్పుడు. 200

ఉ. తాఁకినమ్రాఁకులుం గిరులు ♦ తద్దయు వైచినఁ దోన కూల్చిబల్
తేఁకువ మీఱి వానరులఁ ♦ దీవ్రశరంబుల నేపణంచి యా
పోఁకుడుమూఁక లెంతయును ♦ జుట్టుకొనం గరిరాజిఁ జూచిపే

రాఁకలితోడ వెల్వడుమృ♦గాధిపులుంబలె నుగ్రమూర్తులై.

క. మైందద్వివిదులు నర్యమ
నందనుఁడును వనచరేంద్ర ♦ నందనుఁడు మరు
న్నందనుఁడును గిరితుభుజు లా
నందింపగఁ దాఁకిరపుడు ♦ నాశకథనులై. 202

వ. అందు మైందద్వివిదు లత్యుగ్రభుజాబలంబున యూపాక్షశోణి తాక్షుల రక్షోవీరు లీక్షింపఁగొంతతడవు పోరాడి సమవర్తి నగరప్రవర్తులం జేసిరి. భానుసంభవుండు సంరంభంబునఁ గుంభునిదంభంబు విజృంభింపనీక పోకార్చె నంగదుం డభంగవిక్రమంబునఁ గంపనప్రజంఘుల నంఘ్రిసంఘట్టనంబున గతప్రాణులం గావించె మించినయలుకఁ బ్రభంజనతనయుండు నికుంభుని భంజించె నిట్లు చమూసమేతంబుగా యాతుధాన యోధవరు లాయోధనంబున నిధను లగుట కత్యంతచింతాక్రాంతుఁడై. 203

మ. మకరాక్షుండు మహోగ్రుఁడై నిజధను♦శ్శార్ఙ్వినాదంబు దిక్ప్రకరం బంటఁగ మ్రోయఁ జేయుచు శతాం♦గంబుఁ జొ [రందోలి తె
క్కకపారంబుగఁ గీశులం దునుమ న♦ల్కన్ జానకీభర్తపావకబాణంబున వానిఁ గూల్చె దివిజ♦వ్రాతంబు లగ్గింపఁగన్.

ఉ. తత్క్రియ మంతయుం దెలిసి♦దానవనాథుఁడు కుందుచున్ సముద్యత్క్రోధ నింద్రజిత్తుఁ జనుఁ♦ మన్న నతం డురగేంద్రులంగరు

త్సత్క్రియ వారిఁ గూల్తునని♦తండ్రికి సాగిలి బాహుసత్వచం
చత్క్రితుఁభుగ్గ్రీవసత్ప్రివర♦సైన్యముతోఁ జని తానదృశ్యుఁడై
ఉ. చుక్కలత్రోవ నుండి కపి♦శూరులచేఁ దనసైన్య మంతయున్
స్రుక్కిన మిక్కిలిం గినుక♦ చొప్పడ రాఘవులం బ్లవంగులం
జెక్కుశరంబు లేసి కడుఁ♦బెంపడఁగించి దశాస్యనందనుం
డొక్కెడఁ గైతవావనిజ♦నొక్కతెఁ దెచ్చి చెనాఁగఁజంచెనన్.
ఉ. దృక్ప్రమదం బొసర్చ ననిఁ♦దెంపున దైత్యులు సంతసింపఁ బ్రా
గ్దిక్ప్రభుముఖ్యు లెంతయు న♦కృత్య మనన్ నతికేశవిశ్లేశప
మ్యక్ప్రభ లీనుఖడ్గముఁ న♦సద్రిచరుల్ గని తొల్లి యిట్టు లా
వాక్ప్రమదామనోహరుఁడు♦ప్రాసెనొకో యనిపం చలింపఁగన్.
చ. నఱికి నికుంభిలాటవికి♦నాకులు హా యన వ్రేల్మి కేగినన్
వెఱచి ప్లవంగు లంత రఘు♦వీరుల కేర్పడఁ దెల్ప వారల
త్తఱి నడలన్ విభీషణుఁడు♦తద్విధ మాసురమాయ దీన వే
వఱు వ్యథ యేలవాఁడిపుడు♦మారణహోమవిధాన శేముషిన్.
సీ. చనియె నిక్కువ మిది♦జననాథ తత్క్రియా
ప్రత్యూహ మొనరించి♦ పగతు నిపుడు
పరిమార్పఁ దఱి యని♦ పల్క రాముఁడు ప్రీతిఁ
దద్విభీషణమరు♦ త్తనయనీల
జాంబవన్ముఖుల బా♦ సటఁగూర్చి యాదైత్యు
పై నూర్మిళాకాంతుఁ♦ బనిచె నంత
నాతఁ డల్క నికుంభి♦ లాటవి సొచ్చి య

ద్దనుజవీరుల నెల్లఁ ♦ దఃనిమి శిఖిస
మీపమున నిష్ఠ నున్నట్టి ♦ మేఘనాదుఁ
జుట్టుకొని పట్టి ధట్టించి ♦ బిట్టుబెగడఁ
గొంతతడ వాల మొనరించి ♦ కులిశపాణి
సంతసింపఁగ సనిచెఁ గృ ♦ తాంతుపురికి. 209

క. తఱిఁ గురిసెఁ బుష్పవర్షము
తెఱగంటులు మెచ్చి రభిను ♦ తించిరి మౌనుల్
మఱలి చను దెంచి లక్ష్మణుఁ
డఱిఁగెఁ రామునకుఁ బ్లవగ ♦ బృందముతోడన్. 210

ఉ. తద్విధ మెల్లఁ దెల్లముగ ♦ దానవవల్లభుఁ డాలకించి యా
పద్వనరాశిమగ్నుఁ డయి ♦ పల్లరుఁ బుత్త్రిఁ దలంచి కుంది దు
ర్వృద్విపినాగ్నినైర్మృతవ ♦ రిష్ఠు నరుండు వధించు టెల్ల జా
గ్రద్వనకందరస్థితమృ ♦ గప్రభు నేణము ద్రుంచుట య్యెఁబో. 211

శా. సూక్ష్మప్రక్రియ నెల్లలోకములు సం ♦ క్షోభింప దేవాధిపున్
లక్ష్మీవంతు శతారధారి విబుధ ♦ శ్లాఘ్యున్ భుజాశక్తిచేఁ
బక్ష్మాపాతములో జయించినధనుః ♦ పాండిత్యదక్షుండు తు
చ్ఛక్ష్మాభృచ్చరసైన్యయుక్తనరుచేఁ ♦ జచ్చెంగదా దీనతన్. 212

శా. అస్త్రప్రాజ్ఞుఁడు నందనాగ్రజుఁడు పి ♦ త్యర్థప్రభవాతంబు ర
క్షస్త్రీనప్రహితుండు శ్లాఘ్యతరదో ♦ స్సారుండు శశ్వత్సుధాం
ధస్త్రీసప్రదవిక్రమాంచితుఁడు మ ♦ ర్త్యక్షుల్లకపత్త్రిపున్
నిస్త్రింశంబునఁ జచ్చె నీకలనిఁ కన్ ♦ నేఁడింకఁ బ్రాపెవ్వఁడో.

శా. దగ్ధంబయ్యెఁ బురంబు; గీట్పడియె సం♦తానంబు; దుష్కీ
[ ర్తియున్
స్నిగ్ధంబయ్యె; సహోదరుండు మడిసెన్ ♦ జేటొందె సైన్యంబు; స
మ్యగ్ధైర్యంబు దొలంగెఁ, గష్టదశ సం♦ప్రాప్తించె, రామక్షమా
భుగ్ధాటిన్ రణభూమి నిల్చి కడిమిం♦బోరాడఁగా శక్యమే 214

మ. అని చింతించి మహీసుతం దలఁచి యా♦హా! దానిచే నింతవ
ట్లైను దానిం బొరిగొందు నం చలుక రె♦ట్టింపన్ వెసం బోవు వే
ళను గేల్వట్టి సుపార్శ్వుఁడంతనె మర♦ల్పన్ గొల్వు కేతెంచి ప్రా
క్తనభూషాంబరధారియై సవనభు♦క్సంఘంబు భీతిల్లఁగన్. 215

శా. రక్షోనాథుఁడు దగ్రనాదముగ యా♦త్రాభేరి వేయించి తా
మ్రాక్షౌహ్యాస్యశిరోమవహ్నిపదవా♦హశ్రోత్రసంపాతిభీ
మాక్షోన్మత్తకటాక్షివర్ణముఖయూ♦థాధీశులుం గొల్వ రా
మక్షోణీతలరాడ్జిగీషప్రకటిం♦పన్ యుద్ధసన్నద్ధుఁడై. 216

శా. దిగ్దంతుల్ బెదరంగ శంఖపటహ♦ధ్వానముల్ మీఱ స
మ్యగ్దోపాచరసింహనాదములు పెం♦పారన్ రథారూఢుఁడై
దృగ్దీప్తిన్ మిణుఁగుర్లు బిట్టెగయఁగాఁ♦ బెంపొప్ప రామక్షమా
భుగ్దర్పం బడఁగింతు నంచు వెడలెం♦బూర్వద్వార మత్యుద్ధతిన్.

వ. అప్పుడు. 218

శా. కాఠిన్యంబును గిన్కయుం గదురలో♦కంబేర్చు కోర్కెన్ భుజా
పీఠిన్ ఘోరపినాకమూని జగదా♦భీలస్వనం బొప్పఁగాఁ
బాకీనాంకవిరోధి వచ్చుకరణిం♦బ్రాంచజ్జయశ్రీకథా

పారథ్వాన మొసంగ వచ్చుమఘభు♦క్పవిత్త్యర్థినీతిఁ జూచుచున్.

ఉ. రక్కసిదండు గుండె లద♦రం బలుకొండలు గండశైలముల్
గ్రక్కున వైచి యొక్కమొగి♦గాటముగా దెసలంటనార్చిలో
నక్కునకిక్కచేఁ గదిసి♦నట్టన స్రుక్కఁగఁ జేయు వానరుల్
మిక్కిలి లెక్కయామగఁటి♦మిన్ నిజనాథుఁడుచూచుచుండఁ
[గన్. 220

ఉ. పూర్వసుపర్వ లుగ్రశర♦ముల్ నిగుడించుచు నొక్కపెట్టుగాఁ
బర్విన నుర్విభృచ్చరులు♦పారఁ దొడంగిన నిల్చి క్రవ్యభు
గ్గర్వ మడంతు నంచుఁ గిను♦కన్ నిజకార్ముక మెక్కుపెట్టిగం
ధర్వశరం బనుర్చి రఘు♦నాథుఁ డుదగ్రత వైవ నత్తఱిన్.

మ. ధనువుల్ బెట్టుగనొక్కపెట్టుతెగ నం♦తన్ లాగిమౌర్వధ్వనుల్
దనరన్ దీవ్రశరాళి గూర్చి ధ్వజసూ♦తస్యందనాశ్వోపరిన్
వెనుకన్ ముందలఁ గెలంకులన్ సమరపృ♦థ్విన్ విశ్వరూపంబు దా
ల్చినభంగిఁగనుపట్టె లంకఁ గలయన్♦శ్రీరామకోట్లంతయున్

క. శ్రీరామకోటు లాగతి
నారయ ఘటికాచతుష్ట♦యం బెడతెగకే
జ్యారావము సేయుచు శిత
నారాచము లేయుచుండి♦నం బెనుభీతిన్. 223

సీ. అపుడు తుత్తుమురయ్యె♦నష్టాదశసహస్ర
దంతావళంబులు♦దశసహస్ర
రథములు మఱి చతు♦ర్దశసహస్రాశ్వముల్

ద్విశతసహస్రదై ♦ తేయభటులు
తక్కినదారు లుక్కుఁ ♦ దక్కి మిక్కిలి పాఱఁ
గని కిన్క నద్దశ ♦ కంధరుండు
కనుదోయి మిణుఁగుర్లు ♦ గ్రాలఁగాఁ దన తేరు
గపిసేనఁ జొరఁదోలి ♦ నృపుని గదిసి
మిగులఁ బోరాడు తఱిని సౌ ♦ మిత్రి వాని
ధనువు నఱికెను సూతుని ♦ దునిమె నంతఁ
బెలుచ హయములఁ గూల్చె వి ♦ భీషణుండు
నపుడు సురవైరి విరథుఁడై ♦ యవని కుఱికె. 224

గీ. ఓరి ఘాతుక యొంటమి ♦ వారిఁగూడి
చెలఁగి నన్నెదిరింప న ♦ చ్చెదవు చాలు
నెంతద్రోహివి రా నే న ♦ హింతు నే వి
భీషణా వంశనాశకా ♦ పెల్లణంతు. 225

ఉ. అంచుమహోగ్రకోపమున ♦ నాసురనాయకుఁ డొక్క శక్తి వం
చించక వైవ లక్ష్మణుఁడు ♦ శీఘ్రమ దానికి నడ్డువచ్చి న
క్తంచరు వెన్క కొత్తి పటు ♦ కాండము లేసిన యొక్క వ్రేక యే
తెంచి యురమ్ము గాఁడుటను ♦ దెప్పున భూస్థలి వ్రాలి మూర్ఛిలెన్.

క. సౌమిత్రి పాటు గను గొని
రాముఁ డపుడు దుఃఖవారి ♦ రాశిని మగ్నుం
డై మిగులఁ గుందుచుండఁగ
నామఘభుగ్వైరి యేసె ♦ నస్త్రములు కడున్. 227

గీ. ఏయ రామచంద్రుఁ ♦ డెంతయుఁ దమ్ముని
హనుమదాదికపుల ♦ కప్పగించి
కుంది కుంది క్రోధ ♦ దందహ్యమాన మా
నసుఁ డగుచు సురారి ♦ నాథుఁ గదిసి. 228

క. శరవర్షము గురియుంచిన
సురవైరి తొలంగి పఱచె ♦ క్షోణీపతి సో
దరుఁగూర్చి వెక్కుభంగుల
గరముఁగ ధైర్యంబు వదలి ♦ గాసిల్లంగన్. 229

క. దేవా యిటు తగునే రా
జీవాప్తుఁడు గ్రుంక వచ్చెఁ ♦ జింతింపకు మీ
పావని సౌమిత్రిని సం
జీవనిచే మనుచు నని సు ♦ షేణుఁడు వలికెన్. 230

వ. మఱియు నినతనయాదు లనేకవిధంబుల ననునయించునెడ నప్ప
యోజబాంధవుం డస్తమించి రాత్రి యగుటయు. 231

ఉ. అంత మరుత్సుతుం డరిగి ♦ యౌషధశైలముఁ దెచ్చియూర్మిళా
కాంతు సజీవుఁ జేసి గిరి ♦ క్రమ్మఱ నచ్చటఁ బెట్టివచ్చె భా
స్వాంతుఁడు దోఁచె నీవ్రితిన ♦ వైళముదీర్పు మటంచు లక్ష్మణుం
డెంతయుఁ దెల్ప రాముఁ డసు ♦ రేశుఁ దటాలునఁ జీర వెండియున్.

సీ. దశకంఠుఁడును క్రోధ ♦ దందహ్యమాన మా
నసుఁ డౌచుఁ దేరెక్కి ♦ వెసను వచ్చి
తాఁకె శక్రాజ్ఞ మా ♦ తలి గొనివచ్చిన

రథము కౌతుక మొప్ప • రాముఁ డెక్కె
సంగరేచ్ఛా కాంక్ష • సర్వగీర్వాణులు
చను దెంచి నిల్చిరి • చదల నప్డు
డారీతి రామదై • త్యాధీశు లిర్వురుఁ
దలపడి ఘోరయు • ద్ధంబు సేసి
రంత రావణుఁ డల్గి నా • గాస్త్ర మేయ
నాలుకలు క్రోయు చెంత నా • భీల భంగి
నెల్లెడల నిండి ఫణికోట్లు • తల్లడిల్లఁ
జేయ రఘువీరుఁ డారసి • శీఘ్రముగను. 233

క. నముచిసపత్న ప్రముఖులు
ప్రమదంబున మే లటంచుఁ • బ్రస్తుతి సేయన్
సమధిక సౌపర్ణాంబక
మమలమతిన్ వైచె నప్డు • డాశ్చర్యమునన్ 234

ఉ. బాల దివాకరప్రభల • భంగి గరుద్ద్యుతు లొక్కపెట్ట భూ
గోళము నిండి మెండు కొన • గోత్రనిషూదన హస్తచండదం
భోళిసమోగ్రతుండ నఖ • ముల్ చెలువొందఁగ విష్ణునామవా
గ్జాలరవంబు మ్రోయఁగ ఖ • గప్రభుకోటులు నిండె నెల్లెడన్

క. అసదుగఁదద్గరుదనిలము
కరము శరీరములఁ గదియఁ • గదలి చెదరి యా
సురపతి యరయఁగ వెఱపునఁ
బొరిపొరి బొరియలకుఁ బఱచె • భుజగము లెల్లన్ 236

గీ. అంత దానవనాథుఁడ • త్యంతరోష
భీకరాననుఁ డగుచు నా • భీలశూల
మురురయంబున వైవ మ • హోగ్రభంగి
మంట లడరుచు నేతేర • మనుకులుండు. 237

చ. కనుఁగొని తీవ్రసాయకని • కాయము లేసిన వహ్నిలోన నిం
ధనములు వైచిన ట్లయిన • దానికి నల్కఁ జనింపఁ బాకశా
సనునియనుజ్ఞచేఁ దొలుత • సారథి తెచ్చినశక్తి వైచి గ్ర
స్నన మఱలించినన్ దనుజ • నాయకుఁ డప్పు డుదగ్రకోపుఁడై.

క. తామసశర మేసిన సం
గ్రామావనిఁ గ్రమ్ముకొనియె • గాటంపుటిరుల్
భూమీరుహచరవీర
స్తోమం బేమియును జేయఁ • దోఁచకయుండన్. 239

శా. వీరాగ్రేసరుఁ డారఘూద్వహుఁడు దో • ర్వీర్యంబ వార్యంబుగా
సౌధాస్త్రం బపుడేసి యయ్యిరు లడం • చం గాలిసంగాతితూ
పారాతిం చరభర్త యేయుట నె జ • న్యక్షోణినాశంబుగా
ఘోరజ్వాలల వచ్చు దానిఁ గని కా • కుత్స్థుండు శీఘ్రంబుగన్.

క. పర్జన్యశరకృతమహా
గర్జావిద్యుత్స్ఫురత్ప్ర • గాఢాంబుధర
స్ఫూర్జితపాథోధారా
దూర్జితతద్దనుజకీలి • మార్గణుఁ డయ్యెన్. 241

వ. అంత. 242

ఉ. అస్రపభర్త్ర యేయువిశి ♦ ఖాళియు నల్కను దోనె యేయునా
యుసుగ్రీవదన్వయేశ్వరుశ ♦ రోత్కరముఖ్ బవిపాణినేత్రసా
హాస్రముసార్థమయ్యెవని ♦ యారయుచుండెదవిర్ముదంబుతో
సౌసుగ్రీవినేత్రులై యసుర ♦ లయ్యెడఁగుందుచునుండిరయ్యెనిర్.

క. కేరుచు రఘుకులవీరుని
సారెకుఁ బొగడుచును నాఁటి ♦ జగడము రుచిగాఁ
బోరోగిరంపుఁదాపసి
కోరికతో నారగించెఁ ♦ గుత్తుకబంటిన్. 244

సీ. మఱియు నయ్యెరువురు ♦ నఱమర నెరయంగఁ
దఱుఁగనిమురి మీఱఁ ♦ దఱి యొఱంగి
మొఱ మొఱలాడుచుఁ ♦ గొఱఁగానికొఱకొఱ
బిరబిర నరదంబు ♦ లొరయఁజేర్చి
పరుసపునుడుగులు ♦ వెఱవక పలుకుచుఁ
బిఱికితనంబునఁ ♦ బఱవఁదగదు
మఱుము చేసెద నిదె ♦ నెఱిమగంటిమి నంచు
గుఱి తప్పకుండంగ ♦ మెఱుఁగులీను
కఱకుటమ్ములమేనులఁ ♦ దఱుచు గాఁగఁ
జఱుకుచుఱుకున నాటించి ♦ యెఱుఁగ మిట్టి
యురువుదురమంచు నెంచి యే ♦ మరక పోరి
రుఱకఁ బల్మరుగెలుపు లే ♦ డ్తైఱ దలంచి 245

గీ. అట్టిపోరాటమున రాముఁ ♦ డంత కంత

కల్కి జనియింపఁ దీవ్రసా • యకము లేసి
యస్రిపాసీక మెంతయు • నడఁచి తద్ద
శాస్యుఁదద్దయు నొంచి యా • శాస్యమునను. 24

మ. కలశీసూనుమహోపదేశమున న • ర్కస్వామి నెంతే విని
ర్మలభక్తిన్ బ్రణుతించి బాహుబలనా • మగ్రిన్ విజృంభించియీ
కలుషాత్మున్ వధియించెదం గలన నిం • కన్ బంకజాతాసనా
దులు నడ్డంబుగ వచ్చినిల్చినసుధాం • ధోబృందమీక్షింపఁగన్

వ. అని యనవధికక్రోధమానసుండై. 248

క. నెట్టుకొని నిల్చి శరములు
బిట్టేసి దశాస్యుతలలు • పృథివిన్ డొల్లన్
గొట్టం గొట్టినతోడనె
పుట్టెంబుట్టెన్ విచిత్ర • ముగ మఱిమఱియున్. 249

ఉ. నూటొకమాఱు తప్పకను • నూఁకిన వెంటనె పుట్టె నట్టిపో
రాటముఁ బోన నేఁడహము • లన్నియు రాత్రులు నేగెఁ జూడనా
నాఁటికి శాంతిలేక రఘు • నాథుఁడు బ్రహ్మశిలీముఖంబు దోః
పాటవ మొప్ప మంత్రవిధిఁ • బట్టుగ వింటఘటించి గ్రక్కునన్.

శా. ఆకర్ణాంతము చేసి యేయుటనె స్వా • హానాయకజ్వాలలు
ర్వ్యాకాశంబులనిండఁ బేర్చుచును బ • శ్యల్లోకకోటీమహా
లోకాభీలముగాఁగ వచ్చి దనుజు • ల్గుందం దశగ్రీవున
స్తోకాంసాంతరభాగ ముచ్చి చని య • త్యుదగ్రప్రభావంబునన్.

గీ. నేలఁ గాఁడి మఱల • నేలికతరకసం

బునకు వచ్చె నంత ♦ దనుజపతియు
నరద మొరుగఁబడియె ♦ నవని గుభేల్లునఁ
గులిశనిహతమైన ♦ కొండభంగి. 252

మ. కురిసెన్ బువ్వులవాన యత్తఱి రణ ♦ క్షోణిన్ మరుద్దుందుభుల్
మొరసెన్ గిన్నరవాద్యగీతనినదం ♦ బుల్ భూమిగోళంబు గ్రి
క్కిఱిసెన్ జక్కులత్రోవఁ బంకజహితా ♦ క్షీణస్ఫురద్దీధితుల్
మెఱసెన్ సుస్థిరసౌమనస్యమును గ ♦ ల్గెన్ నిర్జరశ్రేణికిన్.

క. వీచెన్ మలయానిలములు
చూచెం దలయెత్తి కోర్కె ♦ సురతతి నింగిన్
గాచెం జంద్రిక నిండుగఁ
బ్రోచెన్ విశ్వలత దివముఁ ♦ బురుహూతుండున్. 254

శా. అంతన్ బఙ్క్తిముఖుండు కూలినవిధం ♦ బాలించి మందోదరీ
కాంతారత్నము దుఃఖసాగరనిమ ♦ గ్నస్వాంతయై పౌరశు
ద్ధాంతస్త్రీలును దోడ రా వెడలి యు ♦ ద్ధక్షోణి కేతెంచి య
శ్రాంతుం గన్గొని హా! దశాస్యయనియా ♦ క్రందించుచున్ మూర్ఛి

గీ. అంతఁ బరిజను లూరార్ప ♦ నచట నచటఁ [లెన్.
గూలియున్నసుతాదులఁ ♦ గూర్చి వసరి
చనియె నపుడు విభీషణుం ♦ డును రఘూద్వ
హాజ్ఞఁ గొని యేగి తనయగ్ర ♦ జాదులకును. 256

క. వనరుచు నచటికి నచటికి
జని తనవారలకు నగ్ని ♦ సంస్కారాదుల్

విషయవిధిఁ జేసి క్రమ్మఱఁ
జనుదెంచెను వేగ రామ ♦ చంద్రునికడకున్. 257

క. లంకారాజ్యంబు నిరా
తంకంబుగ నేలు మనుచు ♦ దాశరథియు ని
శ్శంకవిభీషణునకుఁ దమిఁ
బంకజభవముఖులు మెచ్చు ♦ పగిది నొసంగెన్. 258

చ. జనకజయున్ నిజేశ్వరుని♦సంశయ మెల్లను బాయునట్లుగా
ననలము సొచ్చి వెల్వడె జ♦లాశయనిర్గతరాజహంసికా
ద్యునమెయి చల్లనై సొబగు♦పొల్పెసలారఁగఁ గాంచి సంతసం
బున నపుడింతిఁ గైకొని బు♦ధప్రభుముఖ్యులు మేలుమేలనన్.

గీ. సీతయును దాను జూడవ ♦ చ్చినసురాలి
కెరఁగి దశరథునకు నమ ♦ స్కృతి యొనర్చి
తత్కరుణఁ బోర సమసిన ♦ తరుచరులను
మఱల బ్రదికించుకొని జగ ♦ న్మహితుఁ డగుచు. 260

ఉ. భూమిజ, లక్ష్మణుండు, రవి♦పుత్త్రిమరుత్తనయాదివానర
స్తోమము నవ్విభీషణుఁడు♦తో నరుదేర విమానమెక్కి సు
త్రామున కంచి తేను వెస♦దైత్యపురస్థితి సేతుచిత్రముల్
భామకుపన్యసించుచుఁ గృ♦పామతి నంబరమార్గగామియై. 261

గీ. అరిగి కిష్కింధడగ్గఱి ♦ యచట నిలిచి
తపనజార్పితవివిధోప ♦ దానుఁ డగుచుఁ
గపుల సకుటుంబులుగఁ బుష్ప ♦ కపర్యూషు

లుగ నొనర్చుకొంచేగుచు ♦ మగువఁ జూచి. 262

క. అదె మాల్యవద్గిరీంద్రం
బదె సుగ్రీవుండు సేస్త ♦ మలరించినచో
టదె పంపాసరసీపరి
మదె శబరినివాసభూమి ♦ యరయుము రమణీ. 263

గీ. అదె కబంధవధోర్వీఖ ♦ రాజిధరణి
యదె యగస్త్యాశ్రమం బదె ♦ యదె సుతీక్ష్ణు
నిర వదియె దండకాటవి ♦ మఱియుఁ జిత్ర
కూటగిరి యది కంటివే ♦ కువలయాక్షి. 264

క. అని తెలుపుచుఁ జని కనియెను
జనతాసంసేవ్యమాన ♦ చరణాంభోజున్
ఘనతేజు భరద్వాజున్
మునివినుతతపస్సమాజు ♦ మోదం బలరన్. 265

గీ. కాంచి యమ్మౌని యొసఁగున ♦ త్కారమెల్లఁ
గైకొని మరుత్తనయు నిజా ♦ గమనవార్త
భరతునకుఁ జెల్ప ననుపుడుఁ ♦ బ్రమద మొప్ప
నాతఁ డరిఁగి నందిగ్రామ ♦ మరసి భక్తి. 366

మ. భరతుం గాంచి తదీయవార్త వినిపిం♦పం జెన్నిధిం గన్నపే
దరిచందంబున మోదమొందుచు సుమి♦త్రాపుత్త్రశత్రుఘ్నసో
దరునిం బిల్చి పురం బలంకృతి మహో♦ద్యల్లీలఁ జేయించియు
గ్గురునిం దల్లుల మంత్రులం జెలులఁ గో♦ర్కుల్ మీఱఁ దోతెమ్మనన్

సీ. శత్రుఘ్నుఁడును మహా ♦ సంతోషచిత్తుఁడై
సాకేతపురి కేగి ♦ సచివవరుల
రావించి రాముని ♦ రాక యెఱింగించి
పురము శృంగారింపఁ ♦ బొందుపఱిచి
నిరుపమాధికతపో ♦ నిష్ఠాగరిష్ఠవ
సిష్ఠాదిభూసుర ♦ శిష్టజనుల
సమ్మల ముప్పూర ♦ నాప్తుల మంత్రుల
నుచితవాహనముల ♦ నునిచికొనుచు
మఱియుఁ జతురంగబలముల ♦ మట్టుపఱిచి
భద్రగజమును గై సేసి ♦ పార్థివునకుఁ
జూపఱులకును గల్యాణ ♦ శోభ దోఁప
నరుగుదెంచెను దోడ్కొని ♦ భరతుకడకు. 268

క. వచ్చినవారిం దోడ్కొని
హెచ్చినమోదమున రాము ♦ నెదురుకొనుటకై
విచ్చేసె భరతుఁ డింద్రుఁడు
చెచ్చెర హరి కెదురు చనెడు ♦ చెలువలరారన్. 269

గీ. అంత రఘువరుఁ డచ్చట ♦ సంతసమున
ఘనభరద్వాజు వీడ్కొని ♦ గంగ దాఁటి
వచ్చుచుండఁగఁ గోరిక ♦ లచ్చుపడఁగ
భరతుఁ డపరిమితానంద ♦ భరితుఁ డగుచు. 270

మ. చని వీక్షించె విదేహరాజతనయా ♦ సౌమిత్రిసంయుక్తు స

న్మునివేషాంచితు వల్కలాంబరధరున్ ♦ఫుల్లాబ్జనేత్రుఁ ఘనా
ఘనసంకాశవినీలవిగ్రహుఁ ద్రిలో♦కస్వామి నుద్యద్యశో
ధనురాముఁ నయనాభిరాము సుగుణో♦ద్దాముఁ నృపాలో
[త్తముఁ. 271

సీ. శ్రీరామచంద్రుఁడు ♦ సీతానుజసమేతుఁ
డై విమానము డిగ్గి ♦ యపుడు భరతు
శత్రుఘ్ననిని మహా♦సౌజన్యమునఁ గాంచి
గురున కరుంధతీ ♦ వరున కెఱఁగి
కౌసల్యకును గైక ♦ యాసుమిత్రలకును
బ్రియము మీఱఁగ నమ♦స్కృతి యొనర్చి
మఱియుఁ జుట్టంబుల ♦ మంత్రులఁ బౌరులఁ
గారుణ్యరసదృష్టిఁ ♦ గారవించి
రమణఁ బురసతు లిచ్చుహా ♦ రతులఁ గొనుచు
జయజయధ్వను లోలయంగ ♦ సకలవాద్య
ములు చెలంగ మహోత్సాహ ♦ మున నయోధ్య
కొనర వేంచేసి శుభలీల ♦ నుండునంత. 272

గీ. తరుణియును దమ్ములును దాను ♦ గురుననుజ్ఞ
వడసి మునివృత్తి వెడలించి ♦ యెడరుఁ గడచి
సంతసంబున మంగళ ♦ స్నాన మాచ
రించి యున్నంతవిభ్రమ ♦ శ్రీ దలిర్ప. 273

వ. సుమిత్రపిన్నకొమరుఁడు చెన్నలరుసొన్నంపుసన్నఁపువలిపంబు

లన్నలకుఁ బొలుపెసంగ నొసఁగి సుగంధబంధురామోదమా
ల్యామూల్య బహువిధభూషణ భూషితులం గావించి యున్నం
తఁ గోసలరాజపుత్త్రికయు సత్యనురాగంబునఁ గోడలిసభ్యం
గనవిధుల మంగళస్నాతం గావించి పరార్ఘ్యవర్ణవిలసిత దుకూ
లంబులు ధరియింపఁ జేసి కమనీయ నూత్నరత్న చిత్రితహాట
కాలంకారంబుల నలంకృతి యొనర్చి కస్తూరికా ఘనసార హి
మాంబు మిశ్రితచందనం బలందింపఁ జేసి క్రమ కోమల కా
శ్మీరతిలకంబు శృంగారించి నానావిధప్రసూనమాలికలఁ గై
సేసి తక్కినకోడండ్ర నత్యామోదంబునం బెక్కుచందంబుల
నందంబుగాఁ బొందుపఱిచి యున్నంత నొక్క శుభముహూ
ర్తంబున శ్రీరామభద్రుండు సీతాసమన్వితుండై వసిష్ఠ వామ
దేవ జాబాలి కాశ్యపప్రముఖ భూసురాశీర్వాదంబులు నరుం
ధతీప్రముఖ వృద్ధ విప్రపుణ్యాంగనానికర కరవికీర్ణ శుభకరప్ర
సూనాచార లాజాక్షతంబులును, శుద్ధాంతప్రవర్తి సువాసి
నీ సమర్పిత మంగళహారతులనుం గైకొనుచు రాజమందిరంబు
నిర్గమించి రమణీయ విభావరీరమణోపలనిబద్ధ భిత్తికాప్రతిసీర
లును, సమధికారుణప్రభా సముజ్జృంభిత విద్రుమస్తంభంబు
లును, జామీకర సాలభంజికా పుంజకరాంజలి నిక్షిప్త మా
ణిక్యసందోహనీరాజనంబులును, గరుడశిలావితాన రచితగో
పానసీ ఛవిచ్ఛటాపాదిత చారుతోరణంబులును, గవాక్షాంతర
స్థగిత పద్మరాగప్రస్తర గోహితమయూఖ నిరూపిత కుంకుమ

పట్టికా విరాజితహిమాంబు సంసిక్త భద్రహరిద్రచూర్ణాతి సాంద్రావలిప్త తప్తజాంబూనద ద్వారంబులును, వేదవేదాంగపారగ ధారిణీదేవప్రోత్త మోదాత్తాది సుస్వరప్రోచ్చరిత శ్రుతిస్వస్తివాచక నిర్ఘోషంబులును, సమస్తదేశాగత సామంతరాజన్యమండల కలకలంబులును, రాజవంశపరంపరాభిజ్ఞాత ప్రాగల్భ్యసందేశ వందిమాగధ కథామాధురీ ధ్వానంబులును రూపాజీవా రాజీవలోచనాసహస్ర చాతుర్య తౌర్యత్రిక నినాదంబులును, భేరీమృదంగాది వాద్యశబ్దంబులును, గానవిద్యాప్రవీణగాయకానీకముఖరితమురళీశంఖ గీతారావంబులును, సకలజగజ్జనజేగీయమాననినదంబులునుం గలకల్యాణమండపంబునకుం జనుదెంచి ఘుసృణ మసృణ శతసవననీలాశ్మకుట్టిమంబులును, విభ్ర మాదభ్ర శుభ్ర విభ్రాజమాన ముక్తాఫలగ్రథనమతల్లికా రంగవల్లికలును, నిజావరజోపదేశిత ప్రభాకరకుమారాజ్ఞాపిత సుపర్ణపవనజవనసత్వసంపన్న జాంబవద్వేగదర్శిసుషేణర్షభ సమానీత చతురుదన్వదంభఃపరిపూర్ణ శాతకుంభకుంభంబులును, బహువిధపరిమళద్రవ్య సమ్మిళిత చందనచ్ఛటకంబులును, విస్ఫురదిందీవరారవింద కుందమందారకరవీర మాధవీ జాతి చంపక పున్నాగ ప్రధానప్రసూనప్రతాన పాత్రికలును, మృగమద కర్పూర సంవాసిత పూగీఫలాభ్యంచిత పాత్రికలును, సువర్ణవర్ణ తాంబూలవల్లికాపర్ణ సముదీర్ణపాత్రికలును, గరుత్మద్దృష త్ర్వక్షీవసర కోమలధామ

శృంగార దూర్వాంకూర హరిద్రాక్షత శోభితపాత్రికలును గలిగి చెలువొందు కల్యాణవేదికాతలంబునం దత్తద్ధరామరాధీశ్వరుల నర్హపీఠంబులం గూర్చుండ నియమించి తానును నితాంత విలాసభాసుర మనోహరజాతరూప ధగద్ధగిత నవరత్నఖచిత సింహాసనంబున సుఖాసీనుండై భరత లక్ష్మణ శత్రుఘ్నాభిధానానుజన్ములును, సుగ్రీవాంగద హనుమద్విభీషణాది జాంబవత్ప్రధాన సుహృజ్జనంబులును, నిరంతర సంతోషంబున రాజలక్షణలక్షితచ్ఛత్రచామరాద్యుపకరణధురీణులై పురశ్చరమ పార్శ్వకోణభాగంబులం బరివేష్టింప శ్రీమన్మహాగణాధినాథపూజాపూర్వక స్వస్తిపుణ్యాహవాచనమంత్రవిధానంబు గావించి నిఖిలలోకానందంబుగాఁ బరిలబ్ధపట్టాభిషేకమహోత్సవుండై విశ్వవిశ్వంభరాగీర్వాణుల కసంఖ్యధేనుధన రత్నాంబ రాభరణాదు లొసంగితక్కిన జనంబులకుం దత్తదభిమతంబు లిచ్చి సుఖంబున రాజ్యంబు సేయుచుండె నంత

క. సుగ్రీవున కనవరతస
మగ్రానుగ్రహము వెలయ ♦ మనుకులనాథుం
డగ్రియమకుటాంగదవల
యగ్రైవేయాదిభూష ♦ ణావళు లిచ్చెన్. 275

గీ. మఱియు నంగద నల హను ♦ మత్సుషేణ
జాంబవన్నీలముఖ కపి ♦ సత్తములకు
ఘనవిభీషణునకు నలం ♦ కారవాహ

నాంబరాదులు డయసేసి ♦ యనిచె నపుడు. 276

క. తారాముఖశాఖామృగ
తారాధిపముఖుల కెల్లఁ ♦ దల్లులచేతన్
హారాదిసన్నహాళిం
గారాపలు లొసఁగఁజేసి ♦ క్రమ్మఱ ననిచెన్. 277

శా. ఆలించెన్ శ్రుతిశాస్త్రసత్కథితధ ♦ ర్మార్థంబు లార్యాళిచేఁ;
గాలించెన్ భుజవిక్రమాగ్నిఁ బటురిపు ♦ క్షోణీతలాధీశులన్;
దేలించెన్ శ్రితబాంధవాప్తుల సుఖా ♦ బ్ధిన్ గోటికల్ సేకుఱన్
బాలించెం గడుఁ జక్రవర్తులక్రియం ♦ బాటించి భూచక్రమున్.

సీ. పరికింప నతివృష్టి ♦ భయము తద్దతొలంగె;
ధరనవగ్రహావృష్టి ♦ దరము వాసె;
సర్వసస్యసమృద్ధి ♦ సర్వంసహఁ దనర్చె;
జాతవేదస్సాధ్వ ♦ సం బడంగె;
నారామములు సత్ఫ ♦ లాభిరామము లయ్యె;
నామయం బరయ న ♦ నామమయ్యె;
వెండియుఁ బైఁడియు ♦ నిండి యిండ్ల నుండెఁ;
దరుణుల కైదువ ♦ తనము ప్రబలె;
నాయురున్నతి పుత్త్రపౌ ♦ త్త్రాభివృద్ధి
పాఁడి పంటయు ధర్మంబు ♦ ప్రజ్ఞ గలిగి
మనిరి జనులెల్ల నానంద ♦ వనధిఁ దేలి
శ్రీరఘుస్వామి రాజ్యంబు ♦ సేయఁగాను. 279

శా. ఉష్ణస్రోద్వధిరాడ్ధరాశిఖమరు ♦ ద్దోర్వ్యపాంబుయజ్యాకృతీ
జిష్ణుశ్లాఘ్యపురామరారివిజయ ♦ శ్రీఖ్యాతదోర్విక్రమా
యుష్ణీషీకృతశర్వరీప్రియ సుప ♦ ర్ణోర్వీధరేష్వాసనా !
కృష్ణగ్రీవ ! మహీశతాంగ ! భువన ♦ క్షేమప్రదా ! శంకరా.

క. ఖంసితకుండలిమండన
ఖండితశుండాలరూప ♦ కర్బురవీరా
దండితదండధరస్మయ
పండితజనరక్షణీయ ♦ పర్వతగేహా ! 281

మాలినీవృత్తము. రజితకుధరసద్మా ♦ రంజితార్యాత్మపద్మా
భుజగవరకలాపా ♦ భూరిశైలేంద్రచాపా
విజితపురపలాశా ♦ విశ్వలోకప్రకాశా
కుజనహిమపతంగా ♦ కుక్కుటాకారలింగా. 282

గద్య:— ఇది శ్రీమత్కుక్కుటేశ్వరానుగ్రహప్రభూతకవిత్వ
వైభవ విశ్వామిత్రగోత్రపవిత్ర వారణాసివంశపారా
వారకైరవమిత్ర విద్వన్నుతచరిత్ర కామయార్య
పుత్ర సుకవిజనవిధేయ శ్రీవేంకటేశ్వరనామ
ధేయ ప్రణీతంబైన రామచంద్రో
పాఖ్యానం బనుమహాప్ర
బంధంబునందు సర్వం
బును షష్ఠాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ